# భారతి

సాహిత్య మాసపత్రిక
మార్చి 1981

వెన్నెల్లో కొబ్బరిచెట్టు

ముఖంపుల్ల

ావి రంగారావు

ప్రతిజ్ఞ

బులుసు వేంకటేశ్వరులు

ర్షం కరుగుతున్న దృశ్యం

ా మ్మోహనరాజు

డబ్బున్నోళ్లంటే...

రంధి సోమరాజు

మధ్యయుగంలో ఉన్నత విద్య

విశ్వనాధం బత్తినేని

హరిజనుల దృక్పథము

జనార్దన్ – సుదర్శన్

ఇంకా రాజేశ్వర్, శ్రీనివాసులు, కోడంపవన్, రామచంద్రయ్య, వేణుగోపాల్, భద్రన్న, రఘువర్మ, పూర్ణ, చైతన్య, తిలక్, హరినాథ్, ప్రకాశరావు, శేషాచార్యులు, లింగమూర్తి–రామయ్య, మహతీశంకర్, వాసుదేవశాస్త్రి, చలపతి ఇతరుల రచనలు.

వ్యవస్థాపకులు
దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు

# భారతి

మాసపత్రిక



శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

(1938-1972)



మార్చి 1981

సంపుటము : 58 సంచిక : 3

విడిప్రతిక వెల రెండు రూపాయలు

# విషయానుక్రమణిక

## మార్చి 1981



(*)

# ప్రతిజ్ఞ

## శ్రీ బులుసు వేంకటేశ్వరులు

ఉ. మానవ మానవా! పనికిమాలిన యీమృగతృష్ణ వెంబడిన్
కానక కన్ను మిన్ను వృథగాఁ జను టింక? వివేక మింతయున్
గానవు వస్తుతత్త్వమును గానవు కానవు జీవితోన్నతిన్
మానవజన్మ ముత్తమము మానుము దీనిని వ్యర్థపుచ్చుటల్.

చ. విలుచునదేదొ లోకమున విల్వనిదేదొ యెఱుంగ వింతయున్
తలఁపవు సంప్రదాయమును తద్జ్ఞులు చెప్పిన మంచిమాటలన్
నిలుపవు వీనుదోయిఁ గడు నీదె యగున్ తెలివంచు బంగరున్
పొలమున కేఁగఁబోయి త్వరఁ బోదువు వట్టి యెడారి భూమికిన్.

క. నీకున్న తెలివి పూర్వులు
లేకుండిరె? తొల్లి పెద్దలే అజ్ఞులె?' ని
ర్వ్యాకులచిత్తులు విజ్ఞులు
నీ కొఱకే పలికియుండ్రి నీ మేలునకే.

చ. నియమము నీతి ధర్మమును నిస్తుల మానవమాత్రముల్ వృథా
వ్యయమగు జన్మమెల్లఁ బరిపాటిగ వీనిని వీడినన్ సదా
భయమును గొల్పు నన్యపథ వర్తివి గాకుము స్వీయధర్మమున్
స్వయముగఁ బాటిచేయు మది స్వర్గముకన్నను మిన్న యెన్నఁగన్.

చ. అనుభవసార మెంతయు నయాచిత సత్కృప నీకుఁ బ్రీతి ని
చ్చిన మహనీయులన్ దలఁపు శ్రేష్ఠ హితైషులు గాఁగ నిల్పు నీ
వెనుకటి దేశగౌరవము విజ్ఞతతో వెలుఁగొందు మిందు నం
దును గను మాత్మతత్త్వమును తోడనె జన్మము సార్థకంబుగన్.

ఉ. నేలను వీడు సాము మఱి నింగియె లేని జగమ్ము వమ్ము స్వే
చ్ఛాలన మైన నందకుము చాల పరేచ్ఛకు భంగమైనఁ బ
ట్టాలవి లేవి ధూమశకటంపుఁ బ్రయాణము ప్రాణఘాతుకం
బౌ లవినీతిధర్మముల నందని జీవితముల్ ప్రమాదముల్.

చ. పరమ పవిత్ర భారతము ప్రస్తుతికెక్కెను నీతిధర్మ వి
స్ఫురతకు నందుఁ బుట్టి కడుపుం గడు నింప నధర్మవృత్తికిన్
జొరఁదగునే స్థిరంబులొకొ చూడఁగ జీవితముల్ ధరిత్రిపై
వరమతి ధర్మమున్ నిలుపఁ బట్టు ప్రతిజ్ఞను మానవా! నవా!



# అంతరాల అలజడిలో

తర తరాలుగా
  మా వంశంలో వస్తున్న చీకటి పువ్వులతో
నా ముంగిట్లో
తోరణాలుకట్టి వెలుగు దొరలను ఆహ్వానిస్తున్నా
కానీ
పేరులోకూడా
వెలుగును తప్ప మరేమీ సహింపలేని ఆ దొరలు
నీ గుమ్మంలో అడుగెట్టమని
శపథంచేసి మరీ పారిపోతున్నారు
ఆకాశంలో వెన్నెల అల్లికలు చూచినప్పుడల్లా
వడ్లగింజ ముక్కంతయినా
మా వసారాలో వాలదా అని ఆశపడ్తుంటాను
కానీ ఫలితం గగన మవుతోంది
చీకటి తోరణాలను ఇంటినుండి గెంటివేద్దామంటే
నేనసలే అవిటివాణ్ణి
అవే ఆసరాగా ఇంతకాలం నడుపుకొస్తున్నవాణ్ణి
వెన్నెల వెలుగులు ప్రసరింపకపోయినా
పట్ట పగలు సూర్యుడి మంటలు మాత్రం
నా వసారా సందులగుండా
నన్ను పలుకరిస్తూనే వుంటాయి
ఏదో యొకరోజు
సూర్యుడి మంటలు మా ఇల్లంతా నిండినరోజు
నేను లేని సత్తువ తెచ్చికొనైనా లేచి
మంటలన్నీ ప్రోగుచేసి
నా ఇంట్లోనే రాశిపోస్తాను
అయితే
పారిపోయే చీకటిని మాత్రం పరిహసించను
వెలుగుతో స్నేహం కలిపి
రెండిటిని నా రెండు కళ్ళలో నిలుపుకుంటా !

# కాగితం పువ్వు

హిమాలయాల కొనలు
  ఆరని సిరిమల్లెలుగా
నీ సిగలో నిలిచినరోజు
నా చూపుల్లోని వేడి
రెప్పదాటి ముందు కురకాలంటే
ఎంతో భయపడిపోయేది
కానీ
అవే రాటుదేలిన కొనలు
చురకత్తుల్లా నీ కళ్ళలో నిలిచిననాడు
నవనీతంలాంటి నా మనసు
బయటపడాలన్నా బెదిరిపోతోంది
ఏ బండ శిలనో తన ప్రతినిధిగాజేసి
తానొక శిల్పంలో ఒదిగిపోతానంటోంది
నేనే ఒక సజీవ శిల్పమని
నీవే ఆ శిల్పానికి ఊపిరని
భ్రమపడిననాకు
ఇప్పుడిప్పుడే ఆకళింపు కొస్తోంది
నేను శిల్పాన్నికాదు కేవలమొక జీవచ్ఛవాన్ని
నీవు ఊపిరివికావు కేవలం గాలివి
నిత్య సంచారశీలవు.

శ్రీ సూరం శ్రీనివాసులు



# వేలూరి శివరామశాస్త్రి - పిసుపాటి చిదంబరశాస్త్రిగారల పద్మపురాణములు

## ఒక తులనాత్మక పరిశీలన

ఆధునిక యుగమున వెలసిన పద్మ పురాణములలో మొదటిది వేలూరి శివరామశాస్త్రిగారి అముద్రిత పద్మ పురాణము. రెండవది పిసుపాటి చిదంబరశాస్త్రిగారి "శ్రీ మదాంధ్ర పద్మ పురాణము." శివరామ శాస్త్రిగారును, చిదంబరశాస్త్రిగారును ఇంచు మించు సమాన వయస్కులు. సహాధ్యాయులు. ఆగిరిపల్లిలో అపర పతంజలి యని ప్రసిద్ధి గాంచిన శ్రీ జయంతి భగీరథశాస్త్రులవారి సన్నిధిలో ఇరువురును వ్యాకరణాధ్యయనం చేసినవారు. ఇరువురును శతావధానులు. అంతే కాదు — చిదంబర శాస్త్రిగారు తమ వద్దనే అవధాన విద్యను అభ్యాస మొనర్చినట్లు 'శతావధానం' అను వ్యాసములో శివరామశాస్త్రిగారే వ్రాసినారు. 16–2–1910వ తేదీన ఆగిరిపల్లిలో గణపతి నవ రాత్రములలో చిదంబర శాస్త్రిగారి మొట్ట మొదటి అష్టావధానము జరిగినది. అంతకు ముందు రోజునే శివరామశాస్త్రిగారి అవధానము కూడ అక్కడే జరిగినది. దీనిని బట్టి శివరామశాస్త్రిగారు—చిదంబర కవీంద్రులు అవధాన ప్రదర్శనలో కూడ సహచరులే యనుట తేట తెల్లము.

### గ్రంథ రచనా కాలము

1921 లో ఏలూరులో జరిగిన దివాకర్ల తిరుపతిశాస్త్రిగారి స్మారక సభకు వెళ్లినపుడు, పద్మ పురాణముతో సహా సర్వ సాహిత్యమును చోరులచే అపహరింపబడినట్లు శివరామశాస్త్రిగారి ప్రియశిష్యులైన శ్రీ చాడ సుబ్రహ్మణ్య చయనులుగారు తమ గురువుగారిని గురించి వ్రాసిన వ్యాసములో పేర్కొనినారు. దీనినిబట్టి అంతకు ముందే శివరామశాస్త్రిగారి పద్మ పురాణ రచన పూర్తియైనట్లు భావింపవలసియున్నది. కాబట్టి శివరామ కవి పద్మ పురాణ రచనా కాలము 1920 అని నిర్ణయింపవచ్చును.

పిసుపాటి వారి పద్మ పురాణ రచనా కాలము 1942 – 1951. శ్రీ మదాంధ్ర పద్మ పురాణములో పిసుపాటి సుబ్రహ్మణ్య శాస్త్రి, విశ్వేశ్వరశాస్త్రి (కవి సోదరులు) గారలు వ్రాసిన 'కవి జీవితము'లో 1942 ఆగస్టు నెల మొదలు 1948 ఆగస్టు నెల వరకు ఆది, భూమి, బ్రహ్మ, పాతాళ ఖండములు సమగ్రముగా నాంధ్రీకరించి నట్లును, 14-11-'48 నుండి 15–3–'51 వరకు కరేడు గ్రామములో శ్రీ ఇంగువ శ్రీకృష్ణయ్యగారి ప్రాపకములో నుండి సృష్టి ఖండము, ఉత్తర ఖండముతో సహా పద్మ పురాణ రచనమును చిదంబర కవీంద్రులు ముగించి పునః పరిశీలనము కూడ కావించినట్లును తెలిపినారు. (శ్రీ మదాంధ్ర పద్మ పురాణము — కవి జీవితము — 41, 42 పుటలు). అనగా శివరామశాస్త్రిగారు పద్మ పురాణము వ్రాసిన పిదప ముప్పదేండ్లకు పిసుపాటివారి పద్మపురాణము పూర్తి యైనదని తెలియును.

సహపాఠులు, సహచరులు, సమవయస్కులు, సమస్కంధులునైన సాహితీ వ్రతు లిరువురు ఒకే గ్రంథమును అనువదించుట అతి విచిత్రము. కాని ఇట్టి ఘట్టములు ఆంధ్ర వాఙ్మయ చరిత్రములో అపూర్వములు మాత్రము కాదు. ఎఱ్ఱన సోమనలు ఇంచుమించు ఒకే కాలమున హరి వంశములను వెలయించుట మనకు తెలియనిది కాదు. అట్లే దూబగుంట నారాయణకవి, బైచరాజు వేంకటనాథుడు అను కవి యుగళము ఒకే యుగమునందు పంచతంత్రమును పద్యరూపమున అనువదించినారు!!

### శివరామశాస్త్రిగారి పద్మ పురాణము

వేలూరి వారి పద్మ పురాణము సమగ్రముగా లభించ లేదు. ఆది ఖండము, భూమి ఖండము, బ్రహ్మ ఖండము అను మూడు ఖండములు మాత్రమే కలవు. చోరులచే అపహరింపబడి పోయినవి పోగా ఈ దొరికినవి దాని చిత్తు ప్రతి కావచ్చును. ఇట్లు తలంచుటకు హేతువులు ఈ మూడు ఖండముల యందును మధ్య మధ్య కొన్ని పుటలు లేవు. అట నట కొట్టివేతలు దిద్దుబాట్లును ఉన్నవి. ఆది ఖండములో ప్రథమ—ద్వితీయ—తృతీయ—చతుర్థాశ్వాసములలో 455 గద్య పద్యములు; భూమి ఖండములో చతుర్థాధ్యాయము నుండి తుది వరకు 1518 గద్య పద్యములు; బ్రహ్మ ఖండము — ఏకాశ్వాస

మున 267 గద్య పద్యములు — మొత్తం 2240 గద్య పద్యముల గ్రంథము వేలూరి వారి పద్మ పురాణము.

లభించినంత మేరకు శివరామశాస్త్రిగారి పద్మ పురాణము నందలి విషయ సూచిక ఇట్లున్నది :—

# ఆ ది ఖం డ ము

## ప్రథమాశ్వాసము

పురాణ ప్రస్తావము — శ్రవణ ఫలము
ఆది సృష్టి — పంచ భూతోత్పత్తి
మేరు చతుర్దిక్ప్రదేశ వర్ణనము
వర్ష పర్వత నామ వర్ణనము
భారత వర్ష నదీ పర్వత దేశ నామములు
భారత హైమవత వర్ష ప్రమాణ కథనము
శాక ద్వీపాది వర్ణనము
సాగర క్రౌంచాది ద్వీప వర్ణనము

## ద్వితీయాశ్వాసము

తీర్థ ఫల పృథివీ ప్రదక్షిణ ప్రశ్నము
తీర్థ మాహాత్మ్యము
నర్మదా మాహాత్మ్యము
భృగు చరిత్రము
నర్మదా మాహాత్మ్య కథ
శాప మోక్షము
[తరువాత నాలుగు పుటలు అలభ్యము]

## తృతీయాశ్వాసము

కురుక్షేత్రాదుల మాహాత్మ్యము
యమునా మాహాత్మ్యము
శ్రీ కుండల వికుండల చరిత్రము
వారాణసీ మహిమ వర్ణనము
కృత్తివాసేశ్వర మాహాత్మ్యము
కపర్దీశ మాహాత్మ్యము
పిశాచ విమోచన తీర్థ మాహాత్మ్యము
మధ్యమేశ మాహాత్మ్యము
అన్య తీర్థ కథనము

## చతుర్థాశ్వాసము

ప్రయాగ మాహాత్మ్య ప్రారంభము
ప్రయాగ సమీప తీర్థ వర్ణనము
క్షేత్రదాన మాహాత్మ్య వర్ణనము
యమునా మహాత్మ్యము
కర్మ యోగము
నానా విధ కర్మ యోగ కథనము
అధ్యాయ విధి
అనధ్యాయములు

# భూ మి ఖం డ ము

[మొదటి మూడధ్యాయములు అలభ్యము.]

శివశర్మోపాఖ్యానము
ఇంద్రాభిషేకము
దితి విలాపము
దేవాసుర ప్రకరణమున శరీరోత్పత్తి కథనము
అధ్యాత్మ కథనము
దితి సంబోధనము
దైత్య తపశ్చర్యా ప్రవృత్తి
సువ్రతోపాఖ్యానము
సోమశర్మ సుమనా సంవాదము
సుమనోపాఖ్యానము
సువ్రతోత్పత్తి
సువ్రతోపాఖ్యానము
బలదైత్య వధ
వృత్రాసుర వధ
మరుదుత్పత్తి
పృథుచరిత ప్రస్తావము
పృథూపాఖ్యానము
వేనుడు స్వర్గమును పొందుట
వివిధ దాన ధర్మములు
సుకలా చరితము
సుదేవోపాఖ్యానము

## తృతీయాశ్వాసము

సుదేవా చరితము
పద్మావతీ చరితము
సుకలా చరిత్రము

## చతుర్థాశ్వాసము

యయాతి చరిత్రము
[నాలుగు పుటలు అలభ్యము]

## పంచమాశ్వాసము

సువీరుడను వైశ్యుని చరిత్రము
దివ్యాదేవీ చరిత్రము
పంచ మహా పాతకి చతుష్ఠయో పాఖ్యానము
సుబాహు చరితము

# బ్రహ్మ ఖండము

## ఏకాశ్వాసము

సూత శౌనక సంవాదమున దండ కాఖ్యానము
కార్తిక మాహాత్మ్యము
జయంతీ వ్రత మాహాత్మ్యము
శ్రీధర చరిత్రము
చంచలాపాంగీ చరిత్రము
రాధా జన్మాష్టమీ మహిమ
సముద్ర మథనము
శ్యామ బాలా చరిత్రము
దీననాథ చరిత్రము
కృష్ణ జన్మాష్టమీ వ్రత మాహాత్మ్యము
భీమోపాఖ్యానము
ఏకాదశీ మాహాత్మ్యము
ఏకాదశీత్వ పరిష్కారము
వల్లభహేమ ప్రభోపాఖ్యానము
కాలద్విజో పాఖ్యానము
సుదర్శన చరిత్రము
కలిప్రియోపాఖ్యానము
తులసీ మాహాత్మ్యము
దండకరోపాఖ్యానము
దాన ఫలము
విష్ణు నామోచ్చరణ మాహాత్మ్యము
వీర విక్రమోపాఖ్యానము

ఈ విషయ సూచిక ఆనందాశ్రమ సంస్కృత గ్రంథావళిలో ప్రచురింపబడిన పద్మపురాణ ప్రతి (1893)లోని విషయసూచికతో చాల వరకు సంవదించుచున్నది. శివరామశాస్త్రిగారి గ్రంథములో ఇంచు మించు సమగ్రముగా లభించినది ఆది ఖండమే కావున ప్రస్తుతమునకు మూలము నందలి ఆది ఖండ విషయ సూచికతో పోల్చి చూతము.

# మూలమునందలి విషయసూచిక

## ఆది ఖండమ్

| | | |
|---|---|---|
| పురాణ ప్రస్తావః శ్రవణ ఫలంచ | 1 | అధ్యాయ |
| ఆది సర్గ కథనం పంచ మహా భూతోత్పత్తిశ్చ | 2 | ,, |
| నవఖండ సహిత జంబూద్వీప వర్ణనమ్ | 3 | ,, |
| మేరు చతుర్దిక్ప్రదేశ వర్ణనమ్ | 4 | ,, |
| వర్షాణాం పర్వతానాం నామాని వర్ణనం చ | 5 | ,, |
| భారత వర్ష వర్ణనం, తదం తర్గతానాం నదీనాం పర్వతానాం దేశానాం చ నామాని | 6 | ,, |
| భారత వర్షస్య హైమవతస్య చ ప్రమాణ కథనమ్ | 7 | ,, |
| శాక ద్వీప వర్ణనమ్ | 8 | ,, |
| సప్తసాగర వర్ణనమ్, క్రౌంచాది ద్వీప వర్ణనమ్ | 9 | ,, |
| ధర్మ నారద సంవాదే, పృథ్వీ ప్రదక్షిణా ఫల వర్ణన ప్రశ్న | 10 | ,, |
| తీర్థయాత్రా వర్ణనమ్ పుష్కర మాహాత్మ్య కథనం చ | 11 | ,, |
| పుష్కర సమీపస్థ నానావిధ తీర్థనామ కథనమ్ | 12 | ,, |
| నర్మదా మాహాత్మ్య వర్ణనమ్ | 13 | ,, |
| జలేశ్వర తీర్థోత్పత్తి కథనమ్, త్రిపుర దహనోపక్రమః | 14 | ,, |
| త్రిపుర దహనమ్, అమరకంటక తీర్థ వర్ణనమ్ | 15 | ,, |
| కావేరీ నర్మదా సంగమ మాహాత్మ్య కథనమ్ | 16 | ,, |
| నర్మదోత్తరకూల నికట స్థిత వివిధ తీర్థ వర్ణనమ్, నర్మదా స్తోత్రమ్ | 17 | ,, |
| నర్మదా దక్షిణకూల సమీపస్థ నానావిధ తీర్థ వర్ణనమ్ | 18 | ,, |
| నర్మదా నికట స్థిత శుక్ల తీర్థ స్యోత్పత్తి కథనం వర్ణనం చ | 19 | ,, |
| నర్మదా సమీపస్థ నరకాభిద తీర్థ మాహాత్మ్య కథనమ్, దశాశ్వమేధ తీర్థ వర్ణనమ్, భృగు తీర్థోత్పత్తి కథానకమ్ | 20 | ,, |
| విహంగేశ్వరాది తీర్థానాం వర్ణనమ్, నర్మదోదధి సంగమ మాహాత్మ్య వర్ణనమ్, తీర్థమాహాత్మ్య పఠన ఫలమ్ | 21 | ,, |
| నర్మదా జలకణ స్పర్శాద్గంధర్వ కన్యా శాప మోచన రూప చరితోపక్రమః, గంధర్వ కన్యానాం ఋషి కుమారస్యచ పరస్పర శాప ప్రదానాత్పిశాచయోని గమనమ్ | 22 | ,, |

ఈ అరవై రెండు అధ్యాయములున్న ఆది ఖండములోని శ్లోక సంఖ్య 3160. వీనిని శివరామశాస్త్రిగారు దాదాపు 500 గద్య పద్యములుగా అనువదించినారు.

## పిసుపాటివారి పద్మ పురాణము

పద్మ పురాణమును సంపూర్ణముగా ఆంధ్రీకరించి ఆంధ్ర భారతికి హారతి పట్టిన భాగ్యము చిదంబర కవీంద్రుల కొక్కరికే దక్కినది. నేటికిని తెలుగులో లభించు సమగ్ర పద్మ పురాణ మిదొక్కటియే! విశేషమగు వ్యయ ప్రయాసలకోర్చి ఈ మహాగ్రంథమును రసజ్ఞుల సహాయ సహకారములతో నాలుగు సంపుటములుగా ముద్రించి తెలుగు జాతికి సమర్పించి ధన్యులైనారు కవిసోదరులైన సుబ్రహ్మణ్య శాస్త్రిగారు–విశ్వేశ్వరశాస్త్రిగారు.

## తులనాత్మక పరిశీలన

తులనాత్మకమైన దృష్టితో పరిశీలించినచో వేలూరి — పిసుపాటి వారల పద్మ పురాణములకు విషయము నందును, రచనా విధానము నందును కొన్ని సాదృశ్య వైదృశ్యములు గోచరించును. అందు కొన్ని ప్రధానమయినవి :

(అ) వేలూరివారి పద్మ పురాణములో అవతారికా భాగము లేదు; పిసుపాటి వారి పద్మపురాణము మంగళ శ్లోకముతో ఆరంభమై దేవతాప్రార్థన, గురు వందనము, సుకవి పురస్కారము, భాగ్య సంస్తవము, కృతి సమర్పణము, మున్నగు అంశములతో కూడిన అవతారిక

ఉన్నది. లోకానుగ్రహార్థమై వారాణసీ క్షేత్రము నిత్య నివాసముగా గల విశ్వేశ్వరునకు ఉపాయనముగా కవి ఈ కావ్య కుసుమమును సమర్పించినారు.

(ఆ) వేలూరి వారి పద్మ పురాణములో ప్రతి ఖండమును ఆశ్వాసములుగా విభజింపబడియున్నది. చిదంబర శాస్త్రిగారి పద్మ పురాణములో ఇట్టి ఆశ్వాస విభజనము కనిపింపదు.

(ఇ) మూలములో ఆదిఖండమునందు 3160 శ్లోకము లున్నవి. వీనిని వేలూరివారు సుమారు 500 గద్య పద్యములుగా అనువదింపగా, పిసుపాటివారు 835 గద్య పద్యములుగా అనువదించి నారు. అనగా వేలూరి వారి కంటె పిసుపాటి వారి అనువాదమున గ్రంథ పరిమాణము పెరిగినది.

(ఈ) శౌనకాది మహామునుల కోరికపై సూతుడు పద్మ పురాణమును వినిపించుటకు ఉద్యమించుట రెండింటను సమానము. కాని ఈ భాగమును వేలూరి వారు "పురాణ ప్రస్తావము — శ్రవణ ఫలము" అని పేర్కొనగా, పిసుపాటివారు "పద్మ పురాణ ప్రవచ నారంభము" అను ఉపశీర్షిక నుంచిరి.

(ఉ) వేలూరి వారి గ్రంథములో పద్మ పురాణ నామ నిర్వచ నము లేదు. పిసుపాటి వారు పురాణ నామ నిర్వచన మొనర్చినారు :

"హరినాభి పద్మ వార్తా
కరమై, తల్లక్షణములఁ గ్రాలుట చేతన్
సుర వర లోకంబులలో
బరగెఁ బురాణంబు గూడఁ బద్మము నాఁగన్."

(ఆదిఖండ — 49వ పద్యము)

నామ నిర్వచనమేకాక, పద్మపురాణ శ్రవణ దీక్షా విధి కథనమును కూడ పిసుపాటివారు కూర్చినారు. మున్ను భీష్మునకు పులస్త్యుడు చెప్పినట్లు సూతుడు కథా ప్రవచన మారంభించినాడు. ఈ విష యము వేలూరి వారి పద్మ పురాణములో ప్రస్తావింపబడలేదు.

(ఊ) శివరామశాస్త్రిగారు సూతుని ముఖముగా ఆదిసృష్టి, పంచ భూతోత్పత్తి మొదలగువానిని విపులముగా వర్ణింపగా, కల్పాంత మందు సర్వసృష్టిని తన కుక్షిలో నిలిపిన విష్ణుమూర్తి బాల రూప మున మార్కండేయునకు సృష్టి రహస్యమును చెప్పినట్లు చిదంబర శాస్త్రిగారు పేర్కొనినారు. అంతేకాక ఈ విషయము నంతటిని వారు ఒక సీసమునందే (ఆదిఖండ—80 పద్యము) తేల్చివేసినారు.

(ఋ) వేలూరి వారు విపులముగా వ్రాసిన ఘట్టములు పెక్కింటిని పిసుపాటివారు సంక్షిప్త మొనర్చిరి. నానావిధ ద్వీపపర్వత ములను వర్ణించు సందర్భమున వేలూరి వారు సుదర్శన, పిప్పల, శక ద్వీపములను నాలుగు పద్యములలో వర్ణింపగా, పిసుపాటివారు రెండు పద్యములలోనే చెప్పిరి. ఇట్లే మేరుపర్వతమును వేలూరి వారు 9 పద్యములలో వర్ణింపగా పిసుపాటివారు 7 పద్యములలో వర్ణించిరి. ఇది అంతగా పరిగణింపదగిన అంశము కాదు.

(ౠ) వేలూరివారు సంగ్రహముగా చెప్పిన వానిని చిదంబర శాస్త్రిగారు పెంచి వ్రాసినారు. వారాణసీ మాహాత్మ్యమును శివరామ శాస్త్రిగారు ఆరు పద్యములలో వర్ణింపగా, చిదంబరశాస్త్రిగారు ఆరు వది పద్యములలో వ్రాసిరి. శివరామశాస్త్రిగారు "యమునా మాహా త్మ్యము"ను ఏడు పద్యములలో వర్ణింపగా, చిదంబర శాస్త్రిగారు ముప్పది యైదు పద్యములలో విపులీకరించిరి. ఇట్లే ప్రయాగ మాహాత్మ్య కథనము.

(ఌ) శివరామశాస్త్రిగారు పద్యములో చెప్పిన విషయమును చిదంబరశాస్త్రిగారు గద్యమునందు చెప్పిరి. ఉదాహరణమునకు : హేమకూట, నిషధ, మాల్యవంత, గంధమాదన, మేరు పర్వత విశేష ములను వేలూరి వారు అయిదు పద్యములలో వర్ణింపగా చిదంబరులు గద్యములో గుది గ్రుచ్చినారు. ఇట్లే శివరామశాస్త్రిగారు "వర్షపర్వత నామ వర్ణనము" అను ఉప శీర్షికతో నిషధ, రమణక, నీలపర్వతాదు లను, హిరణ్మయ ఐరావతాది వర్షములను ఏడు పద్యములలో వర్ణిం పగా, చిదంబరశాస్త్రిగారు ఈ భాగము నంతటిని వచనములో చెప్పిరి. (ఆది ఖండము — 14 పుట)

భారత వర్ష నదీ పర్వత దేశ నామముల వర్ణనము శివరామ శాస్త్రిగారు ఒక మత్తేభము నందును మంజరీ ద్విపద యందును సంక్షిప్తముగా చెప్పగా, పిసుపాటివారు మూడు పుటల సుదీర్ఘమగు వచనములో చెప్పిరి. (ఆది ఖండము — 15, 16, 17 పుటలు)

సాగర క్రౌంచాది ద్వీప వర్ణనము శివరామశాస్త్రిగారు పద్య ములో చేయగా, ఈ భాగమును చిదంబరులు వచనములో నడిపిరి. సప్తగంగల వర్ణనము పిసుపాటివారు గద్యలో చెప్పగా, వేలూరి వారు మత్తేభ వృత్తములో చెప్పిరి :

"అల గంగానది యందునే వెలసి
తోడ్తో బ్రహ్మలోకంబునం
దుల నుండిం దిగజాలు వారి ముని
ముందున్ 'సింధు' సీతాఖ్య లన్
'నలినీ' నామ, 'వటోదకా'భిదల నంతం
బొల్చి, జంబ్వాఖ్యచే
నెలమిం 'బావని' నా, 'సరస్వతి' యనా
నే పొందె నేడాఖ్యలన్."

(వేలూరి, ఆదిఖండ — 70 పద్యము)

## మార్పులు - చేర్పులు

(ౡ) శివరామశాస్త్రిగారు ఆది ఖండము ద్వితీయాశ్వాస ములో నర్మదా మాహాత్మ్య కథ అను ఉపశీర్షికతో గంధర్వ కన్యా విప్రతనయుల శాప విమోచన కథను దాదాపు నూరు పద్యములలో అభివర్ణించిరి. ఇది మూలమునందు ఆదిఖండములో లేదు. ఉత్తర ఖండములో నున్నది.

ఈ వృత్తాంతమును చిదంబరశాస్త్రిగారు యథా మూలముగా ఉత్తర ఖండమునందే యుంచినారు. మడికి సింగన పద్మ పురాణోత్తర ఖండమందు తృతీయాశ్వాసములో ఈ కథను పరమ రమణీయముగా రచించినాడు.

(ఎ) శివరామశాస్త్రిగారు నానావిధ తీర్థ మహత్త్వమును మిక్కిలి సంక్షిప్తముగా వర్ణించుచు త్రిపుర సంహార వృత్తాంతమును వదిలిపెట్టినారు — చిదంబర శాస్త్రిగారు ఈ వృత్తాంతమునుగైకొని జ్వాలేశ్వర తీర్థ మాహాత్మ్యమును విపులముగా వర్ణించినారు.

(ఏ) కాళిందీ మహత్వ ప్రసంగమున శివరామ శాస్త్రిగారు శ్రీకుండల వికుండల చరిత్రమును 50 పద్యములలో అభివర్ణించిరి. చిదంబర శాస్త్రిగారు ఏలకో ఈ కథను విడిచి పెట్టిరి.

మడికి సింగన పద్మ పురాణోత్తర ఖండము నందు ద్వితీయాశ్వాసమున ఈ కథా భాగమున్నది.

(ఐ) ఆదిఖండము ద్వితీయాశ్వాస ప్రారంభములో సతీ సోదరులతో వనవాసము చేయుచున్న ధర్మజునకు నారద మహర్షి తీర్థ భూ ప్రదక్షిణములను వివరించుచు, పూర్వము దిలీపుడు వసిష్ఠునకు చెప్పిన విశేషములనే సూతుడు తాను శౌనకాదులకు చెప్పుచున్నట్లు శివరామశాస్త్రిగారి గ్రంథమున నున్నది.

చిదంబరశాస్త్రిగారు ధర్మజాదుల వృత్తాంతమునే తడవలేదు. దిలీపుడు వశిష్ఠుని దగ్గరకు వచ్చుటయు, వచ్చి తీర్థయాత్రాటన భూ ప్రదక్షిణముల ఫలమును చెప్పుమని కోరుటయు కూడ వదిలి పెట్టిరి.

(ఒ) నర్మదా మాహాత్మ్యము, భృగు చరిత్రము, కృత్తివాసేశ్వర, కపర్దీశ్వర, మధ్యమేశ్వర, పిశాచమోచన తీర్థ మాహాత్మ్యములు రెండింట సమానము.

ఛందో భేదము తప్ప ఆచమన విధి రెండింటియందును ఉన్నది.

# ఛందో విశేషములు

(క) ఆదిఖండము నందలి ఛందో విశేషములను పరిశీలించి నచో శివరామశాస్త్రిగారికి వృత్తములపై మక్కువ ఎక్కువ యనిపించును. ఒక్క ఈ ఖండమునందే దాదాపు నూట డెబ్బది యైదు (175) వృత్తము లున్నవి. చిదంబర పండితులకు కందములన్నను గీతములన్నను ప్రీతి అధికము కాబోలు ఆదిఖండమంతట వెదకి చూచినను ముప్పదియైదు వృత్తములకు మించిలేవు. కందములు గీతములు కలిపి దాదాపు 570 ఉండవచ్చును.

(ఖ) శివరామశాస్త్రిగారు మంజరీ ద్విపద, పృథ్వీ, మధ్యాక్కరాది విశేష వృత్తములను కూడ రచించిరి. కాగా చిదంబరశాస్త్రిగారు స్రగ్విణి, తోటకము, దండకములను కూర్చి ఛందో వైవిధ్యమును పాటించిరి.

(గ) ఒకే సన్నివేశము రెండు గ్రంథము లందును భిన్నభిన్న పద్యములలో రచింపబడుట గమనార్హమగు అంశము. శివరామశాస్త్రిగారి గ్రంథములో సీసము లున్నచోట చిదంబర కవీంద్రులు కందములు వ్రాసిరి; అట్లే శివరామశాస్త్రిగారు వృత్తములు వ్రాసినచోట చిదంబరశాస్త్రిగారు కందములో గీతములో వ్రాసిరి: — చూడుడు.

## I. శౌనకాదులు పురాణ కథను చెప్పుమని యడుగుట

"విన్నాము మును మహా విపుల పుణ్య పురాణ
కథ లెల్ల నీ ముఖాగ్రంబు నుండి
మన్నాము సతము శ్రీమదిరేక్షణా చిత్త
పంకేజ భాస్కరు భక్తిదవిలి
ఉన్నా మిపుడు కూడ నుడ్డ కేలు గలాని
విమల కథార్థముల్ వినెడు నాస
చన్నాము హరిభక్తి సంపాదన మొకండె
పరమ ధర్మంబని యరయువట్టు
విష్ణు చరితమ్ము లేనట్టి వెట్టి కథలు
వల్లకాడు లనం జను వార్త జేసి
హరి యెసంగు పురాణంబు నరసి చెప్పు
మయ్య! నదియు శాస్త్ర తుల్యంబు గాగ!
(వేలూరి, ఆదిఖండ—4 పద్యము)

## పిసుపాటి వారి కందములు

వినినార మెన్ని మాఱులో
వనజాక్షుని చరితములను వారును వీరున్
వినిపింప, వినిన కొలదిని
వినవలయు నటంచు నుద్భవించెడిఁ గోర్కుల్.

హరి పారమ్యముఁ దెలిపెడి
హరినాభి సరోజ విషయమంతయును సవి
స్తరముగ నెఱిఁగించెడి యొక
పురాణమును జెప్పుమయ్య పూత చరిత్రా!
(ఆదిఖండ—42, 43 పద్య)

## II. వేలూరి వారి మత్తేభము

"హరి మాహాత్మ్య పవిత్ర మీ పెను పురాణార్థంబు సర్వంబునున్
హరియే బ్రహ్మకుఁ దెల్పెఁ దొల్లొలుత, నయ్యాతండు దేవర్షికిం
బరగం జెప్పె, నతండు మా గురునకున్ వ్యాఖ్యానముంజేసె, మా
గురువున్ మాకు వచించె సంచిత కళా గూఢార్థ భాగంబులన్."
(ఆదిఖండ — 12 పద్యము)

## పిసుపాటి వారి గీతము

"ఆ పురాణంబు హరిబ్రహ్మ, కతడు నార
దున, కతండు పరాశర తనయునకును,
నతడు నాకును నెఱిగించె, నదియె మీకు
నే నెఱిగింతు నిప్పుడు మౌనులార!"
(ఆదిఖండ – 54 పద్యము.)

# III. ఉత్తర కురుభూములలో వృక్ష సమూహము

## వేలూరి వారి ఉత్పలమాల

క్షీరులు నాగ నెట్లచట నెన్నెసలారును, వాని నుండియున్
క్షీరము ధారయై కురియు, నెల్లరె! సందులు సొమ్ము వల్వలం
గోరిన నిచ్చు జంపతులు కొందురు నేటికి నేడు తా మలం
కార సితాంబర ప్రకర గంధ లతాంత ఫలామృతంబులన్.
(ఆదిఖండ – 77వ పద్యము)

## చిదంబర కవీంద్రుల కందము

క్షీరులు నాబడు తరువుల
క్షీరము నమృతంబు పోలికిని ద్రావుటచే
నీ రోగు లగుచు జను లొ
ప్పారుదు రచ్చోట నిత్య హర్షము తోడన్.
(ఆదిఖండ – 108వ పద్యము)

# ఛందస్సులో సాదృశ్యము

(ఘ) కురు పాండవ యుద్ధానంతరము సోదర గురు జన బంధు మరణము వలన విహ్వలుడైన ధర్మరాజు శోకమును చిత్రించు పట్టున మాత్రము ఇరువురును సీసములనే వ్రాసినారు :

## వేలూరి వారి సీసములు

"అల కృపీ దేవికిఁ దలపైన దెలిచీర
చెంగు చేరెడునట్లు చేసినాను
మఱదండ్ర బిగువారు మంగళసూత్రముల్
తేరఁ బుటుక్కున త్రెంచినాను
పిల్లల నిచ్చిన తల్లుల కుంకుమ
బొట్టు బొట్టన వ్రేల నెట్టినాను
నా కఱమేనులౌ ననుపకాంద్రుర యాండ్ర
వితివి వేనళ్ళను వ్రేసినాను
గంగ గర్భమునను జిచ్చు గట్టినాను
అకట! యన్నను జంపితి, నహహ! యముని
సూనుడను గానె యింత నీ శూరునకును
నెన్ని పాపము లుండెనో యింకమీద."

"నూర్వుర కొమరుల నుఱుమాడి యిటుపై
ధృతరాష్ట్ర మోము నేనెట్లు కాంతు
సకల వంశాంకుర క్షయ మొనరించి నే
వ్యాసున కెటు కూర్తు వందనంబు
అల్ల చాపాచార్యు నల్లఁ గోలిన నేను
కృపికేమి పరిచర్య నిపు డొనర్తు
శల్యుని దేవికి శల్యంబు మదిఁ గుచ్చి
మఱి యింక నెట్లు నమస్కరింతు
అన్నఁ బెంచిన రాధ కేమందు నకట!
కుడిచి కూర్చుండి నా యంగికోటి నేనె
కోసికొని యాత్మహత్యఁ గైకొన్నవాఁడ
నెట్టు లీ పాతకమ్ముల నీఁదులాడ!!"
(ఆదిఖండ–280, 281 పద్యములు)

## పిసుపాటి వారి సీసములు

శమియించె నేకాదశ చమూధవుండైన
ధృతరాష్ట్రజుడు భ్రాతృ సుతుల తోడ
గూలెను శస్త్రాస్త్ర గురుడైన ద్రోణుండు
పండితుండైన భీష్ముండు మడిసె
నీల్గె మహా బలాన్వితుఁడైన కర్ణుండు
శ్లాఘ్యవర్తనుఁడైన శల్యుఁ డడగె
సమసిపోయిరి దురాసదులైన శూరులు
శాంతమయ్యెను బంధు జాలమెల్ల
వారితోపోక జీవచ్ఛవములు వోలె
మిగిలి యున్నార ముర్విలో మేము మాత్ర
మేగురము భోగ భాగ్యంబు లెవరికింక?
నెట్టు లీ రక్త సిక్తాన్న మిముడు మాకు?

ఇంత కార్యంబు చేయించిన కృష్ణుని
నడుగంగ నెట్లు నోరాడు నాకు
బుత్ర శతంబును బొలియించి యేమని
ధృతరాష్ట్రు నడుగంగ నేమబోదు
గావించి గోత్ర సంక్షయము నే మొగమున
వ్యాసుని నడుగ నే నభిలషింతు
ధర్మహాని యొనర్చి ధర్మజ్ఞులగువారి
నడుగంగ నే నెట్లు లాసపడుదు
ననుచు తలపోయుచును విహ్వలాత్ముడగుచు
నాననము వంచికొని యుండ నతనిఁ జూచి
తల్లియును దొయ్యలియును సోదరులు గొండ్క
ఖిన్నులయి బాష్పములఁ గార్చుచున్న నంత.
(ఆదిఖండ – 488, 490 పద్యములు)

కర్మయోగ విధానములో మాతాపితృ సేవ విధిని ఇరువురును గీతముల యందే వివరించిరి :

"తల్లి కంటెను బెఱ దైవతంబులేదు
తండిరిని మీరు పెఱ దేశికుండు లేదు
ఎడద కంటెను లేదు లే డీశ్వరుండు
వీరిఁ బూజింపఁ జాలిన వేఱ యేల ?"
(వేలూరి, ఆదిఖండ – 318 పద్యము)

"తల్లితోడ సమంబైన దైవతంబులేదు
లేదు పితృతుల్యుండగువాడు లేదు గురువు
కాన వారల పరిచర్యల కంటె నధిక
మైన కార్యము లేదెందు నాత్మజునకు."
(పిసుపాటి, ఆదిఖండ – 639 పద్యము)

ఉత్తర కురు భూములలోని భారుండ పక్షుల వర్ణనమును కూడ ఇరువురును గీతములయందే కావించిరి :

### వేలూరి వారి గీతము

"బలియుతంబగు తెక్కలుఁ జలిత తీక్ష్ణ
తుండములఁ బొల్చునట్టి భారుండ నామ
పక్షు లచ్చటఁ జచ్చిన వారి దరుల
ప్రాంతముల కీడ్చుకొనిపోయి పాఱవైచు."
(ఆదిఖండ – 81వ పద్యము)

### పిసుపాటి వారి గీతము

"అచట మృతులైన ప్రాణుల నా క్షణంబ
మోచికొనిపోయి దరులను వైచుచుండు
నమిత బలమును దీక్ష్ణతుండములు గలిగి
భాసిలుచు నుండు భారుండ పక్షి గణము."
(ఆదిఖండము – 110వ పద్యము)

ఇట్లు పరిశీలించుచు పోయినచో పద్య రచనా శిల్పము నందు వేలూరి వారిది పైచేయిగా గోచరించును; విషయ విస్తరణమునందు పిసుపాటి వారిది పైచేయి - ఒకరికి విషయ సంగ్రహణముపై దృష్టి; మరియొకరికి విషయ వివరణముపై దృష్టి. గ్రంథరచనా కాలమును బట్టియు, రెండు గ్రంథముల యందలి సాదృశ్య వైదృశ్యములను బట్టియు, ఇరువురు కృతికర్తలకు గల సాన్నిహిత్యమును బట్టియు చూచినచో వేలూరివారి పద్మ పురాణము నెరిగియే చిదంబర కవీంద్రులు వ్రాసియుందురా ? – అని భ్రాంతి కలుగును. ఎరిగియుందు రనుటకు ప్రత్యక్ష సాక్ష్యము లేదు. ఎరిగియుండరనుటకు మనసొప్పకున్నది. సత్యము భగవంతున కెరుక ! !

[ మడికి సింగన 'పద్మ పురాణ' ప్రతిని నాకు ప్రసాదించి, ఈ వ్యాస రచనకు నన్ను ప్రోత్సహించినవారు విద్యారత్న శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు. 'సకల నీతి సమ్మతము'నకు వారు వ్రాసిన పీఠిక బహు విషయ భరితము. నిడుదవోలు వారికి నా కృతజ్ఞత.]

# మ ర ణ ం

## శ్రీ అమ్మంగి వేణుగోపాల్

అతడు చనిపోయాడు
ఆమె మిగిలిపోయింది, శవంగా
కొత్తనిజం కొంతసేపు అబద్ధం
వెక్కివెక్కి ఏడుస్తోంది చావలేని అనుబంధం

ఇంతసేపు ఊపిరిపోసిన గాలే
ఇనుపతెరగా మారిపోయింది
అతడు నాలుగోకాలంలోకి నిష్క్రమించాడు

ఒంటిమీది కొత్తవస్త్రం
నాటకం చివర జారిన తెరలా రెపరెపలాడుతోంది
వార్త 'వితంతు'వై నలువైపులా పాకింది
అతని నీడకూడా కాలిపోయింది.

*　*　*

అందరూ దుఃఖాన్ని నటిస్తారు
ఏ ఒక్కరో బతుకంతా అలమటిస్తారు
ఈ కారుచీకట్లో
ఆమెకు అతని జ్ఞాపకం విరిగిన వెన్నెల

పాడుబావిలోనూ వెన్నెల కురుస్తుంది
చంద్రుడు మాత్రం ప్రతిఫలించడు.

శ్రీ ఎన్. లింగమూర్తి                                                డా॥ పి. రామయ్య

# ఆర్థికాభివృద్ధి - కొన్ని ఆలోచనలు

ప్రస్తుత శతాబ్దంలో ప్రపంచములోని అన్ని దేశాలు ఆర్థికాభివృద్ధి సమస్యలపట్ల ఎక్కువ ఆసక్తి కనబరచడం సహజమై పోయింది. 18వ శతాబ్దపు రెండవ భాగంలో ప్రప్రథమంగా ఇంగ్లాండ్‌నందు పారిశ్రామికరంగంలో విప్లవాత్మకమైన మార్పులు కలిగి ఆధునిక ఆర్థిక ప్రపంచను ఆవిర్భవించినప్పటికి, రెండవ ప్రపంచయుద్ధ కాలం వరకు ఆర్థికాభివృద్ధికి సంబంధించిన ఆలోచన ఎక్కువ ప్రాముఖ్యత లోనికి రాలేదు. కాని యుద్ధకాలం తదుపరి పరదేశ పాలన క్రిందనున్న చాలా దేశాలు స్వాతంత్ర్యమును పొంది అభివృద్ధి సాధించాలనే ఆత్రుతతో పరుగు పందాలు వేసుకొన్నవి. ఒకవిధంగా 20వ శతాబ్దాన్ని 'ఆర్థికాభివృద్ధి శతాబ్దం'గా పిలువవచ్చు. కాబట్టియే ఆచార్య జే. కే. గాల్‌బ్రెత్ అనే ఆర్థిక తత్వశాస్త్రవేత్త "ఆర్థికాభివృద్ధి ఇప్పుడు మేలుకొన్న దశలో నున్నది"[1] అనే వాక్యంతో తన పుస్తకాన్ని మొదలెట్టడం జరిగింది.

వివిధ శాస్త్రాలకు చెందిన విద్వాంసులు "అభివృద్ధి" అనే పదాన్ని నిర్వచించడానికి అనేక ప్రయత్నాలుచేయడం జరిగింది. కాని "పాండే" అనే రచయిత ప్రకారం "గుడ్డివాడు ఏనుగును వర్ణించినట్లుగా"[2] ఎవరుగూడ సరిఅయిన నిర్వచనాన్ని ఇవ్వలేక పోయారు. అభివృద్ధి అనేది అందరూ కాంక్షించే అంశము. అభివృద్ధి అనగా "ఇప్పుడున్న స్థితినుండి ప్రణాళికాబద్ధంగా ఉద్దేశింపబడిన ఒక క్రొత్త స్థితికి చేరుకొనే మార్పు అనే ప్రక్రియ".[3] దీనికి అంతరార్థం మన ముద్దేశించిన స్థితి భౌతికంగా, ఆర్థికంగా, మరియు సాంఘికంగా ఇదివరకున్న దానికంటె చాలా మంచిదనే భావన వ్యక్తపరచనైనది.

ఆర్థికాభివృద్ధి అనేది సమాజంయొక్క మొత్తం అభివృద్ధితో సమానమని భావించడం సమంజసముకాదు. ఇది సమాజంయొక్క సాధారణ అభివృద్ధి (జెనరల్ డెవలప్‌మెంట్) లో ఒక భాగం మాత్రమే. మనము సాధారణంగా ఒక దేశాన్ని అభివృద్ధికి యూనిట్‌గా తీసుకొంటాము. ఒక జాతి అభివృద్ధి అంటె ఆ జాతి సాంఘికంగా, రాజకీయంగా, ఆర్థికంగా తదితర విధాలుగా అభివృద్ధి చెందడమన్న మాట. దీనినే ఈ క్రిందివిధంగా చూపవచ్చు.




పై అన్నిరకాల అభివృద్ధులలో 'ఆర్థికాభివృద్ధి' పునాదివంటిదైనను, వీటన్నింటిమధ్య అంతస్సంబంధమున్నది. సాంఘిక, రాజకీయ, సాంస్కృతిక మరియు పాలనా సంబంధమైన అభివృద్ధులు ఆర్థికాభివృద్ధికి కొంతవరకు దోహదకారులౌతాయి. అదేవిధంగా అవి ఆర్థికాభివృద్ధిచేత నిర్ణయించబడుతాయి. వీటి పరస్పర సంబంధాలను ఈ క్రిందివిధంగా చూపించవచ్చు.




పై కారణంగా ఆర్థికాభివృద్ధిని అర్థం చేసుకోవడానికి వివిధ శాస్త్రాల మధ్యనుండే అంతస్సంబంధాలను గూర్చిన విషయ పరిజ్ఞానం అవసరం.

ఆర్థికాభివృద్ధిని సాధించిన దేశము సాధ్యమైనంతవరకు స్వయంసమృద్ధంగా ఉంటుంది. కాని స్వయం సమృద్ధిని సాధించడమంటే ఇతరదేశాలపై అసలే ఆధార పడకపోవడం అని అర్థంగాదు. కొన్ని అవసరాలకొరకు అభివృద్ధిచెందిన దేశాలుకూడా ఇతర దేశాలపై ఆధార పడడంలో తప్పలేదు. ఎందుకనగా అన్నిరకాల వస్తూత్పత్తికి కావలసిన భౌతిక వనరులు ప్రతిదేశంలోను ఉండకపోవచ్చు. ఉదాహరణకు పెట్రోలియం కొరకు అమెరికా, అరబ్ దేశాలపైన ఆధారపడుతున్నది. అదేప్రకారంగా కొన్ని ఇతర వస్తువులకొరకు ఆ దేశాలు అమెరికాపైన ఆధారపడుతున్నవి.

కొంతమంది ఆర్థిక శాస్త్రవేత్తలు ఆర్థికాభివృద్ధి కేవలం పారిశ్రామికీకరణ సాధించడంతో సమానంగా భావించే ప్రమాదం కూడా ఉన్నది. 'హన్స్‌సింగర్' అనే అర్థశాస్త్రవేత్త ప్రకారం 80% వ్యవసాయదారులున్న ఆర్థిక వ్యవస్థను 15% వ్యవసాయదారులున్న ఆర్థిక వ్యవస్థగా రూపొందించడమే ఆర్థికాభివృద్ధిని సాధించడం. దీనినిబట్టి వ్యవసాయేతర రంగాలు—ముఖ్యంగా పారిశ్రామికరంగం అభివృద్ధికి ఎంత అవసరమో అర్థంచేసుకోవచ్చును. అభివృద్ధిచెందిన దేశాలైన ఇంగ్లాండ్, అమెరికా మొదలైన దేశాలలో అభివృద్ధికి కావలసిన ప్రాతిపదికను ఏర్పరిచి, అభివృద్ధిగమనము చురుకుగా ఉండేటట్లుచేసి, ఆర్థిక వ్యవస్థను ఉన్నతస్థాయికి ఉద్ధరించడానికి పారిశ్రామికీకరణము ముఖ్యసాధనంగా ఉపకరించింది. కాని పారిశ్రామికాభివృద్ధి అనేది ఆర్థికాభివృద్ధిలో ఒక భాగం మాత్రమే.

అత్యధిక పారిశ్రామికీకరణ సాధించిన దేశాలు చాలా ఉన్నత మయిన జీవన ప్రమాణాలను కలిగి ఉండవచ్చు. పేదదేశాలు ప్రాథమిక రంగంపైన ఆధారపడి ఎక్కువగా వ్యవసాయోత్పత్తులను చేస్తుంటాయి. కాని ఈ దేశాలు పేదదేశాలుగా ఉండడానికి కారణం అవి వ్యవసాయంపైన ఆధారపడి యుండడం మాత్రంకాదు.

ఆర్థికాభివృద్ధిని కేవలం పారిశ్రామికీకరణ సాధించడంతో సమానంగా ఈక్రింది కారణాలవల్ల భావించవద్దు.

1) మొత్తం ఉత్పత్తిలో ఎక్కువశాతము ఉత్పత్తి ప్రాథమిక రంగంలో కేంద్రీకృతమై ఉండటమన్నది పేదరికానికి కారణం కాదు. కాని వ్యవసాయరంగంలో అల్పోత్పాదకత అనేది పేదరికానికి కారణమౌతుంది. అదేవిధంగా ఒకదేశంలోని ప్రజలలో ఎక్కువ శాతము వ్యవసాయదారులుగా ఉండడం అనేది పేదరికంయొక్క ఫలితంగాని దానికి కారణంమాత్రం కాజాలదు.

2) పారిశ్రామికాభివృద్ధి అనేది వ్యవసాయరంగంయొక్క అభివృద్ధిపైన ఆధారపడి యున్నది. వ్యవసాయరంగం అభివృద్ధి చెందకపోతే పారిశ్రామిక రంగానికి కావలిసిన ముడిపదార్థాలు మరియు ఆహారధాన్యాలు సమృద్ధిగా లభ్యంకాకపోవడంవల్ల పారిశ్రామికాభివృద్ధి కుంటుపడుతుంది.

3) 'గున్నార్ మిర్డాల్' ప్రకారం "ఆర్థికాభివృద్ధి అంటె, మొత్తం సాంఘిక వ్యవస్థ ఉన్నత స్థానానికి కదిలిపోవడం."[4] ఒక సాంఘిక వ్యవస్థ ముందుకు నడవడానికి కేవలం పారిశ్రామికీకరణ మాత్రమే సరిపోదు. అన్నిరంగాల ఉత్పాదకతలో పెరుగుదల, ఆధునిక విజ్ఞానము మరియు సాంకేతిక నైపుణ్యాలు మొదలైనవి గూడా అభివృద్ధి చెందాలి.

ఆర్థికవృద్ధి (ఎకనామిక్ గ్రోత్), ఆర్థికాభివృద్ధి (ఎకనామిక్ డెవలప్‌మెంట్) అనే రెండు పదాలు తరుచుగా పర్యాయ పదాలుగా వాడటం అలవాటు. కాని ఈ రెండింటిమధ్య భేదమున్నది. ఆర్థిక వృద్ధి అనగా వస్తుసేవల రూపంలోవుండే జాతీయోత్పత్తిలో పెరుగుదల మాత్రమే. కాని ఆర్థికాభివృద్ధి అనే పదం చాలా విశాలమైన భావంతో కూడుకొని యున్నది. ఆర్థికాభివృద్ధి జరిగినప్పుడు ఆర్థిక వృద్ధితోబాటు కొన్ని మౌలికమైన మార్పులు ఆర్థిక వ్యవస్థలో గోచరిస్తాయి. కాబట్టి

అభివృద్ధి = వృద్ధి + మార్పు.[5]

వృద్ధి అనే పదము కేవలం ప్రమాణాత్మకమైన మార్పునే తెలియజేస్తుంది. కాని అభివృద్ధి అనే పదము ప్రమాణాత్మకమైన మరియు గుణాత్మకమైన మార్పులను తెలియజేస్తుంది. అందువల్ల ఒక దేశంలో ఆర్థికవృద్ధి ఉన్నప్పుడు ఆర్థికాభివృద్ధి జరుగకపోవచ్చు. ఇ. యఫ్. షుమేకర్ ప్రకారం[6] "అభివృద్ధి అనేది వస్తువుల ఉత్పత్తితో ప్రారంభంకాదు. అది ప్రజలతో మరియు వారి విద్య, సంవిధానము మరియు క్రమశిక్షణలతో ప్రారంభమవుతుంది." అనగా ఇతని దృష్టిలోకూడ అభివృద్ధి జరిగినప్పుడు వస్తూత్పత్తిలో పెరుగుదలతోబాటు ఆర్థిక వ్యవస్థలో కొన్ని మౌలికమైన మార్పులు జరగాలి. ఈ మార్పులు ఉత్పత్తి కారకాలు సమర్థవంతంగా పనిచేయడంలోను, మెరుగైన ఉత్పత్తి పద్ధతులను అవలంబించడంలోను, ఉత్పత్తి సంబంధాలలోను వస్తాయి. అంతేకాక ప్రజలలో స్వేచ్ఛ, సమానత్వము మరియు సౌభ్రాతృత్వము అనే తత్వము అలవడుతుంది. సంప్రదాయాచారాలు, కట్టుబాట్లకు ప్రాముఖ్యత తగ్గి, ప్రజలలో శాస్త్రీయమైన దృక్పథం ఏర్పడుతుంది. వివిధరకాల సాంఘిక వ్యవస్థలలోను మరియు విలువలలోను మార్పు అగుపిస్తుంది.

జెరాల్డ్ మేయర్ అనే ఆర్థిక శాస్త్రవేత్త ప్రకారము, "ఆర్థిక వ్యవస్థలో నిజమైన తలసరి ఆదాయాన్ని అంటే వస్తుసేవల రూపంలోఉండే తలసరి ఆదాయాన్ని దీర్ఘకాలికంగా పెరుగుతూ ఉండేటట్లు చేసే ప్రక్రియను ఆర్థికాభివృద్ధి అనవచ్చు."[7] దీనిలో ప్రక్రియ, తలసరి ఆదాయం మరియు దీర్ఘకాలం అనే పదాలు చాలా ప్రాముఖ్యతతో కూడుకొన్నవి. ఆర్థికాభివృద్ధిని ఒక ప్రక్రియ అనడానికి కారణం కొన్ని అంతస్సంబంధమైన శక్తులు కారణత్వరూపంలో పని చేయడం.

ఆర్థికాభివృద్ధిని దీర్ఘకాలిక పరిణామంగా తీసుకోవాలి. ఎందుకనగా ఒకటి రెండు సం॥రాలలో వస్తుసేవల ఉత్పత్తి పెరిగితే అది వ్యాపార చక్రాలవల్ల జరిగినది కావచ్చు. ఇది వృద్ధి అవుతుంది కాని అభివృద్ధి కాజాలదు. ఈ దృష్ట్యా చూస్తే మనదేశంలోని ఒక పంచవర్ష ప్రణాళిక అర్థికాభివృద్ధిలో ఒక భాగం మాత్రమే. అభివృద్ధి ప్రక్రియను చాలా కాలంపాటు నిలుపుకొన్నప్పుడే తలసరి ఆదాయాలు పెరిగి జీవన ప్రమాణాలు హెచ్చవుతాయి.

ఇంకొక ముఖ్యవిషయమేనగా నిజమైన తలసరి ఆదాయంలో పెరుగుదలను మాత్రమే మనము ఆర్థికాభివృద్ధికి సూచికగా తీసుకోవాలి. ఎందుకనగా కేవలం జాతీయాదాయంలో పెరుగుదల ఉన్నంత మాత్రాన తలసరి ఆదాయం పెరుగకపోవచ్చు. నిజమైన జాతీయాదాయంలో పెరుగుదల ఉన్నను, జనాభా పెరుగుదల ఇంతకంటె ఎక్కువున్నచో నికర తలసరి ఆదాయాలలో పెరుగుదల లేకపోవచ్చు. ఇందువల్ల జీవన ప్రమాణాలు స్తబ్ధంగా ఉండవచ్చు లేదా తగ్గవచ్చుకూడా. ఇటువంటి పరిస్థితులలో ఆర్థికాభివృద్ధి జరుగుచున్నది అనడానికి వీలులేదు.

ఆర్థికాభివృద్ధి కేవలం ఉత్పత్తులు మరియు ఆదాయాలలో పెరుగుదల గురించి మాత్రమే కాకుండా వాటి పంపిణీ విషయం గూడ లెక్కలోకి తీసుకొంటుంది. అభివృద్ధి ప్రక్రియ సాంఘిక మరియు ఆర్థిక అసమానతలను తొలగిస్తుంది. కావున జాతీయాదాయం అందరికీ సక్రమంగా పంపిణీ కావడమనేది ఆర్థికాభివృద్ధి ప్రక్రియలో ఒక అంతర్భాగమే. ఈ ప్రకారంగా జరిగినప్పుడు ఆర్థికాభివృద్ధితోబాటు సాంఘిక న్యాయాన్ని కూడా సాధించినవాళ్ళమవుతాము.

వ్యక్తులమధ్య అసమానతలే కాకుండా వివిధ ప్రాంతాలమధ్య ఉండే ఆర్థిక అసమానతలు తొలగిపోవడమనేది ఆర్థికాభివృద్ధిలక్ష్యం. అలాకాకుంటె ఆర్థికాభివృద్ధి ఫలితాలు కొన్ని ప్రాంతాల ప్రజలకు

మాత్రమే పరిమితమై ప్రాంతీయ అసమానతలవల్ల రాజకీయ మరియు ఆర్థిక సంక్షోభాలు ఏర్పడుతాయి. కాబట్టి సంతులిత ప్రాంతీయాభివృద్ధి అనేది గూడ ఆర్థికాభివృద్ధిలో ఒక ముఖ్యమైన అంతర్భాగము. ఈవిధంగా జరిగినప్పడే ఒక దేశాన్ని సంపూర్ణ ఆర్థికాభివృద్ధిని సాధించిన దేశముగా పిలవడం జరుగుతుంది.

ఆర్థికాభివృద్ధి జరిగినప్పడు ఒక దేశంలోని భౌతిక వనరులే కాకుండా ఆ దేశంలోని మనుష్య సంపద కూడ సక్రమంగా మరియు సంపూర్ణంగా వినియుక్తం కావాలి. ఒకరకంగా మనుష్య సంపద యొక్క శక్తి సామర్థ్యాలను మరియు నైపుణ్యాలను ఒక దేశము యొక్క మూలధనంలో భాగంగా చేర్చవచ్చు. అభివృద్ధి జరిగినప్పడు శ్రామిక సామర్థ్యము, గమనశీలత మరియు ప్రజలలో ఉద్యమత్వము పెరగాలి. అభివృద్ధి అనేది మొదట ప్రజల మేధస్సులో ప్రారంభం కావాలి. ప్రకృతిని తమ అవసరాలకొరకు సక్రమంగా వినియుక్తం చేసుకొనే సమర్థత వారిలో పెరగాలి. ఈ అంశం లోపించడంవలన అభివృద్ధి చెందిన దేశాల ఆర్థిక శాస్త్రజ్ఞులు "భారతదేశం సంపన్నవంతమైనది, కాని భారతీయులు పేదవారు" అని మన దేశ ప్రజలనుద్దేశించి సాధారణంగా అంటారు.

ఆర్థికాభివృద్ధి జరిగినప్పడు ప్రజల ఆర్థిక సంక్షేమం పెరగాలి. ఒక దేశంలో ఉత్పత్తి అందరి అవసరాలను తీర్చిదిద్దేదిగా ఉండాలి. కాబట్టి వస్తూత్పత్తి ప్రారంభించేముందు ఒక దేశంలోని ప్రణాళికావేత్తలు ఏమి ఉత్పత్తి చేయాలి? ఎట్లు ఉత్పత్తి చేయాలి? ఎవరి కొరకు ఉత్పత్తి చేయాలి? అనే మూడు ముఖ్యమైన ప్రాథమిక సమస్యలను గూర్చి క్షుణ్ణంగా ఆలోచించాలి.

ఆర్థికాభివృద్ధి అనేది ఒక లక్ష్యంకాదు. అది మన లక్ష్యాలను సాధించడానికి ఒక సాధనం. ఆ లక్ష్యాలు చిరకాలంగా వస్తున్న పేదరికాన్ని రూపుమాపడం, నిరుద్యోగాన్ని నిర్మూలించడం మరియు ఆదాయ అసమానతలను తగ్గించడం మొదలైనవి కావచ్చు.

ఆర్థికాభివృద్ధి అనే అంశానికి ఇన్ని రకాల కోణాలు ఉన్నవి. కాబట్టి వీటన్నింటిని దృష్టిలో ఉంచుకొని దీన్ని నిర్వచించాలనంటె, "ఆర్థిక వ్యవస్థలో నిజమైన తలసరి ఆదాయం దీర్ఘకాలికంగా పెరగడంతోబాటు, వివిధ వ్యక్తుల మరియు ప్రాంతాలమధ్య అసమానతలు తొలగిపోవడాన్నే ఆర్థికాభివృద్ధి" అని పిలువవచ్చు. ఈరకంగా అభివృద్ధి చెందిన దేశాలను మాత్రమే మనము సంపూర్ణ ఆర్థికాభివృద్ధిని సాధించిన దేశాలని పిలవడం సమంజసం.

# సంప్రదింపు రచనలు


1 జె. కే. గాల్‌బ్రెత్ : 'ఎకనామిక్ డెవలప్‌మెంట్', పు–1.

2 జి. పాండే : "డెవలప్‌మెంట్, ఎ సోషల్ సయిన్స్ వ్యూ" డెవలప్‌మెంట్ పాలిసీ ఎండ్ ఎడ్మినిస్ట్రేటివ్ రివ్యూ, వాల్యూమ్ III, నెం 1, జన–జూన్ 1977, పు–16.

3. బి. సి. ముత్తయ్య : 'రూరల్ డెవలప్‌మెంట్' పీపుల్ సెంటర్‌డ్ ఎప్రోచ్, ప్రొడక్టివిటీ, జన–మార్చి 1978, వాల్యూమ్ XIX, నెం. 4, పు–509.

4 గున్నార్ మిర్డాల్ : 'ఏషియన్ డ్రామా' న్యూయార్క్. 1968, పు–1869.

5 గెరాల్డ్ యం.మేయర్ : 'లీడింగ్ ఇష్యూస్ ఇన్ ఎకనామిక్ డెవలప్‌మెంట్' ఆక్స్‌ఫర్డ్ యూనివర్శిటీ ప్రెస్, 1975, పు–6.

6 ఇ. ఎఫ్. షుమేకర్ : 'స్మాల్ ఈస్ బ్యూటిఫుల్' న్యూఢిల్లీ 1977, పు–157.

7 గెరాల్డ్ యం.మేయర్ : పయిన చెప్పినది పు–7.




# కవితా!

నిశ్శబ్దంగా
  ఈ నేలను
చదువుతున్నప్పుడు
నీడలొస్తాయి !

నీడల్ని
నేను
పగలగొడుతున్నప్పుడు
మండుతూ
వెలుగుతావు.

# పొద్దుటి వార్తల్ని చూడకముందే

చూశావ్
  ఇంకా వెలుగు బొమ్మ రంగులు పూసుకోనేలేదు
నిద్రిస్తున్న శూన్యానికి
నా ఆలోచన కాయనేలేదు
శబ్దాన్ని కప్పేసిన నిశ్శబ్దం
నిశ్శబ్దనిద్ర పగుల గొడుతున్న 'గిట్టె'ల గుండె చప్పుళ్ళు
ఏక్రరు మొనలు లాగలేక
'కాండీ'ని మోయలేక
కసాయి తాడును మెడనేసుకొని
వధ్యశాల రోడ్డెక్కుతూ ...
దానికి తెలియదు
ఆకలికి అర్పణ కాబోతున్నానని
చావు క్షణాల్లో వూపిరి పోసుకుంటుందని—
పొద్దుట వార్తల్ని చూడకముందే — ఇలా
గాఢనిద్రలోకి జారిపోతూ ... !

శ్రీ బెడిద రాజేశ్వర్

---

# వెన్నెలలో నీ పాట

శ్రీ పవని ఆర్. హరినాథ్

ఊరంతా మాటు మణిగిన
  ఏ రాత్రి వేళలోనో
నిశ్శబ్దం వెన్నెలతో
ఆడుకుంటుంది.
తీగలై సాగిన వెన్నెలలో
అప్పుడెప్పుడో
నీవు పాడిన పాట
గుర్తొస్తుంది.
ఉవ్వెత్తున ఎగసిన వేదన
హృదయాన్ని
మెలిపెడుతుంది.

శ్రీ విక్రాల శేషాచార్యులు

# నానారీతుల నిఘంటు రచనలు

ఏ పని చేసినను ఏదేని యొకరక మవలంబించవలసినదే. లేకున్న మనశ్శరీరములకు విశ్రాంతినిచ్చి హాయిగ పరుండవలసినదే. శాస్త్ర రచనయు నింతియే. కావుననే కొందఱు విస్తృత గ్రంథముల విరచించగా కొందఱు సంగ్రహ గ్రంథములను రచియించిరి. కొందఱు శ్లోకములతో రచించగా మఱికొందఱు వాక్యములతోను, ఇంక కొందఱు వాటికి టీకలను, మఱికొందఱు మఱియొక రకముగను రచించిరి. నిఘంటు రచనయు నిట్టిదే. కాని ఆలోచించినచో నిఘంటు రచన విస్మయావహమైనది. ఈ వ్యాసమునం దాని నించుక వ్రాసెదను.

౧. నిఘంటువులలో యాస్కుఁడు కశ్యపుఁడు మున్నగు ముని పుంగవులు రచియించిన 'నిరుక్తములను నామము కలవి వేదమునకు చెందినవి. ఏ యే మహర్షి ఏ యే వేదములోని పదములనే యెత్తి రచించునో ఆ నిరుక్త మావేదముయొక్కది యగును. ఇందువలన ఒక్కొక్క నిరుక్త మొక్కొక్క వేదసంబంధమైనదిగ నుండును. కొంతకాలమునుంచి కొందఱు పండితులు ఈ నిరుక్తములనువలెనే ఒక్కొక గ్రంథమునకు, ఒక్కొక కవి రచించిన అన్ని గ్రంథములకు నా గ్రంథముల పేరుతో నిఘంటువులను, ఆ కవిపేరుతో నిఘంటువులను రచించుట జరుగుచున్నది. ఉదా—రామాయణ నిఘంటుః, భారత నిఘంటుః, కాళిదాస నిఘంటుః మొదలైనవి. వీటిలో కొన్ని ఆయా గ్రంథములలోని, మఱికొన్ని ఆయా కవీంద్రులు విరచించిన అన్ని గ్రంథములలోని పర్యాయపద సంపదను దెలుపునవియు, కొన్ని ఆ గ్రంథములలోనియు, ఆ కవీంద్రుల అన్ని గ్రంథములలోనియు పదముల కర్థములను దెలుపునవియునై యున్నవి. ఈ వ్యాసమునందు లౌకిక నిఘంటువులను గూర్చి చర్చించెదను.

౨. నిఘంటువులలో పర్యాయ పదజాలమును బోధించునవి కొన్ని. ఇవి అమరసింహ విరచితమై అమరకోశమని ప్రసిద్ధమైన నామలింగాను శాసనము, హేమచంద్రాచార్య ప్రణీతమైన అభిధాన చింతామణి, మొదలుగా గలవి.

౩. శబ్దములయొక్క నానార్థములను తెలుపునవి కొన్ని. ఈ రెండవతెగ నిఘంటువులను నానార్థ నిఘంటువు లనెదరు. ఇవి ఇఱుగప దండాధినాథుని నానార్థరత్నమాల, మేదినీకరుని మేదినీ కోశము, విశ్వనాదు విబుధ నిర్మితమైన విశ్వప్రకాశము మొదలైనవి. ఇవి శబ్దబోధకములు.

సంస్కృత భాషలో శబ్దబోధక నిఘంటువులలో క్రియా పదములను నుడువరు.

౪. వాటిని భట్టమల్లుఁడు విజయానందుఁడు మున్నగువారు ఆఖ్యాతచంద్రిక, క్రియాకలాపము మొదలుగాగల కోశములలో కొందఱు విశేషముగను కొందఱు కొంత సంగ్రహముగను తెలిపియున్నారు. తెలుఁగులో కోటి వెంకనార్యుఁ డొనర్చిన ఆంధ్రభాషార్ణవములో మూడవ కాండము కడన క్రియావర్గములో కొన్ని క్రియాపదములను దెలిపియున్నాఁడు.

౫. అష్టాదశ మహాపురాణములలో చేరిన శ్రీ మద్వేద వ్యాస మహర్షి ప్రణీతమైన అగ్నిపురాణములోని నిఘంటు నిర్మాణ ప్రక్రియయే అనంతర నిఘంటు నిర్మాతలకు మార్గదర్శకము. అనంతర కాలిక నైఘంటుకులు ఆ యగ్ని పురాణములోని నిఘంటు రచనావిధానము ననుసరించి తొలుత పర్యాయ పదములను నుడివి తర్వాత నానార్థ శబ్దములను వాకొని ఆ పిమ్మట అవ్యయ నానార్థములను, ఆ పిదప అవ్యయ పర్యాయములను వచించెదరు. అగ్నిపురాణములో నొక్కొక్క అధ్యాయమునం దొక్కొక్కతెగ పర్యాయములను నుడువగా కొందరు కవులు కాండములను, వాటిలో వర్గములను బెట్టి యొక్కొక్క వర్గములో నొక్కొక తెగశబ్దములను వాకొనిరి. ఇట్టి వాటిలో హేమచంద్రాచార్యుని అభిధాన చిన్తామణి, అమరసింహుని నామలింగాను శాసనము, యాదవ ప్రకాశుని వైజయన్తి మొదలైనవి ముఖ్యమైనవి.

౬. శబ్దార్ణవము మున్నుగాగలవి నామమాత్రావశిష్టములై కేవలము వ్యాఖ్యానోదాహరణములవలన దెలియుచున్నవి. కాని అది యిప్పుడు లభించుటలేదు. హేమచంద్రాచార్యుని అభిధానచిన్తామణి మున్నుగా గలవి విస్తృతములైనవి. కాని వాటికి ప్రచారము చాల తక్కువగ నున్నది. నామలింగాను శాసన మనబడు అమరకోశము నాతి సంక్షిప్త విస్తృతమైనది. కావున దీనికిగల ప్రచారము తతిమ్మా అభిధానములకులేదు.

౭. ఈ యమరకోశములో పలువిషయములు పరిత్యక్తములు. కాన పలువు రనంతర విద్వాంసులు దీనికి శేషగ్రంథముల నొనర్చిరి. అవి అమరశేషము, నా రచించిన శేషనిఘంటువు మొదలైనవి. పురుషోత్తమదేవ ప్రణీతమైన త్రికాండశేషము అమరకోశముయొక్క శేషమని దాని టీకాకారుల అభిప్రాయము. వీటిని గుఱించి నా రచియించిన "అమరశేషము" వ్యాసము సం॥ 1978 జులై నెల భారతిలోను, త్రికాండశేషమును గుఱించినది "అమరశేషము—త్రికాండశేషము" అను వ్యాసము సం॥ 1980 ఏప్రిల్ నెల భారతి సంచికలోను కాంచదగును.

౮. ధనంజయాదులు కొందఱు కాండవర్గాది విభజనము లేకుండా సంగ్రహముగ పర్యాయపద కల్పనోపాయ బోధకములైన కోశములను నిర్మించిరి. అవి ధనంజయ నిఘంటువు వగైరాలు. •

ఆంధ్రవములో కోటి వెంకనార్యుని ఆంధ్రభాషార్ణవము, తూము రామదాసు రచించిన ఆంధ్ర పదనిధానము సంస్కృత భాషలోని అమరకోశము మాదిరి మూడు కాండములు అవియే వర్గములు పెట్టి అట్లులే రచితములు. శ్రీ రాజాత్యాడ పూసపాటి వీరపరాజు బహదర్ వారు రచియించిన ఆంధ్రపదాకరము, అమలాపురపు సన్యాసికవి చేసిన సర్వాంధ్రసార సంగ్రహము కాండములులేక వర్గములు మాత్రము కలిగిన మిగుల మంచినిఘంటువులు. సర్వాంధ్రసార సంగ్రహము వ్రాత ప్రతి మద్రాస్ ప్రాచ్యలిఖిత గ్రంథాలయములో కలదు. [దీనిని గుఱించి సుమారు 7–8 యేండ్లనాడు ఆంధ్రప్రభ (దినపత్రిక) ఒక ఆది వారపు సంచికలో ఒకరు వ్రాసిన వ్యాసము భాషాసేవకులు, తప్పక చదువదగినది.] ఇకను వర్గవిభజనము కలిగినవి గణపవరపు వేంకట కవి నిర్మితమైన వేంకటేశాంధ్రము, పైడిపాటి లక్ష్మణకవి యొన రించిన ఆంధ్రభాషారత్నాకరము, ఆంధ్రనామసంగ్రహము, కస్తూరి రంగ కవి కృతమైన సాంబనిఘంటువు మొదలైనవి కలవు. వీటిలో ముందు పర్యాయ పదజాల మధికముగను, శబ్దనానార్థములు కొలది గను చెప్పబడును.

ఇకను నానార్థ నిఘంటువులు :

౯. శబ్దములయొక్క నానార్థములనే నుడివెడు నిఘంటువులు కొన్ని యున్నవి. ఇవి ఇఱుగప దండనాథుని నానార్థరత్నమాల, మహేశ్వరసూరి, విశ్వకోశము, కేశవదేవుని నానార్థార్ణవతరణి, మేదినీ కరుని మేదినీకోశము మొదలయినవి. నానార్థ నిఘంటువులలో వెదకు కొనకుండ కావలసిన శబ్దములను సులభముగ చూచుకొనుట కనువుగ శబ్దములయొక్క అంతాక్షరములను కకారాదిగ గూర్చి చెప్పెదరు. కొన్నిటిలో పదాదులయం దకారాదిక్రమమును, పదాంతములయందు కకారాది క్రమమునున్ను పాటించి రచయితలు రచించిరి. పురుషో త్తమ దేవుడు రచించిన త్రికాండ శేషములో నానార్థవర్గ మిట్టిది. మేదినీకోశము మున్నగు కొన్నిటిలో శబ్దాదులయం దకారాది క్రమ మును, శబ్దాంతములయందు కకారాది క్రమమును పాటించినను "రాజన్" మున్నగు హలంత శబ్దములకడనుండు నకారాది పొల్లు అక్షరములనున్ను నిండు అక్షరములునుగ అక్షర సంఖ్యలో జేర్చి చెప్పిరి. ఉదా—మేదినీకోశములోనే నద్వయమ్మను భాగములో "రాజన్" శబ్దమునందలి నకారమును నిండు అక్షరమునుగ నెంచి నకారాంతము లైన మూడు వర్ణములుకల శబ్దములలో చేర్చి చెప్పియున్నారు. ఈ పద్ధతి నెఱుంగుటకు కొంత వ్యాకరణజ్ఞాన మావశ్యకము. కాన నీ పద్ధతి సర్వసుగమముకాదు. ఇట్లు పొల్లు అక్షరములను నిండు అక్షరములునుగ నెంచుట కొందఱ కభిమతముకాదు. కావుననే ఇఱుగప దండనాథ ప్రభృతులు నానార్థ రత్నమాల మున్నగు స్వకీయ రచనల యందు హలంత శబ్దాంతములలోని పొల్లులను భిన్నాక్షరములునుగ లెక్కించక నిండు అక్షరములనే లెక్కలోనికి గ్రహించి శబ్దముల యందలి అక్షరసంఖ్య ననుసరించి ఏకాక్షరకాండము...మొదలు చతు రక్షర కాండము కడవరకు కాండములను నిర్మించి వాటిలో కాంత ములు, ఖాంతములు మున్నగుతీరున శబ్దములను నుడివి వాటి యర్థ ములను సప్తమ్యేక వచనములతో నుడివెదరు. ఈ పద్ధతి కోరిన పద ములను చూచుకొనుటకు చాల సులభమైనది. *కొందఱు శబ్దా దులయం దకారాది వర్ణక్రమమును పాటించుచు నిఘంటు నిర్మాణము గావించియున్నారు.

౧౦. కొందఱు శబ్దములయొక్క నియతముగ కొన్ని యర్థ ములనే నుడివెడు నిఘంటువులను రచించినారు. కవి తార్కికసింహ సర్వతంత్ర స్వతంత్ర వేదాంతదేశిక శ్రీ మద్వేంకటనాథాచార్యులవారి రచితమైన దశదీపక నిఘంటువిట్టిది. అందు మొదట వారు "శ్లో॥ ఏకైకస్య పదస్యో ర్థా న్దశధా కలయ స్సుధావ్ః। మోదాయ రచయే కోశం దశదీపక నామక"మ్మని చెప్పి ఆ మాట నన్వర్థము చేసికొనిరి. దశదీపకమనగా పదింటిని దెలుపునదియని యర్థము. ఆపది యెవ్వి యనగా పై ప్రతిజ్ఞా శ్లోకములో నుడివినట్లు పది యర్థములని గ్రహించవలెను.

తెలుగులో నానార్థ నిఘంటువనునది యొక్కరు రచించినది మాత్రము అచ్చైయున్నది. ఆంధ్రసాహిత్య పరిషత్పుస్తక భాండా గారములో సూరయామాత్యుడు రచియించిన నానార్థ రత్నమాల అనునదియు, చెన్నపుర ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమునందు ఆంధ్ర నానార్థ సంగ్రహ మనునది సటీకముగను — రెండుతావుల రెండు పద్యగ్రంథము లున్నవి.

౧౧. మఱికొందఱు కవిచంద్రులు శబ్దములయొక్క రూప భేదములను దెలుపు నిఘంటువులను రచించియున్నారు. అవి శ్రీహర్ష మహాకవి రచించిన ద్విరూపకోశము, అజ్ఞాత రచయితృ నామకము లైన శబ్దభేద ప్రకాశము, శబ్దభేద నిర్దేశము మఱికొందఱు రచియిం చిన మఱికొన్ని పేరు కలవియును కలవు. తెలుగులో గణపవరపు వేంకటకవి "ఆంధ్ర ద్విరూపకోశ"మను దానిని రచించెనని తద్రచిత ప్రబంధరాజ వేంకటేశ్వర విజయ విలాసపు పీఠికలో వ్రాసియున్నది. తెనుగులోని ద్విరూపకోశము నానార్థ నిఘంటువులు సంస్కృత గ్రంథములపేళ్లు కలవైనను అవి సంస్కృత గ్రంథముల కనువాద ములు కాక స్వతంత్ర రచనలు. ఏ భాషలోని కోశము లాభాషలోని శబ్దములనే నుడువునవి కనుక.

౧౨. ఇకను సంస్కృత భాషలో నేకాక్షర శబ్దములకొక విశి ష్టత కలదు. అందుచేత పురుషోత్తమదేవుడు మున్నగు కొందఱు మహాకవులు ఏకాక్షర నిఘంటువులను రచించియున్నారు. ఇవి సదరు పురుషోత్తమదేవుని ఏకాక్షర నిఘంటువు, హరిహరామాత్యుని ఏకాక్షర రత్నమాలయు మఱికొంద ఱొనర్చిన మఱికొన్నియును కలవు. వార ణాసి చౌఖాంబా అమరభారతీ సాహిత్యవారి 1978వ సం॥రపు క్యాట లాగు (౯౭వ పుట)లో కోశగ్రంథములలో మునిరమణీక విజయసంపా దకులుగ నచ్చువేసిన "ఏకాక్షరనామ సంగ్రహకోశః" రూ. ౯–౦౦లు

---

* ఇట్టివారు నిఘంటు రచనలయందు శబ్దాదులయం దవలం బించిన అకారాది వర్ణక్రమపద్ధతియే పాశ్చాత్య నైఘంటు కుల నిర్మాణమునకు మార్గదర్శకమైనది. చూ. నా "అకా రాది నిఘంటువుల ఆదికర్తలు"—1980 సం॥ సెప్టెంబర్ **నెల భారతిలో.**

అని ఒక సంకలన గ్రంథముపేరు కానవచ్చుచున్నది. అందలి కోశము లను చూచువరకు వాటి నిర్మాణ ప్రకారము వ్రాయవలను పడదు. చూచి వేరొకమారు వాటి స్వరూపము వివరించవలయును.

ఈ పట్టున నాచేతను రచితమైన "ఏకాక్షర శబ్దమంజరి" స్వరూపమును వివరించెదను. ఇందులో నేకాక్షర పర్యాయ నామము లను తెలుపునది మొదటి కాండము. ఏకాక్షర శబ్దములకు నానార్థము లను బోధించునది రెండవ కాండము. ఆ యేకాక్షర శబ్దములకు ప్రసి ద్ధార్థములను, అవ్యయములను ప్రతిపాదించునది మూడవది ప్రకీర్ణకాండము. వరుసగ నుదాహరణములు:—

శ్రీ విక్కాల శేషాచార్య విరచితే ఏకాక్షర శబ్దమంజరీ నామ్ని కోశే పర్యాయనామ ప్రతిపాదకే ప్రథమకాణ్డే—

"శ్లో॥ స్వ (రవ్యయం) ద్యో దివౌ (ద్వేస్త్రీ) దేవభువనే త్రయః" ॥ టీక—స్వః—(అవ్యయము.) ద్యోః—దివ్. (స్త్రీ) ఈ 3 స్వర్గ లోకముపేళ్లు... "శ్లో॥ జ్యా క్ష్మా గౌ ర్భూ ర్క కుః రవనౌ...టీ—జ్యా—క్ష్మా—గౌః—భూః—కుః—(స్త్రీ) ఈ ౫ భూమిపేళ్లు .. "శ్లో॥ గౌ (స్త్రీ) ధేనౌచ మే దిన్యాం... టీ—గౌః (స్త్రీ) ఆవు భూమి. "శ్లో॥ భే (ట్పుమా) నర్క చంద్రయోః...టీ—భేట్—సూర్యుడు చంద్రుడు (పు)...రెండవది నానార్థ కాండములో "శ్లో॥ భ మృక్షే భా ద్యుతౌ భీస్తు భయే భూ రవనౌ (వధ),...భం—నక్షత్రము, (న) భా—(స్త్రీ) కాంతి, భీః—(స్త్రీ) భయము, భూః—(స్త్రీ)భూమి. "శ్లో॥ భూ (స్త్రీ) ద్వగూర్ధ్వ భాగే (స్యాత్)...టీ—భూః (ఊ—స్త్రీ) కను బొమ., ఇత్యాది. ప్రకీర్ణ కాణ్డే— శ్లో॥ సంబుద్ధి వాచకం హే హై భో భో ఽ ప్యా ట్వా (ట్యలస్య)రే. ఈ ఒ ఓ అని పిలుచుటయందలి సంబోధన వాచకములు. దుర్జనుని పిలుచునప్పుడు "రే" అని,... ఇ త్యవ్యయవర్గ స్సమాప్తః

తెనుఁగులో ఏన్—నేన్—ఓ—మే—మై మున్నగు కొన్ని ఏకాక్షర శబ్దము లున్నను ఆ యేకాక్షర శబ్దముల కెవ్వరును కోశములను రచిం చినట్లు కానరాదు. ఏన్—నేన్— (నేను), ఓ—(సంబోధనము హర్ష ముతో నంగీకారము.) మే—మై (దేహము.)

౧౩. సంస్కృతభాషలో ఏకార్థ నామమాలా—సౌభరి ప్రణీత మైన "ద్వ్యక్షరనామమాలా" అనునవి రెండు పేళ్లు చౌఖాంబా సంస్కృత సీరీజ్ ఆఫీస్—వారాణసీ 1. అను చిరునామావారి ముద్రిత గ్రంథపట్టిక (క్యాటలాగ్)లో కనుపించుచున్నవి. ఇవి పర్యాయపద కోశములో నానార్థకోశములో ఎఱుంగరాదు. ఎట్లైనను నానార్థ శబ్దముల నిఘంటువు ఇఱుగప దండనాథుని నానార్థ రత్నమాలలో ఏకాక్షరకాండము, ద్వ్యక్షరకాండము, త్ర్యక్షరకాండము, చతురక్షర కాండము అన్నేసి యక్షరముల పదములయొక్క నానార్థములును బోధించునవి.

౧౪. మఱికొన్ని కోశములు ఆయా స్థానములందు జనించెడు వర్ణములు శబ్దాదులయందో శబ్దాంతములయందో కల శబ్దములను బోధించునవి. ఏయే యక్షరము లేయే స్థానములయందు బుట్టునో నా విషయమును మహర్షులు శిక్షా శాస్త్ర గ్రంథములలో దెలిపియున్నారు. ఎట్లనిన? పాణినీయ శిక్షాయాం తృతీయఖణ్డే—

"శ్లో॥ అష్టౌ స్థానాని వర్ణానా మురః కణ్ఠ శ్శిరస్తథా జిహ్వామూలంచ దన్తాశ్చ నాసికో ష్ఠౌచ తాలుచ"౩

తా॥ ఉరస్సు, కంఠము, శిరస్సు, నాలుక మొదలు దంతములు, ముక్కు, పెదవులు, దవడలు ఈ యెనిమిదియు అక్షరములు పుట్టుతావులు. ఇట్లు సాధారణముగ వర్ణములు జనించు స్థానములను నుడివి నాలగవ ఖండములో యేయే యక్షరము లేయే స్థానములందు పుట్టునో తెలిపియున్నాడు.

అవి. "శ్లో॥ కణ్ఠ్యా వహా విచు యశాస్తాలవ్యా వోష్ఠజా వుపూ। స్యుర్మూర్ధన్యా ఋటురషా, దన్త్యా ఌ తులసాస్స్మృతాః॥౨॥ జిహ్వామూలే తు కుః ప్రోక్తో దన్త్యోష్ఠ్యో వస్స్మృతో బుధైః। ఏ ఐతు కణ్ఠ్య తాలవ్యావో ఔకణ్ఠోష్ఠజౌ స్మృతౌ॥౩॥

తా॥ అకారము హకారము కంఠస్థానీయములు, ఇకారము చవర్గము యకారము శకారము దవడలలో జనించునవి. ఉకారము, ఊకారము ఓష్ఠజములు. ఐకార—ఔకారములు కంఠము దవడలు స్థానముగా గలవి. ఓకార—ఔకారములు కంఠమునందు నోష్ఠమునందు జనించునవి. వకారము దంతములందు నోష్ఠములందు నుత్పన్న మగునది. అనగా ఈ యీ వర్ణము లీ యీ యంగములలో బుట్టునని యర్థము. ఇచ్చట కు—చు—టు—తు—పు అనెడు ఉకార విశిష్టములైన వర్గాద్యక్షరము లాయా వర్గములలోని యక్షరముల నన్నిటిని తెలుపును. ఈ విషయమే మా తాతగారు (పితా మహ పాదులు) శిక్షాభాష్యములో తెలిపియున్నారు. ఆ వాక్యములు— "అత్ర కు—చు—టు—తు—పు—ఇతి ఉదిచ్ఛబ్దాః వర్గగ్రహణాః. తథా ఽఽహ ఽఽచార్యః అణుదిత్స వర్ణస్య చాఽప్రత్యయః ఇతి..." ఈ యీ స్థానములలో పుట్టునట్టి వర్ణములు (శబ్దముల) మొదటకల శబ్దములను కొందఱు, (శబ్దముల) చివరకల శబ్దములను కొందఱు తెలుపుచు నిఘంటువులను నిర్మించి యున్నారు. తొలిరకపుది ధరణి. మలివిధముది రభస రచితము.

౧౫. సంస్కృత భాషలో స్త్రీలింగము, పుల్లింగము నపుంసక లింగము, స్త్రీపుల్లింగము, పుం నపుంసకలింగము, స్త్రీ నపుంసక లింగము—అనెడు లింగములజ్ఞాన మత్యావశ్యకమైనది. కావున నాయా లింగముకల శబ్దములను వేరువేరుగ నొండె లేక వేరు వేరు కాండ—వర్గాది విభాగములలో నొండె తెలుపుచు రచితములైన నిఘంటువులు కొన్ని. రత్నకోశము మున్నగునవియు, వోపాలిత ప్రభృతులు రచియించినవియు నిట్టివే.

౧౬. మఱికొన్ని కోశములు శబ్దముల ఆది—మధ్యాన్తములలోని అక్షరములయొక్క హ్రస్వ దీర్ఘములను తెలుపునవి. రభస రచితములైన అభిధానములలో నిట్టివియు కలవు.

ఇట్టి కోశములలో పెక్కు లిక్కాలమున లుప్తములై దుర్లభ దశ నొందినవి. అమరకోశముయొక్క [2]రంగయసూరి రచితమైన పదవృత్తి యను సంస్కృత వ్యాఖ్యానముయొక్క తాళ్లపాక పెద తిరుమలాచార్య విరచితమైన అనేక విశేషవిషయ సంభృతమైన గురుబాల ప్రబోధిక యను ఆంధ్రానువాదమునందలి ఉదాహరణములవలన కొన్నిటి నామములు తెలియుచున్నవి. కావున నిప్పుడు లభించని ఆ నిఘంటువుల స్వరూప పరిజ్ఞానార్థము సదరు గురుబాల ప్రబోధిక నుంచి ఒక్కొక్క కోశమున కొక్కొక్క లేక రెండేసి ప్రమాణములను వ్రాసెదను. అవి

౧౪వ దాని కుదాహృతి—అమరకోశే ద్వితీయకాణ్డే వైశ్యవర్గే— "శ్లో॥ ఈషా లాఙ్గలదణ్డ స్స్యా త్సీతా లాఙ్గల పద్ధతిః" అనెడు ౧౪వ శ్లోకముయొక్క గురుబాల ప్రబోధికలో ఈషా శబ్దవ్యాఖ్యానమునందు "పా. ప్రభుశంకరయో రీశస్త్రియాం లాఙ్గలదణ్డకే తాలవ్యాంతే రభసః" అనియు, సీతాశబ్ద వివరణములో "దంత్యాది సీతా. లాఙ్గలరేఖా స్యాద్వ్యోమగఙ్గా చ జానకీ అని" రభసుఁడు. తాలవ్యాదియు. గలదు. శీతా నభస్స అతి లాఙ్గల పద్ధతౌ స్యా చ్ఛీతా దశాననరిపో స్సహధర్మిణీచ। శీతం స్మృతం హిమగుణేచ తదన్వితేచ శీతో ఽలసేచ బహువారతరౌచ దృష్టః అని తాలవ్యాదులయందు ధరణి" అని.

౧౫వ దాని కుదాహరణము:— అమరకోశే ప్రథమకాణ్డే స్వర్గవర్గే "శ్లో॥ సమాహృత్యా ఽన్యతంత్రాణి సంక్షిప్తైః ప్రతి సంస్కృతైః" అనెడు రెండవ శ్లోకముయొక్క టీకా సర్వస్వమునందు "వ్యాడి వరరుచి ప్రణీతానితు లింగమాత్ర తన్త్రాణి, మఱియు "శ్లో॥ భేదాఖ్యానాయ నద్వన్ద్వే నైకశేషో నసఙ్కరః" అను నాలగవ శ్లోకముయొక్క గురుబాల ప్రబోధికయందు "రత్నకోశాదులయందును పుల్లింగాదిక్రమమున కాండము చెప్పెదనని ప్రతిజ్ఞ చేసినను స్వర్గస్త్రీ దివస్త్రీవిష్టపంక్లీబే..." అని రత్నకోశమునందును, "క్లీబే త్రివిష్టపం స్వర్గస్త్రీ దివశ్చ సురాలయః" అని అమరమాలయందును ఆయా స్థలములయందే తఱచుగా సంకరము కానఁబడుచున్నది. కావున వ్యాడి వరరుచి మున్నగువారి నిఘంటువులు రత్నకోశము అమరమాల మున్నగునవియు కేవలము లింగబోధయే ప్రధానముగా గలవియనితేలినది.

౧౬వ దాని కుదా:—అమరకోశే ద్వితీయకాణ్డే వైశ్యవర్గే— "శ్లో॥ బుద్ధ మావసితం ధాన్యం పూతంతు బహులీకృత"మ్మను ఇఱువది(౨౩) మూఁడవ శ్లోక వ్యాఖ్యలో ఆవసిత శబ్ద వ్యాఖ్యానములో హ్రస్వాదియుఁ గలదు. "అవసానం గతే జ్ఞాతే బుద్ధే ఽప్యవసితం త్రిష్వి"తి హ్రస్వాదౌ రభసః — అమరకోశే తృతీయకాణ్డే నానార్థ వర్గే "శ్లో॥ ఇరిణం శూన్య మూషర"మ్మనెడి ఏబది యెనిమిదియవ శ్లోకములోని ఇరిణశబ్ద వివరణములో గురుబాల ప్రబోధికయందు... ఇయర్తి నాశం గచ్ఛతీ తి ఇరిణం. ప. ఈరిణం. ఋగితౌ. నాశమును బొందునది. "ఈరిణం శూన్య మూషరం" అని "దీర్ఘాదులయందు రభసుఁడు" అని.

ఒక్క శాస్త్రములో నిన్నిరకముల రచన లేర్పడుట విబుధ సంతతి కెంత వింత గొలిపెడు నంశమో? మనీషి జనమునకు తెలియ

నిది కాదు. తెనుగు సంస్కృత భాషానుసారిణియైనను నిందును నీ లక్షణముతో నిఘంటువుల నిర్మింపబడగి యున్నను— ముందుతెలిపిన కొన్ని రకములు తప్ప ఇన్నిరకముల నెవ్వరు రచించినట్లు కానరాదు.

సంస్కృతములో రచింప వీలులేని యొక నిఘంటు రచన తెనుగులోనున్నదని తోచుచున్నది. అది—రామాయణము కృష్ణయామాత్యు డొనర్చిన "దేశ్యనామార్థకోశ"మని ఊహ పొడముచున్నది. తెనుగులోని దేశ్యములైన పేళ్ల యర్థములను అని ఆ శబ్దముయొక్క అర్థము.

నేను నా చిన్నతనములో మా యింట చూచిన యీ గ్రంథము పోయి దీని నచ్చువేసిన వారికి వీ. పి. గ పంపుమని యెన్ని జాబులు వ్రాసినను రానందున దీని స్వరూపమును వివరించి వ్రాయ వలను పడదయ్యె. కాని నా రచించనున్న కోశములో సమస్తములైన వ్యక్తి—వస్తు—గుణాదుల పేళ్లలో తత్సమాది నామములు విడివిడి (వేరు వేరు)గ వ్రాయబడగలవు.

వీరిలో అమరసింహ హేమచంద్రాదులు పర్యాయపద నిఘంటు నిర్మాతలు. ఇఱుగప దండనాథ, కేశవదేవ ప్రభృతులు నానార్థకోశ ప్రణేతలు. వోపాలిత ప్రముఖులు లింగప్రధాన కోశ రచయితలు. శ్రీహర్ష హరిహరామాత్య ప్రభృతులు శబ్దముల రూపభేదములను తెలుపు నభిధానముల కర్తలు. శబ్దాదులయందు తత్తత్స్థాన జనితాక్షరములు మొదటగల నిఘంటువుల నొనర్చినవారు ధరణి మున్నగువారు. తత్తత్స్థాన జనితాక్షరములు (శబ్దముల) అంతమందుకల కోశములచేసినవారు రభసాదులు. శబ్దముల ఆది—మధ్యావసానములలో హ్రస్వ దీర్ఘవర్ణములను బోధించు కోశముల నలిపినవారు కొందఱు. నానార్థ నిఘంటువులలో నక్షర సంఖ్యానుసారము కాండాదులుకల కోశముల రచించినవారు ఇఱుగప దండనాథ ప్రభృతులు. నియతముగ శబ్దములయొక్క కొన్ని యర్థములను బోధించు నభిధానముల స్రష్టలు వేదాంత దేశికు లొక్కరు కనుపించుచున్నారు. (పూర్వము హరిహరామాత్యుడు (నేడు) నేను మున్నగువారు ఏకాక్షర నిఘంటు రచయితలు. రభసుఁడు మున్నగువారు శ్లోకములతో అకారాది నిఘంటు ప్రణేతలు. తారానాథ తర్క వాచస్పతి భట్టాచార్య ప్రభృతులు వాక్యరూపముస అకారాది వర్ణక్రమనిఘంటు నిర్మాతలు. తెనుగులో శ్రీమాన్ బహుజనపల్లి సీతారామాచార్య ప్రభృతులు. వీరిలో రభసుడు సంస్కృతభాషలో బహువిధ నిఘంటు నిర్మాతయైనవాడు. కేవలము సంస్కృత సంబంధములైన "విశేష నిఘంటువు" మున్నగు నా రచించిన నిఘంటువులు శ్లోకరూపములు. కాని సంస్కృతాంధ్ర భాషలు రెండును కలసియుండు నా "సంస్కృతాంధ్ర పదార్ణవము" వాక్యరూపము. భట్టుమల్ల, విజయానంద ప్రభృతులు క్రియాపద కోశకర్తలు. మఱికొందఱు ధాతురూపభేదములను దెలిపెడి నిఘంటువులను నిర్మించినవారు.

## అ ధో జ్ఞా పి క లు

1 ఏ యే మహర్షి రచించిన నిరుక్తము, ప్రాతిశాఖ్యము, శిక్ష ఏ యే వేదమునకు చెందినవో ఆ విషయము మా తండ్రిగారు విద్యారణ్య పంచానన విద్యా వాచస్పతి శ్రీమాన్ విక్రాల రామచంద్రాచార్యులవారు రచియించిన వేదాధ్యయన సంప్రదాయములో నాయా వేదముల అధ్యయన సంప్రదాయ భాగములలో తెలుపఁబడియున్నది. సంస్కృతము. సం॥రములో ముద్రితము.

2 తాళపత్ర గ్రంథమునందు చరిత్రముందు "రంగయసూరి"అనియుండ చాల విషయములు తొలిగించిన వావిళ్లవారి ముద్రిత గ్రంథములో "లింగయసూరి" అని కొంచెము మార్పుతో నుండుట గొప్ప విమర్శనీయమైన అంశము. నేను ముందటి గ్రంథముల ననుసరించి యిచ్చట "రంగయసూరి"అనివ్రాసితిని

# కా ల హే ల

## శ్రీ శివలెంక ప్రకాశరావు

దిక్ దిగంతాల పల్లవించిన
ప్రోదుల్నిగని పరవశించే వసంతాన్ని
సంతాపోద్విగ్న మానసాంతరాన
మల్లెల మత్తుగొనే గ్రీష్మాన్ని
నీరదానంద నృత్యభంగిమలను
నవబీజాంకురాల ముకురాలగనే ప్రావృట్టును
విరహాతప తపనీయోత్పలాల తళతళల్ని
ప్రతిఫలించే శరత్తును
సంతతామోద సస్యలక్ష్మికి
స్వాగత గీతిని రవళించే హేమంతాన్ని
గతానికి స్వస్తిగా — ఆగతానికి అంగలార్చే
వర్తమాన శిరాల తరతమాలను గనే శిశిరాన్ని
ఒక వత్సరాన్ని —
ఈ జగత్కాల వలయంలో
నేనొక వత్సరాన్ని !

# సమర్పణ

రఘువర్మ

నవరస వాహినివై
  అంతర్లీనంగా —
నాలో ప్రవహిస్తూ ...
నాలోని ప్రత్యణువునూ
          పలుకరిస్తూ ...
అంతర్నాదంగా —
నాలో నరనరానికొక గొంతు విప్పుతూ ...
అంతర్గీతంగా —
నా గుండెల్లో
సంగీతజలపాత విద్యుత్తుల్ని పరుగులెత్తిస్తూ...

ఊహ్యానూహ్యంగా,
స్పృశ్యా స్పృశ్యంగా,
దృశ్యాదృశ్యంగా,
లీలగా కదులుతూ ...
మృగతృష్ణలాగా
అనవరతం నాలో
తృష్ణను రగిలిస్తూ ...
నాకు ప్రేరణగా నిలిచే — నీకు
నా జీవితాన్నొక స్వేదబిందువుగా
సంతోషంగా సమర్పిస్తాను!

[కళామూర్తికి అంకితం]



# సగటు మానవుణ్ని

శ్రీ పణతుల రామచంద్రయ్య

రేపటి బీజాక్షరాల్ని గుబాళించే ఆ క్షేత్రంలో
  స్ఫాటిక స్వచ్ఛంగా ఉబికే అస్తిత్వాలు ఎవరివి ?
అక్కడ అంకెలూ విచికిత్సలూ ప్రేళ్లానవట
అనిమిషత్వాల జలతారు అక్కడే రచిస్తారట.

ఆసరాగా పట్టుకున్న తాత్పర్యాల్ని చెరిపేస్తూ
అడుగుతున్నారు వాళ్లు ప్రాక్తన విశ్వాస కిరీట ధారులు—

''సింధునదీ మైదానపు మడతల్లో అందగించే
వైవస్వత మన్వంతరం మూల్గులు విన్నావా నువ్వు ?
చూరుకింద పడివున్న ఏటవాలు బ్రదుకును చదువుతూ
ఏ నిత్యత్వంలోకి వాక్యాలు రువ్వగలవు చెప్పు ?''

అలాగే నిల్చున్నాను, అస్పష్టతల్ని అందుకోలేదు,
అగాధంగా మెరిసే అద్వైతాన్ని కళ్లద్దుకోలేదు,
మొన్నటివాణ్ని, ముత్తాతల శాలువాలు కప్పుకున్నవాణ్ని,
సాదా కార్యక్రమాన్ని కోరినవాణ్ని, సగటు మానవుణ్ని.



శ్రీ అవ్వారి వాసుదేవశాస్త్రి

# రసాభాసము

వాడుకలో వాడుకొనుచున్న పదములలోఁ గొన్ని కాలక్రమమునఁ దమ యర్థమును గోల్పోయి పూర్తిగా వ్యతిరేకార్థములోనో వ్యత్యస్తమగు నర్థములోనో మఱియొక యితరార్థములోనో యుపయోగింపఁ బడుచున్నవి. జనోపయోగములో నట్టి స్థితిలో నున్నవానినిఁ జూచి నప్పుడు 'అబ్బా! యింత దూరార్థములోనో దురర్థములోనో యివి ప్రయోగింపఁబడుచున్నవేమా!' అని బాధ కలుగుచుండును. ఈ యభిప్రాయము నొకప్పుడు విజయనగర ప్రాచ్యకళాశాలా ప్రధాన పండితులు సుగృహీత నామధేయులునగు యశఃకాయులు తాతా సుబ్బరాయశాస్త్రి గారు నెల్లూరులో నొక సభలో వెలువరించిరి. 'అనుమానము' అను శబ్దమున్నది. ఇది సంశయమను నర్థములో వాడఁబడుచున్నది. కాని యిది 'నిశ్చయమ'ను నర్థమును దెలియఁజేయవలసిన పదము. ఏల యన:— అనుమానునదియొక గొప్ప ప్రమాణము. ఇది ప్రత్యక్షాది ప్రమాణములలోఁ జేరినది. దాని నిర్వచనమేమనఁగా:— అనుమితికరణ మనుమానం. అనఁగా అనుమితినిఁ జేయుటయే అనుమానము. పరామర్శ జన్యజ్ఞానమనుమితిః. పరామర్శ వలనఁ గలుగు జ్ఞానమే అనుమితి. సాధ్య వ్యాప్యహేతుమాన్ పక్ష ఇత్యాకారకజ్ఞానం పరామర్శః. పక్షమందు సాధ్యమునకు వ్యాప్యమగు హేతువున్నదను జ్ఞానమే పరామర్శను. దీనినే పక్షే సాధ్య వైశిష్ట్యావగాహి జ్ఞానమ్ అనుమితిః అనియుఁ జెప్పవచ్చును. అనఁగా పక్షమున సాధ్యమున్నదను నిశ్చయ జ్ఞానమే అనుమితి అని యిచట సారాంశము. ఉదా:— ఒక కొండనుండి పొగ వచ్చుచున్నది. దానినిఁ జూచిన యొక అభిజ్ఞుఁడు వంటయిల్లు మొదలగుచోట్లఁ జూచిన అనుభవముతో నీ పర్వతములో నిప్పున్నదని గట్టిగా నిశ్చయించి తెలిసికొనుటయే అనుమానము. కాని ఉన్నదా? లేదా? అగునా? కాదా? అను సంశయముగాదు. గావున 'వాఁడు సరిగా సమాధానములు వ్రాయలేదఁట. పరీక్షలో నుత్తీర్ణుఁడగునో కాదో అని అనుమానముగా నున్నది' అను వానివంటి సందర్భములలో 'అనుమాన' శబ్దమును వాడుట పూర్తిగాఁ దగనిపని అని వారు దానిని విపులీకరించిరి.

అట్లే రసాభాసమను శబ్దమునుగూడ అనుచితమగు స్థానములలో వాడుచున్నారు. ఇది దూరార్థమునేకాక చాల దురర్థము నిచ్చు నట్లును వాడుచున్నారు. ఒక యిద్దరికి నేదైన మాట కలియక, తగాదా యైనచో 'వారిద్దఱికి రసాభాసమైనద'ను వాడుక లోకములోనున్నది. కావున అసలు రసాభాస శబ్దస్వరూపమేదో దాని యర్థమేదో విచారించి తరువాత నిప్పటి వాడుకలోని అర్థమునకును దానికిని సంబంధమున్నదో లేదో తెలిసికొందము.

రస + ఆభాసము = రసాభాసము అనఁగా రసముయొక్క ఆభాసము. రసము అనఁగా నిచట శృంగారాది రసము. ఆభాస పదమును కూడ విడఁదీసిన ఆ + భాసము అని రెండు పదము లేర్పడును. 'ఆ' అనునది ఆఙ్ అను ఉపసర్గయొక్క క్లుప్తరూపము. ఈ ఆఙ్

"ఈషదర్థే, క్రియాయోగే, మర్యాదా, భివిధౌచయః।
ఏతమాతం ఙితం విద్యాత్, వాక్యస్మరణయో రఙిత్॥"

అని మహాభాష్యకారులచే వివరింపఁబడియున్నది. కొంచెము అను నర్థమునందును, క్రియాసంబంధమునందును, మర్యాద (ఇవతలిహద్దు) అను నర్థమందును, అభివిధి (అవతలిహద్దు) అను నర్థమునందును ఈ ఆ కారము ఙ కారముతోఁగూడి ఆఙ్‌గా నుండును.

ఆ ఏవంను మన్యసే—దీనికి వ్యాఖ్య పూర్వప్రక్రాంత వాక్యార్థస్య అన్యథాత్వ ద్యోతకోఽయమాకారః. పూర్వమిత్థం న్మామంస్థాః. ఇదానీం త్వేవం మన్యసే ఇత్యర్థః. పూర్వమిట్లు తలఁచవైతివి. ఇప్పుడిట్లనుకొనుచున్నావు. ఇది వాక్యమున కుదాహరణము. ఆ ఏవం కిలతత్—స్మరణ ద్యోతకోఽయమాకారః = అది యిట్లు జరిగినదిగదా! ఇది స్మరణమున కుదాహరణము. ఈ రెండు చోట్లను 'ఆ'కార మాత్రముగా నుండును. అనఁగా ప్రక్కన ఙకారము చేరదన్నమాట. సారాంశముగా:—ఇచటనున్న 'ఆ' కారము 'ఙ్' అను ఙ కారముతోఁ గూడినదే. ఇది ఈషత్ (కొద్దిగ) అను నర్థమునిచ్చును. దీనికి వైయాకరణు లిచ్చిన యుదాహరణము 'ఈషదుష్ణం = ఓష్ణమ్' అని. అనఁగా ఇచ్చటనున్న ఆకారమునకు ప్రగృహ్య సంజ్ఞలేదు గాన సంధివచ్చి ఆ + ఉష్ణం = ఓష్ణం అయినది. కొంచెము వేడియైనదని యర్థము.

అట్లే ఆభాస శబ్దమునఁ గూడ 'ఆ' ఈషదర్థమున నుపయోగింపఁబడినది. కాన ఆ + భాసః = కొద్దిగా భాసించుట అని యర్థము. రస + ఆభాసః = రసాభాసః అనఁగా రసమిచ్చట సంపూర్ణమైన పరిపోషమును పొందలేదని యర్థమే కాని రసము చెడిపోయినదని కూడ పూర్తిగా అర్థముగాదు.

"ఏకత్రైవాను రాగశ్చేత్ తిర్యఙ్మ్లేచ్ఛగతోఽపివా।
యోషితో బహుసక్తిశ్చేత్ రసాభాసస్త్రిధా మతః॥"

అని యీ రసాభాసము మూఁడు రకములుగానుండును. (1) నాయికయందే కాని నాయకునియందే కాని ఏ యొకరియందో మాత్రమే అనురాగమును వర్ణించుట, (2) తిర్యగ్ జంతువులయందు (పశుపక్ష్యాదులయందు) వర్ణింపఁబడిన అనురాగము. (3) మ్లేచ్ఛుల

యందు వర్ణింపఁబడిన యనురాగము. (మ్లేచ్ఛులనఁగా అపశబ్దములఁ బలుకువారు.)

నన్నొక రొకప్పు డడిగినారు, మహాకవి తిక్కన సోమయాజి గారు తమ విరాట పర్వములో కీచకునియందు మాత్రమే అనురాగము వర్ణించి రసాభాసము చేసినారేమని. ఈ అడిగినవారికి రసాభాసమనఁగా నేదో పెద్ద తప్పు అనియు, అది తిక్కనగారు చేసినారనియు నభిప్రాయము. వర్ణింపవలసినచోట రసాభాసము వర్ణింపవలసినదే. అదిగాక రసాభాసమనిన నేదోయొక పెద్ద తప్పేమియుఁగాదు. రసము పూర్తిగా పరిపోషము పొందకపోవుటయే కాని దోషము గాదు. తిక్కన గారు కీచకుని విషయమున దీనిని వర్ణించుట భూషణమే కాని దూషణముగాదంటిని.

ఈ రసాభాస పదమీ యర్థమునే యిచ్చుననుట కుదాహరణముగా విరోధాభాస పదమొకటి యున్నది. చూడుఁడు. విరోధాసము— ఇదియొక యలంకారము. దీనిలోని పదములను విరోధ + ఆభాసము = విరోధాభాసము అని విడఁదీయఁగా రెండుపదములు వచ్చును. విరోధమువలెఁ గొలఁదిగా భాసించి విమర్శింపఁగా విరోధము లేనిదని యర్థము.

"వినాఽపి తన్వి! హారేణ, వక్షోజౌ తవ హారిణౌ"

ఓ తరుణీ! నీ వక్షోజములు హారములేకయే హారులు (హారము గలవి)గా నున్నవి అని యర్థము. హారము లేకపోయినను హారముగలిగి యున్న వెట్లగునని, వినుటతోడనే కొంచెము విరోధముగా తోచి 'హారిణౌ = మనోహరములైనవి' అని అర్థము చెప్పికొనిన ఈ విరోధము పరిహరింపఁబడిపోవును.

అట్లే "అగజానన పద్మార్కం గజానన మహర్నిశం" అన్నచోటఁ గూడ అగజాననుఁడు (గజముఖము లేనివాఁడు) గజాననుఁ డగుటయేమిటి? అని విరోధము మొదట కొంచెము తోచును. విమర్శించి చూచిన అగజానన పద్మార్కుఁడు = పార్వతీదేవి ముఖపద్మమును వికసింపఁజేయుటలో సూర్యసదృశుఁడు గజముఖుఁడు అని తెలిసిన మీదట విరోధము భాసింపదు. కావున నిచటఁగూడ ఆభాసమను పదమునకు 'కొద్దిగా తోచుట' అని యర్థమే. కాని మఱియొక యర్థము లేదు. కాఁబట్టి యీ వాడుకలోనున్న యర్థము పూర్తిగా పదమునకు విరుద్ధమైనది.

కవి ప్రయోగములు చూచినను నాకు తగిలినంతలో కీ. శే. తిరుపతి వేంకటకవుల ప్రయోగ మొకటి గోచరించుచున్నది.

"... ... ... ... చక్కని లలితాంగికిన్ రసా
భాసపు దున్నపోతొకఁడు పాయక దాపురమైన నట్టిచో..."

ఇచ్చటఁగూడ కళాభిజ్ఞయై లలితాంగ శోభితయైన స్త్రీకి ఉచితమైన రసజ్ఞత పూర్తిగలేక రసముయొక్క యీషదాభాసముగల మహిషాసురునివంటి వాడామె. దౌర్భాగ్య విశేషమున దాపురించిన నిఁక నామె బ్రతుకు బండలపాలయినట్లేయని చెప్పవచ్చును. లేదా ప్రవాహపతితముగానున్న అర్థమును గ్రహించి లోకానుసారము ప్రయోగించి రన్నను నిబ్బందిలేదు.

కావున రసాభాస శబ్దమునకు కేవల దుష్కృత మొదలగు నర్థములు లోకపు వాడుకలోనున్నవి సరియైనవికావని గ్రహించి యీ రసాభాస శబ్దమునకు ఆలంకారిక శేఖరులగు రసతత్త్వవేత్తలేమి యుదాహరణము లిచ్చి యెట్లు నిర్వచించిరో చూతము.

విద్యానాథ మహాకవి తన ప్రతాపరుద్ర యశోభూషణములో— తిర్యగ్గతమైన శృంగార (రసాభాస)ము నిట్లుదాహరించెను.

"ప్రాసాద గర్భ వలభీషు కపోత పాల్యం
పారావతీం రమణచుంబిత చంచుకోటిం।
ఆవిర్భవత్సురత కూజిత రక్తకంఠీం
ఆలోక్య కాకతి విభుః స్మితమాతనోతి॥"

మేడలోని దూలపు పట్టెలయందు నివసించుచు తన భర్తచే ముద్దుపెట్టుకొనఁబడిన ముక్కులుగల ఆడుపావురమునకు అప్రయత్నముగా రతకూజితములు బయలుదేరఁగా మధురముగా కూయుచున్న ఆ కపోతినిఁ జూచి ప్రతాపరుద్రుఁడు చిఱునవ్వు వెలార్చెను అని దీని యర్థము.

ఇచ్చట తిర్యగ్జంతువులగు పావురములకు కళాకౌశలము లేక పోవుటవలన వాని శృంగారమునకు విభావాది పరిపూర్తి కలుగనందున నిది ఆభాసము.

దాదాపుగాఁ బ్రతాపరుద్రీయమున కనువాదమని యెంచఁబడుచున్న నరస భూపాలీయమను కావ్యాలంకార సంగ్రహములో—

అలఘు విశీర్ణపక్షయుగమై యమితోన్న మితోర్ధ్వకాయమై
గళరవముల్ దవిర్పఁ బ్రియకాంతకు ముద్దులుపెట్టియుబ్బునం
బలుమఱు మేడపై కెగసి పక్షము ద్రిప్పుచుఁ గుంచితాస్యమై
పొలఁతుకఁబిల్చు విభ్రమ కపోతము హుంకృతనాద మాధురిన్

అని యుదాహరించి యిచటఁ గపోత దంపతుల శృంగారము వర్ణింపఁబడినది. కాన రసాభాసమని పై గ్రంథములోవలెనే వివరింపఁబడినది.

ఇఁక కావ్యప్రకాశమున మమ్మటాచార్యుఁడు (శృంగార) రసాభాసమున కిట్లుదాహరణ మిచ్చి వివరించెను.

స్తుమః కం వామాక్షి క్షణమపి వినా యం నరమసే
విలేభేకః ప్రాణాన్ రణమఖముఖే యం మృగయసే।
సులగ్నే కోజాత శ్శశిముఖి! యమాలింగసి బలాత్
తపశ్శ్రీః కస్యైషా మదన నగరి! ధ్యాయసి తుయం॥

అత్ర అనేక కాముక విషయ మభిలాషం తస్యాః స్తుమ ఇత్యాద్యనుగతం బహువ్యాపారోపాదానం వ్యనక్తి.

పరకీయ నాయికను గూర్చి యొక కాముకుఁడు పలికెడి పలుకులివి. సుందర నేత్రములుగల ఓ లలనా! ఎవఁడు లేనిదే క్షణముగూడ సంతసింపవో అట్టివాని నేమని పొగడఁగలము? ఏ పురుషుని స్వయముగా వెదకు కొనుచుందువో వాఁడు పూర్వజన్మలో ఏ సంగర రంగ

మునసో మృతిఁజెంది యీ జన్మలో నీతోడి యీ స్వర్గసుఖము ననుభ వించుచున్నాఁడు. ఎవనిని గాఢముగా బలాదాలింగన మొనర్చుకొను చున్నావో వాఁడెవఁడో గొప్ప లగ్నమున జన్మించినవాఁడై యుండును. ఓ మన్మథ రాజధానీ! ఎవనిని మనసా తలంచుచున్నావో వాఁడు పూర్వమెంతో తపస్సు సమృద్ధిగాఁ జేసినవాఁడు.

ఇచ్చట నాలుగు పాదములలో వేరువేరుగాఁ జెప్పిన నాయిక యొక్క అనేక విధములగు కామచేష్టలామె కనేక కాముకులయెడ అనురాగమును దెలుపుచున్నవి, గాన నిచట రసాభాసము. అంతేకాక బలాత్కారముగ కాముకుని కౌగిలించుటయని చెప్పఁబడుటచే ఉభయ నిష్ఠముగా లేకుండుటచేతను (రతి) రసము ఆభాసమైనది.

ఆలంకారిక ప్రవరుఁడు సాహిత్య కేసరి జగన్నాథ పండితరాజు తన రసగంగాధరములో:—

నహ్యానుచితత్వేన ఆత్మత్వహానిః. అపితు సదోషత్వాదాభాస వ్యవహారః అశ్వాభాసాది వ్యవహారవత్ (=ఉచితము గానంతమాత్రమున రసత్వమునకు హానిలేదు. ఇక నేమన సదోషముగాన ఆభాసమని వ్యవ హారము అశ్వాభాసమని యొక రకపు గుఱ్ఱమును వ్యవహరించినట్లే) అని స్వమతమును జూపుచు రాజరమణీగతమైన పరకీయ నాయక శృంగారమును, సీతాలంబనకమైన రావణగత శృంగారమును నుదాహ రించెను. కావున ఈయన మతములోఁగూడ రసశబ్ద వ్యవహారమున కేమియు బాధలేదని తెలియుచున్నది.

స్వారోచిషమనుచరిత్రమునఁ బెద్దనగారు (విప్రలంభశృంగార) రసాభాసమును వర్ణించియే యున్నారు. చూడుఁడు—

ఘనసార పంకమొక్క లతాంగి దెచ్చిన
ముట్టె ప్రేలనె చుక్కబొట్టు వెట్టె
ఇంతి యొక్కతె పూవుటెత్తు లెత్తెఁ జూచి
విసువుతో నొక కొన్ని విరులు దుఱిమి
పడఁతి యొక్కతె రత్నపాదుక విడనిల్చి
తొడుగ కవ్వలికి బోనడుగు వెట్టె
బాగాలు వెసనొక పద్మాక్షి యొసఁగిన
వెగ్గలంబని కొన్ని వెడల నుమిసి
సగము గొఱికిన యాకులు, సఖులు పిలువ
సగమొసఁగు నుత్తరముఁ; దెల్విసగము మఱపు
సగమునయి చింతచే సగముగుచు నరిగె
నవ్వరూథిని యంతికోద్యానమునకు.

ఇట్లే వీరరసాదులకును నాభాసలు గలవు. వ్యాస విస్తరభీతిచే నందొకటి మాత్రముదాహరించుచున్నాను.

బ్రహ్మహత్యాదులగు మహాపాతకములఁ జేయుటయందుత్సాహ మును జూపుటయు, నధమ పాత్రగతముగా వీరమును జూపించుటయు వీరాభాసమగును.

దైవతారాధనంబుల ధ్వంసపఱచి
సరవి విప్రుల దుంపనాశం బొనర్తు
కాలు దండంబునకు రుద్రుశూలమునకు
నింద్రు వజ్రాయుధమునకు నేను వెఱవ॥

ఇచట దేవబ్రాహ్మణ వధోత్సాహము వీరాభాసము.

విద్యాధరుఁ డేకావళీ గ్రంథమును రచించుచు దానిలో తిర్య గ్జంతువుల రతిని రసమనియే చెప్పుచు

''విభావాది సంభవోఽపి రసం ప్రతి ప్రయోజకః. న విభావాది జ్ఞానం. తతశ్చ తిరశ్చామస్త్యేవ రసః'' అనెను. అనఁగా ''తిర్యగాదు లకుఁ గళాకౌశలము లేకపోవుటచే వాని శృంగారము విభావాది పరి పూర్ణముగాదు. కాన రసాభాసము'' అనుట యుక్తము గాదు. విభావాదు లుండుటయే రసమునకుఁ బ్రయోజకము. పాత్రలకు విభావాది జ్ఞాన మక్కఱలేదు. కాన కళాకౌశలముతోఁ బనిలేదు. కావునఁ దిర్యగ్గతియు రసమే అని వివరించెను.

కావున మనుచరిత్రలోని

నునుఁజిగుళ్ళాకు మేయుతఱి నోరికెలంకులఁదేటి కుట్టినన్
వన తరుశాఖలం గువకువధ్వనిఁ బాఱు పికాంగనం బికం
బను నయ మొప్ప మాన్పుగతి నాత్మముఖంబు ముఖంబుఁ
జేర్చి చుం
బన మొనరించె; సందు సుడిమాయలుగా మగవారికృత్యముల్.

అను రసాభాసమున రసమున్నదనియే భావింపవచ్చును.

దోషయుక్తమైనంత మాత్రమునఁ గావ్యత్వమునకు భంగము రాని విధమునఁ, గీటాను విద్ధత్వమున్నంత మాత్రమున రత్నత్వము నకు భంగము గాని విధమున, ననౌచిత్యమున్నంతమాత్రమున రసము గాకపోదు. రసత్వమునకు రసాభాసత్వమును నుండుటలో దోసఁగులేదు. మఱియు రసాభాసము వర్ణింపరాదను దోషమును గానరాదు అని శ్రీ సన్నిధానం సూర్యనారాయణశాస్త్రిగారు దీనినిఁ గూర్చి విషయ మును దేల్చి వ్రాసియున్నారు.

కావ నీ రసాభాస శబ్దమును 'మిక్కిలి దుష్టమైనది' అను నర్థములోఁ బ్రయోగింపవలసిన ఆవశ్యకత లేదని మనవి చేసికొనుచు, శ్రీకృష్ణునిఁ (సంభోగ శృంగార) రసాభాసముతోఁ బాఠకులకు నూతన సంవత్సర శుభాశీస్సుల నందించుచు ఈ వ్యాసమును ముగించు చున్నాను.

మ. మగఁడా మోటు మనుష్యుఁ డీవనమునీ
ర్మానుష్య, మే బాల, నొం
టిగ నుంటిన్ బహుళాంధకారములు నిం
డెన్ నల్దెసల్ మూసి కొ
న్న గతిన్, గావున దారివీడు వెసఁ గృ
ష్ణా! మోహనాకార! యం
చొగిఁ బల్కాఁడు వ్రజాంగనం గలియు శ్రీ
కృష్ణుండు మిమ్మోముతన్.

# కవితా-పుష్పం నిరీక్షణ

## శ్రీ కందనెల్లి భద్రన్న

విరిసిన తోటలో
తుమ్మెద నాదాలు
కవితా హృదయంలో
భావాల రాగాలు
వికసించిన పువ్వేగా ...
పులకరించి పోయేది
వినదించిన ఎడదేగా ...
స్పందించుకు ప్రాకేది
మకరందాల నందిస్తాయి
... కుసుమాలు
అనుభూతుల నందిస్తాయి
... హృదయాలు
ఆ సుమాల తపనంతా
భ్రమరాలకోసం.

ఈ హృదయాల వేదనంతా
శబ్దశక్తి కోసం.
పలవరిస్తూ —
పరితపిస్తూ —
క్షణం క్షణం నిరీక్షణలో
అనుక్షణం గడిపేస్తాయి.
మధువులున్నను ప్రతి పువ్వుకు
తుమ్మెద వ్రాలాలని లేదు
అనుభూతులున్న ప్రతి హృదిలో
భాషను గుణ్యం కలగాలనిలేదు.
ప్రకృతి తత్త్వమదేమో!
కవితా మర్మమిదేమో!

# జ్ఞాపకాల అల్లరి

## శ్రీ కోడంపవన్

నా జ్ఞాపకాల్ని
గుండెలో దాచుకుంటా —
మరికొన్ని జ్ఞాపకాల్ని
రక్తంతో డైరీలో వ్రాసుకుంటా —

అప్పుడప్పుడు,
గుండెను తీసి
జ్ఞాపకాల్ని నెమరువేసుకుంటే,
గుండె
క్రొవ్వొత్తిలా మారి
జ్ఞాపకాలు మంటై
నన్ను బ్రతికించి — అవి బ్రతుకుతూ —

డైరీనితీసి
జ్ఞాపకాల్ని చదువుతుంటే,
డైరే కన్నయి
జ్ఞాపకాలు నీరై
నన్ను చంపి — అవి ఛస్తూ ...!



ప్రధానమంత్రి 20 అంశాల

కార్యక్రమం

# లక్షలాది కష్టజీవులకు వరప్రసాదం



శ్రీమతి ఇందిరాగాంధి (ప్రధానమంత్రి)

శ్రీ టి. అంజయ్య (ముఖ్యమంత్రి)

ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధి ప్రకటించిన 20అంశాల ఆర్థిక కార్యక్రమం, వాస్తవానికి ఆంధ్రప్రదేశ్ అభివృద్ధికి సుస్థిరమైన ప్రగతికి సంకేతం. ఇది బడుగు వర్గాల అభివృద్ధికి జరుపుతున్న కృషిలో నూతన అధ్యాయాన్ని ప్రారంభించింది. లక్షలాదిమంది బలహీనవర్గాల ప్రజలలో కొత్త ఆశలను చిగురింప జేసింది.

## వాస్తవాలే ఇందుకు దర్పణం రికార్డుస్థాయిలో ఆహారోత్పత్తి :

1978—79లో రికార్డుస్థాయిలో 106.6 లక్షల టన్నుల ఆహారధాన్యాలను ఉత్పత్తిచేశారు. తుఫాను, దుర్భిక్ష పరిస్థితులు ఏర్పడినప్పటికీ తాత్కాలిక ప్రణాళికలను త్వరితగతిని అమలు జరపడంతో 79—80లో కనీసం 70 లక్షల టన్నులమేరకు ఉత్పత్తి సాధించగలిగారు.

## ప్రజలకు చౌక వస్త్రాలు :

అరవై శాతం మంది చేనేత పనివారలను సహకార పరిధిలోకి తెచ్చారు.

1977—78లో 189 లక్షల చదరపు మీటర్ల చౌకవస్త్రాలను ఉత్పత్తిచేయగా 1978—79లో 2.3 లక్షలు 1979—80లో 330 లక్షల చదరపు మీటర్ల చౌక వస్త్రాలను ఉత్పత్తిచేసి ఇప్పుడు 388 కేంద్రాల ద్వారా ప్రజలకు పంపిణీ చేశారు.

## చౌకధర దుకాణాల ద్వారా అత్యవసర సరుకులు :

ఇప్పుడు 22,009 చౌక ధర దుకాణాల ద్వారా ప్రజలకు అత్యవసర సరకులను సరసరా చేస్తున్నారు.

## భూ సంస్కరణలు :

రాష్ట్రంలో భూసంస్కరణలను తీవ్రతరంగా అమలుజరుపుతున్నారు. ఇందువల్ల 3.79 లక్షల ఎకరాల మిగులు భూమిని స్వాదీనం చేసుకున్నారు. 1,74,125 కుటుంబాలకు భూమి పంపిణీ చేశారు. వారిలో చాలావరకు షెడ్యూలు కులాలు, షెడ్యూలుతెగలు, వెనుకబడిన తరగతులవారుఉన్నారు.

## బలహీన వర్గాలకు ఇళ్ళు :

ఈ పథకాన్ని ద్విగుణీకృతోత్సహంతో అమలు జరుపుతున్నారు. 2.5 లక్షల కుటుంబాలకు 5,000 కొత్త వాడలలో వసతి కల్పించారు. 12 లక్షల పేద కుటుంబాలకు ఇళ్ల స్థలాలు కేటాయించారు.

---

డైరెక్టరు, సమాచార, పౌరసంబంధశాఖ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంచే ప్రకటితము.

DIPR No. 9407/Advt./CI-3/81

# రుధిర జ్యోత్స్న

శ్రీ బి. బి. జి. తిలక్

ఈ వెన్నెల
శరత్కాలపు అగరొత్తులు చిందిన
మధువీచిక కాదు —
అన్యాయం అభావంచేసే
సమర సంవర్త !
ఈ వెన్నెల
వెలగలి పొదలు పంపిన
కమ్మటి పరిమళమూకాదు —
ప్రతీకారవాదం !
మిన్నాగుల బుస ! బుస !!

*　　　*　　　*

నెత్తుటి చిత్తడిలో
మొలకెత్తిన వెన్నెల విత్తుయిది
కాచివడబోసిన కారడవుల్లో
విప్లవ వీరులకు — వుషార్ !
అడవికాచిన వెన్నెలకాదిది,
అడవే పల్లెలు పట్నాలు నగరాలయ్యే వెన్నెలది.
ఈ వెన్నెల
పగలూకాస్తుంది
పగలై లేస్తుంది.

యుద్ధం శాంతిని ప్రసవించినట్టు
సూర్యుడు చంద్రుణ్ణి వెలిగించినట్టు
ఈ వెన్నెల
అనివార్యమైన
సమ సమాజాన్ని ప్రతిఫలిస్తోంది.

*　　　*　　　*

ఈ వెన్నెట్లో
ప్రేమలూ మమతలూ స్నేహితాలూ —
అన్నిరకాల వ్యక్తి సంబంధాలూ సామాజిక
బాధ్యత ముందు
సిగ్గుతో తలవంచుక నించుంటాయి
మనకెందుకులే ! అనుకొనేవాళ్ళే వుండరు
అందరూ
తమ వంతు కర్తవ్యాన్ని విధిగా నిర్వర్తిస్తారు
మధ్య మధ్య
పిరికివాళ్ళు కల్పించే చికాకులుతప్ప
అంతా సవ్యంగానే జరుగుతుంది.

*　　　*　　　*

ఈ వెన్నెలకల
నిజమవుతుంది.



శ్రీ కె. జనార్ధన్ శ్రీ జి. సుదర్శన్

# వయోజనవిద్య-హరిజనుల దృక్పథము

(రచయితలు కాకతీయవిశ్వవిద్యాలయంలో పరిశోధనలు కొనసాగిస్తున్నారు.)

'ప్రగతి' ప్రక్రియలో 'సామాజిక పరివర్తనం' ఒక ముఖ్యాంశం. ఈ సామాజిక పరివర్తనం ప్రజలు ప్రభుత్వ కార్యక్రమాలలో చురుగ్గా పాల్గొనే దానిపై ఆధారపడి ఉంటుంది. దీనికి ప్రజల చొరవ ఎంతో అవసరం. అయితే ప్రజలు విద్యావంతులు కావంత వరకు అది సాధ్యపడదు. 'విద్య' మార్పుకు ముఖ్యసాధనంగా ఈనాడు భావించబడుచున్నది. అన్నివిధాల అభివృద్ధి కార్యక్రమాల నిర్వహణకు అది ఉపయోగపడుతుంది... ఈ కారణంగానే మానవ హక్కుల దృక్పథంలో 'విద్య' అందరనుభవించే 'హక్కు'గా గుర్తించబడింది.[1] విద్యాభివృద్ధి జరగనిదే ఏ దేశము కూడ త్వరితగతిని అభివృద్ధిచెందదు. ''ఒకవేళ బ్రహ్మాండమైన మార్పును సాధించాలంటే, అదికూడా రక్తపాత విప్లవం లేకుండా ఒక సాధనం—ఒకే ఒక సాధనం ఉపయోగించవచ్చు. అదే విద్య.''[2] విద్య సామాజిక చైతన్యమునకు, ఆర్థిక స్వాతంత్ర్యమునకు తోడ్పడుతుంది. వ్యక్తిలో విశ్వాసాన్ని పెంచి సామాజిక జీవనం సాఫీగా సాగిపోవడానికి, జనసామాన్యంతో కలిసి బ్రతకడానికి దోహదం చేస్తుంది కూడా. దీని ఫలితంగా సమసమాజం నెలకొంటుంది.

'పాఠశాల విధానం' ద్వారా విద్యగరపడం అన్నింటికన్న ఉత్తమ మార్గం. అయితే ఈ విధానం అందరికీ అందుబాటులోలేదు. కనుకనే అనేకమంది విద్యావేత్తలు, మేధావులు, పరిశోధకుల ఆలోచనల, కృషి ఫలితంగా అందరికి అందుబాటులో ఉండే వయోజనవిద్య, కరస్పాండెన్స్ విద్య, సాంప్రదాయేతర విద్య, బహిరంగ (బహిర్గత) విద్య, రికరెంట్ విద్యవంటి ప్రత్యామ్నాయ విద్యాపద్ధతులు ఆచరణలోకి వచ్చాయి.[3]

విద్య గరపడానికి 'పాఠశాల విధానం' గాక అనేక ప్రత్యామ్నాయ మార్గాలెన్నియున్నను ప్రపంచములో అక్షరాస్యులకంటె నిరక్షరాస్యుల శాతమే ఎక్కువ. అట్టి నిరక్షరాస్యులలో సగభాగం భారత దేశంలోనే ఉన్నారు. భారత రాజ్యాంగం 'విద్య'ను ప్రాథమిక హక్కుల్లో ఒకటిగా గుర్తించి నప్పటికిని దేశపు అక్షరాస్యత 30.7% మాత్రమే. ఇందులో 46% పురుషులు కాగా 22% స్త్రీలు. ఇంగ్లాండులో 1870–82 సంవత్సరాల మధ్యకాలంలో నిర్బంధ విద్యాపథకము ద్వారా నూరుశాతం అక్షరాస్యతను సాధించారు. జపాను కూడా 1880—90 సం॥ మధ్యకాలములో నూటికి నూరుపాళ్ళు ప్రజల్ని విద్యావంతుల్ని చేయగల్గినది.[4] మనదేశపు విద్యాకమిషను (1964–66) సూచనల ప్రకారం 1971 నాటికి 60శాతమును 1976 వరకు 80%ను అక్షరాస్యతను సాధించవలసి ఉంది.[5] కాని అది సాధ్యము కాకపోగా నిరక్షరాస్యుల సంఖ్య మరింత పెరిగింది.

1978లో వయోజనవిద్యా కార్యక్రమంద్వారా ప్రజల్ని అత్యధిక సంఖ్యలో అక్షరాస్యులను చేయాలని అప్పటి కేంద్ర ప్రభుత్వము సంకల్పించినది. ఆ సంకల్పమునకు కార్యరూపమే జాతీయ వయోజన విద్యా కార్యక్రమము. ఈ కార్యక్రమమును జాతిపిత గాంధీగారి 110వ జయంతి, అక్టోబరు 2వ తేదీన లాంఛనప్రాయంగా ప్రారంభించబడినది. ఇది దేశవ్యాపితమైన బృహత్తర పథకము. 10 కోట్ల మంది వయోజనులను 5 సం॥ల కాలము (1978–83)లో అక్షరాస్యులను చేయుట దీని లక్ష్యము. ఇంత పెద్దయెత్తున దేశవ్యాప్తంగా ఈ కార్యక్రమాన్ని అమలు పరచడం ప్రపంచ చరిత్రలోనే అపూర్వమైన మహత్కార్యంగా మన రాష్ట్రపతి నీలం సంజీవరెడ్డిగారు వక్కాణించినారు.[6]

నిరక్షరాస్యతా నిర్మూలనకై చేపట్టిన ఈ వయోజన విద్యా కేంద్రము అన్ని తరగతుల, జాతుల, వర్గాల, స్త్రీ—పురుషులకు సంబంధించినది. అయినప్పటికి ఈ కార్యక్రమము గ్రామీణ ప్రజలను అక్షరాస్యులను చేయుటలో ప్రత్యేక శ్రద్ధను తీసుకొంటున్నది. గ్రామీణ ప్రజలలో ముఖ్యంగా స్త్రీలు, షెడ్యూల్డు కులాలు, జాతుల విషయంలో మరింత శ్రద్ధాసక్తుల్ని కనబరచడం జరుగుచున్నది. ఎందుకనగా దేశంలో వీరి సంఖ్యయే అధికంగా ఉండడం. అన్ని వర్గాలకంటె హరిజనులు ఆర్థిక, సాంఘిక, రాజకీయరంగాలలో వలె విద్యారంగంలో కూడా చాలా వెనుకబడి ఉన్నారు.

అనాదినుంచి అంటరానివారిగా పరిగణింపబడుతున్న హరిజనులు—భారతదేశములో సాంఘికంగాను, ఆర్థికంగాను ఇతరత్రా విషయాలలోను సమాజంచే వెలివేయబడ్డారు. కొన్ని ప్రాంతాలలో వీరికి తమ కాళ్ళదాకా దోతి బట్టను కట్టుకోవడానికి కూడా అనుమతించేవారు కాదు. మరికొన్నిచోట్ల హరిజనుల్ని నగరాలలోనికి గాని, గ్రామంలోకి గాని ప్రవేశించుట నిషిద్ధము. ఆ నిషిద్ధానికి విరుద్ధంగా ప్రవర్తించిన హరిజనుడు శిక్షార్హుడు. నేటికి పలు ప్రాంతాలలో హరిజనులపై ఎన్నో నిషేధాలు విధింపబడుతున్నాయి. ఇప్పటికి ఆంధ్రప్రదేశ్ వంటి రాష్ట్రాలలో అగ్రవర్ణాలవారు హరిజనుల చేతిగుండా మంచి నీళ్ళైనా ముట్టరు. ఈవిధంగా అనాదినుంచి అణచివేయబడుతున్న హరిజనులు విద్యా విషయంగా వెనుకబడి ఉండుట సహజమే.

స్వాతంత్ర్యానంతరం హరిజనోద్ధరణకు భారత ప్రభుత్వం ఎన్నో అభివృద్ధికరమైన కార్యక్రమాలను రూపొందించి అమలు పరుస్తున్నది. అందుకు భారత రాజ్యాంగంలో అనేక అంశాలను పొందు పర్చడం జరిగింది. 'బలహీనవర్గాల వారిని విద్యావిషయంగాను ఆర్థికంగాను మెరుగుపరచుటకు ప్రత్యేకశ్రద్ధ తీసుకొని షెడ్యూల్డు కులాలు—జాతులను అన్నివిధాల దోపిడీ విధానాలనుంచి రక్షణ కల్పించవలె'నని రాజ్యాంగం నిర్దేశిస్తున్నది. హరిజనుల సంక్షేమానికి సంబంధించిన చట్టాలను రూపొందించి అమలు పరుస్తున్నారు. విద్యా విషయంగా మరెన్నో సదుపాయాలను కల్పిస్తున్నారు. పాఠశాలలు, కళాశాలలు, విశ్వవిద్యాలయములలోను, విద్యా—సాంస్కృతిక సంస్థలలోను రిజర్వేషన్లు కల్పించుట, వసతి గృహాల ఏర్పాటు, ఉపకార వేతనాల చెల్లింపు మున్నగు సదుపాయాలను కల్పిస్తున్నారు. అయినప్పటికి హరిజనుల విద్యాస్థాయి చెప్పుకోదగినంతగా పెరగలేదు. 1971 జనాభా లెక్కల ప్రకారం వీరి విద్యాస్థాయి 14.7%మాత్రమే. ఇందుకు కారణం గత మూడు దశాబ్దాల కాలమునుంచి ప్రాథమిక విద్యపట్లను, హరిజన ప్రజలపట్లను తగినంత శ్రద్ధాసక్తుల్ని చూపకపోవడమే. అందులకే మళ్లీ ఈనాడు ఈ వయోజన విద్యాకార్యక్రమంలో హరిజనులపై ప్రత్యేక ఆసక్తిని కనబరుస్తున్నారు.

తరతరాలుగా అణచివేయబడుట వలన హరిజనులలో కొన్ని మూఢవిశ్వాసాలు, అమాయకత్వం, పిరికితనం, అనారోగ్యం, అపరిశుభ్రత, పేదరికంవంటి రుగ్మతలు వారి నరనరాలలో జీర్ణించుకుపోయినవి. వీటిని తొలగించనంతకాలమూ వీరిలో ఎటువంటి సామాజిక చైతన్యమురాదు. నిరక్షరాస్యులైన హరిజన వయోజనులకు ఈ వయోజన విద్యాకార్యక్రమము "కారుచీకటిలో కాంతిరేఖ" వంటిదని చెప్పవచ్చు. ఈవిద్యద్వారా వారిలో నూతనోత్సాహాన్ని తీసుకరావచ్చు; ఆర్థిక, సాంఘిక ప్రగతిని సాధించవచ్చు. 'దీనికి ఒక నిర్దిష్టమైన బృహత్తర కార్యక్రమము అవసరం. ఈ కార్యక్రమ రూపకల్పనలో దాని ఫలితాలను అనుభవించేవారి అభిప్రాయాలు, అభిరుచులను కూడా పరిగణనలోకి తీసుకోవాల్సి ఉంటుంది. అందుకు పరిశోధనలు జరపాలి. ఎవరికోసము పథకాన్ని రూపొందిస్తున్నామో అట్టివారి అవసరాలను, అభిప్రాయాలను, అట్టి పథకముపై వారి వైఖరులను తెలుసుకోకుండా పథకాన్ని రూపొందించి అమలుపరిస్తే లక్ష్యాన్ని సాధించడం కష్టతరమవుతుంది.[7]

ఈ పరిశోధనాత్మక అధ్యయనంలో వయోజన విద్యపట్ల హరిజనుల దృక్పథమును తెలుసుకొనే ప్రయత్నం జరిగినది. నిరక్షరాస్యులైన హరిజన వయోజనుల అభిప్రాయాలు, అభిరుచులు, విద్యపట్ల వారి వైఖరి, మున్నగు విషయాలను గూర్చి నిశిత పరిశీలన చేయబడినది. ఈ పరిశోధనలో హరిజనుల ఆర్థిక పరిస్థితులకు, సాంఘిక వెనుకబాటుతనానికి గల కారణాల గూర్చి కూడా పరిశీలించనైనది ఇందుకు ఆంధ్రప్రదేశ్ నందలి వరంగల్లు జిల్లాలోని ఒక చిన్న హరిజనగ్రామాన్ని పరిశోధన నిమిత్తం ఎంపిక చేసుకోవడం జరిగింది. ఈ గ్రామంలోని వయోజనులలో 100 మంది అభిప్రాయాలను సేకరించబడినవి. విషయసేకరణ నిర్దిష్టముగాను, స్పష్టముగాను, సులభతరంగాను జరుగుటకు నిర్ణీత ప్రశ్నపత్రమును ఉపయోగించడం జరిగింది.

## II

ఎంపిక చేయబడిన గ్రామం వరంగల్లు పట్టణానికి 5 కిలోమీటర్ల దూరములో ఉంటుంది. ఇది ఒక హామ్లెట్. ఇందులోని వారంతా హరిజనులు కావడం ఒక విశేషం. స్త్రీ, పురుషులు, పిల్లలు, వృద్ధులు మొత్తం కలిపినా 200 జనాభాకంటె మించదు. ఎంచుకోబడిన వయోజనులలో 72 మంది స్త్రీలు, 28 మంది పురుషులు.

వయోజనుల వృత్తివివరాల పరిశీలననుబట్టి చూస్తే, వారంతా అల్పాదాయను లభించే వృత్తులను చేపట్టినట్లు విదితమగుచున్నది. ఇందులో అధిక సంఖ్యాకులు వ్యవసాయేతర వృత్తులను చేపట్టినారు. వీరి సంఖ్య 38. ఇందు స్త్రీలు 33 మంది కాగా 5గురు పురుషులు. వ్యవసాయం చేసుకొనుటకు భూమిలేకపోవడం, వ్యవసాయ కూలీరేట్లు తక్కువగా ఉండడంవంటి కారణాలవలన వీరిలో అధికమంది వ్యవసాయేతర వృత్తులను చేపట్టడం జరిగింది. ఈ వృత్తులలో హోటల్లో నీళ్లుపోయుట, పాత్రలు శుభ్రపరచుట, సినిమా హాల్లు ఊడ్చుట, రైల్వే స్టేషన్లోను, వ్యవసాయ మార్కెట్టులోను బరువులు మోయుట ముఖ్యమైనవి. రిక్షాత్రొక్కే వారిది రెండవస్థానము. వీరు 11 మంది. వీరంతా పురుషులే. పట్టణంలో డజనుదాకా సినిమా థియేటర్లు ఉండి మంచి గిరాకీ ఉండడం మూలంగాను, ఇతర పనులకంటే రిక్షా త్రొక్కడంద్వారా అధిక ఆదాయం సంపాదించడానికి అవకాశం ఉన్నకారణంగాను వారీ వృత్తిని ఎన్నుకున్నట్లు పేర్కొన్నారు. 9 మంది వ్యవసాయ కూలీలు మూడవ స్థానం ఆక్రమించారు. వీరిలో స్త్రీలు 8 మందికాగా పురుషులు ఒక్కరే. నాటు వేయుట, కలుపు తీయుటవంటి పనులు ముఖ్యమైనవి. నాల్గవ స్థానమును నెలసరి ఒప్పందంమీద పనిచేసే జీతానికి ఉన్నవాళ్ళది. వీరిలో నల్గురు స్త్రీలు కాగా ఇద్దరు పురుషులు. వీరి అభిప్రాయంలో అన్ని వృత్తులకంటె ఇది లాభదాయకమైనది. వారి మాటల్లోనే చెప్పాలంటే, "అన్నం మిగిలినా మాకేనాయె, కూర మిగిలినా మాకేనాయె. పండగలకు పబ్బాలకు ఏదైనా చేసుకొంటె మాకూ కొంత దొరుకుతుంది. ఇంకా పాతబట్టలు అవీ ఇవీ దొరుకుతాయి." ప్రభుత్వ ఉద్యోగులు నల్గురే అయినను వారిది 5వ స్థానము ఆక్రమించినది. అయితే ఈ ఉద్యోగుల్లో ముగ్గురు అటెండర్లు, ఒక్కరు వాచ్‌మెన్. ఇక ఇతర వృత్తులలో బటానీ, వేరుశనగ, పండ్లను చిల్లర అమ్మేవాళ్లు, కట్టెలు కొట్టేవాళ్లు కలిపి 29 మంది వున్నారు. పశువుల కాచేవారు ముగ్గురు. వీరంతా పురుషులే.

వయోజనుల వయోపరిమితిని పరిశీలించగా 15 మంచి 35 సం॥ల మధ్యవయసు గలవారే ఎక్కువగా ఉన్నారు. వీరిలో 54 మంది స్త్రీలుకాగ 18 మంది పురుషులు. 36 మంచి 50 సం॥ల మధ్య వయసువారు 26 మంది. ఇందులో 16 మంది స్త్రీలు, 10 మంది పురుషులు. 51 సం॥ దాటిన వారిద్దరే. వారిద్దరూ స్త్రీలే.

వారి ఆదాయ వివరాలనుబట్టి 500 రూ॥ల నుంచి 1000 రూ॥ల వరకు సాంవత్సరిక ఆదాయం పొందేవారి సంఖ్యే (46) ఎక్కువ కావడం గమనార్హం. 500 కంటె తక్కువ ఆదాయం గలవారు 14 మంది. 1001 నుంచి 2000 దాకా ఆదాయం పొందేవారు 22 మంది కాగా 2001 నుంచి 3000 వరకు సంపాదించేవారి సంఖ్య 1. 3001 అంతకంటె ఎక్కువ గడించేవారు 9 మంది. తమ ఆదాయాన్ని ఊహించిగాని, నిర్దిష్టంగా గాని వివరించనివారు ఎనమండుగురు. దీనినిబట్టి వారి సంపాదన ఎప్పుడు ఎంత ఉంటుందో ఊహించలేనిదని స్పష్టమగుచున్నది. ఇందులకు ప్రధాన కారణం దినకూలీ పనులు, రిక్షాలాగడం వంటి పనులు రోజునుబట్టిగాక వారి పని లభించే దానినిబట్టి, గిరాకీ దొరికే దానిని బట్టి ఉంటుందని చెప్పవచ్చు.

వయోజనుల పిల్లల విద్యా వివరాలను తెలుసుకొనగా అందరిని చదివించే వారికన్న కొందరిని చదివించేవారి సంఖ్యే ఎక్కువ. అందరిని చదివించేవారు 22 మంది కాగా కొందరిని చదివించేవారు 26మంది. ఎవరినీ చదివించని వారి సంఖ్య (33) పై ఇద్దరి సంఖ్యలకంటే అధికంగానే ఉంటుంది. 19కి వివాహము కాకపోవడమో లేక పిల్లలు లేక పోవడమో—గాని ఎవ్వరూ చదవడంలేదు. ఎవ్వరినీ చదివించకపోవడానికి కారణాలను తెలుపమనగా వారు మొదటి స్థానాన్ని పేదరికానికి, రెండవ స్థానాన్ని తల్లిదండ్రుల అశ్రద్ధకి, మూడవ స్థానాన్ని ఇతర కారణాలకి ఇచ్చారు. పిల్లలెవ్వరినీ చదివించలేని 33 మందిలో పేదరికాన్ని 18 మంది, అశ్రద్ధను 5 గురు, ఇతర కారణాలను 10మంది ముఖ్య కారణాలుగా పేర్కొన్నారు. దీనినిబట్టి ఆర్థిక స్తోమత లేకపోవడం విద్యగరపడానికి అవరోధంగా ఉన్నట్లు స్పష్టమగుచున్నది. విద్యావిషయంగా ప్రభుత్వ సహాయం అందడం లేదాయన్న ప్రశ్నకు 'ఏ సహాయం?' అని ఎదురు ప్రశ్నవేశారు. దీనిని గూర్చి వివరణాత్మకంగా పరిశీలన జరపగా ప్రాథమిక విద్యాస్థాయిలో ప్రభుత్వంనుంచి ఎటువంటి ఆర్థిక సహాయం వీరికి అందడంలేదు. తల్లిదండ్రుల నిరక్షరాస్యత, భవిష్యత్తుగూర్చి ఆలోచన లేకపోవడం వలన పిల్లల చదువు విషయంలో శ్రద్ధాసక్తులు లోపించడం మరో కారణంగా చెప్పవచ్చు. అందుబాటులో బడిలేకపోవుట, బడికి పంపినా పిల్లలు శ్రద్ధ చూపకపోవడం వంటివి ఇతర కారణములుగా పేర్కొన్నారు. అలాగే కొందరినే చదివించే వారిని కూడా తమ పిల్లలను అందరిని చదివించక కొందరినే చదివించడానికి గల కారణాలను తెలుసుకోగా వారు కూడా పేదరికం, అశ్రద్ధలకే అధిక ప్రాముఖ్యతనిచ్చారు. అందరిని చదివించే వారి ఆదాయమునకు కొందరినే చదివించేవారి ఆదాయమునకు తులనాత్మక పరిశీలన జరపగా అందరిని చదివించేవారి ఆదాయం కాస్త మెరుగ్గా ఉంది. అంటే ఇక్కడ ఒక విషయాన్ని గుర్తుంచుకోవాలి. చదివించాలన్న ఆకాంక్ష ఉన్నప్పటికి వారి పేదరికం వారి పిల్లలు విద్య గరపడానికి అడ్డంకిగా ఉందన్నది యథార్థం. విద్యారంగంలోను, ఉద్యోగ రంగంలోను భారత రాజ్యాంగం కల్పించిన రిజర్వేషన్లు గాని, ఇతర సదుపాయాలు గాని ఈ వర్గపు వారి ఏ విషయంగాను ప్రభావం చూపలేదని గతంలో జరిపిన పరిశోధన ఫలితాలు[8] వెల్లడిస్తున్నాయి.

వయోజనులలో 19 మంది (వీరిలో పిల్లలు లేనివారు 9 మందికాగా పెళ్లి కానివారు 10) తమ పిల్లలను చదివించడానికి ఇష్టపడుతున్నారు. అయితే వారు ఈ అభిప్రాయాన్ని వ్యక్తపరచడంలో విద్య పట్ల సంపూర్ణ విశ్వాసాన్ని కల్గినట్లు కనిపించలేదు. ప్రస్తుతం వారి ఆదాయం వారి కనీసావసరాలకే సరిపోవడం లేదన్నది నగ్నసత్యం.

పై వివరాలనుబట్టి చూస్తుంటే విద్యగరపడానికి ఆర్థిక విషయాలకు సన్నిహిత బంధం ఉందని విదితమగుచున్నది. కొందరిని చదివించి మరికొందరిని చదివించక పోవడానికి వారి నిరుపేదరికమని చెప్పవచ్చు. చదవ నోచనివారి పిల్లలు వారి తలిదండ్రులకు అనేక విధాల తోడ్పడుతుంటారు. ఇంటి పనుల్లో తల్లిదండ్రులకు సహాయపడటం, వారు పనులకు వెళ్ళినపుడు వంటచేయడం, పని స్థలాలకు భోజనం పట్టుకెళ్లడం, ఇంట్లో చిన్న పిల్లల ఆలనా పాలన, ఇంటికి కాపలా మున్నగు పనులెన్నో చేయడం జరుగుచున్నది.[9] ఇన్నివిధాల సహకరించే పిల్లలను చదువుపేరిట దూరం చేసుకోవడం తల్లిదండ్రులకు ఇష్టంలేదు. పైగా కాస్త ఎదిగిన పిల్లలు[10] వారి సంపాదనకు ఒక సాధనంగా భావిస్తారు. వారి ఆర్థిక, సాంఘిక వెనుకబాటుతనాన్ని బట్టి నిశిత పరిశీలనచేస్తే ఈ విధమైన భావన సరియైనదే నని పిస్తుంది.

పిల్లలను చదివించడానికిగల కారణాలను వివరించమనగా (అందరిని చదివించేవారితోపాటు కొందరిని చదివించేవారి అభిప్రాయాలు కూడా తీసుకోబడినవి) ఉద్యోగం కోసమని 36 మంది, తెలివి[11] కోసం 8 మంది కారణాలుగా పేర్కొనగా మరో నల్గురు సంఘంలో గుర్తింపుకోసమనడం విశేషం. ఉద్యోగంకోసం చదివిస్తున్నామని చెప్పినవారి దృష్టిలో "విద్య" జీవనోపాధికి తోడ్పడుతుంది. అయితే వారి దృష్టిలో "ఉద్యోగం" అంటె వాచ్‌మెన్‌లు, అటెండర్లు. కొందరు 'సంఘంలో గుర్తింపు'కోసం చదివిస్తున్నామనడం అన్నింటికంటే ముఖ్యవిశేషం. వీరి దృష్టిలో చదువుకున్న వారికేగాక చదివించే వారికికూడ సంఘంలో గౌరవ మర్యాదలు ఉంటాయి. వీరిలో సమాజం'లో' బ్రతకడంకన్న సమాజం'తో' బ్రతకడం గొప్ప. ఈ భావన వారిలో ఉత్పన్నం కావడం హర్షించదగినది.

వయోజను లెప్పుడైనా తమ బాల్యదశలో చదవడానికి ప్రయత్నాలు చేశారా అన్న ప్రశ్నకి 52 మంది ఎలాంటి ప్రయత్నాలు చేయలేదని, 48మంది ప్రయత్నించామని చెప్పారు. ఎందుకు ప్రయత్నం చేయలేదన్న మరో ప్రశ్నకి మొదటివారు-ఇదివరకు వారి పిల్లలను చదివించక పోవడానికి ఏ కారణాలను పేర్కొన్నారో వాటినే మరల పేర్కొవడం జరిగింది. దీనినిబట్టి గత 30 సంవత్సరాలనుంచి వారి ఆర్థిక స్థితిగతులు ఎలా ఉన్నాయో ఇప్పుడూ అలానే ఉన్నాయన్నది సుస్పష్టం. చదవడానికి ప్రయత్నించిన వారిలో కొద్దిమంది మాత్రమే సఫలీకృతులైనారు. వీరిలో 1వ తరగతి చదివినవారు 5గురు, 2వ తరగతి ఇద్దరు, 3వ తరగతి ఒక్కరు, నాల్గవ తరగతి ఇద్దరు చదివారు. మిగిలిన 38 మంది కేవలం పాఠశాల ప్రవేశం వరకే. ఇచ్చట ఒక విషయాన్ని గుర్తుంచుకొనవలసి ఉంది. అదేమిటంటే 1 నుంచి 4వ తరగతి వరకు చదివిన వారిని ఇపుడు అక్షరాస్యుల జాబితాలోగా

నిరక్షరాస్యుల జాబితాలో చేర్చడం. ఎందుకనగా వారు నేర్చినదంతా మర్చిపోయారు. ఆ మధ్యకాలంలో జరిపిన ఒక పరిశోధన [12] కూడా నేర్చినదంతా మర్చిపోవడం జరిగినట్లు వెల్లడిస్తున్నది. చదువును కొనసాగించకుండా మధ్యలోనే మానివేయడానికి గల కారణాలను పరిశీలించగా బడి చక్కగా నడవక పోవడం (ఉపాధ్యాయుడు తరచుగా రాలేక పోవడం), వ్యవసాయ పనులు చురుగ్గా సాగే రోజులలో తల్లిదండ్రులకు తోడ్పడటంవల్ల - ఆ తర్వాత చదవాలన్న ఆసక్తి గాని, తల్లిదండ్రుల శ్రద్ధ గాని, ఉపాధ్యాయుని పట్టింపుగాని లేకపోవడంవంటి కారణాలను పేర్కొన్నారు. దీనికితోడు గ్రామీణ ప్రాంతాలలోని సంపన్నుల, అగ్రవర్ణాలవారికి హరిజనులు విద్యగరపడానికి అడ్డుపడడం (ప్రత్యక్షంగాను, పరోక్షంగాను) తర్వాతి తరగతులు బడిలో లేకపోవడం మరింత దోహదపడ్డవి. ఇదే విషయాన్ని ఒక ప్రత్యక్ష పరిశీలనా నివేదిక[13] స్పష్టం చేస్తున్నది.

'వయోజన విద్య' గూర్చి ఎపుడైనా విన్నారా అన్నప్పుడు 'అదేమిటి చదువంటే సరిపోదా' అని కొందరు తిరిగి ప్రశ్నించడాన్నిబట్టి వారికి సాధారణ (సాంప్రదాయిక) విద్యకు, వయోజన (సాంప్రదాయేతర) విద్యకు మధ్య భిన్నత్వం ఉందన్న విషయం తెలియదని స్పష్టమగుచున్నది. ఇపుడు విద్య నేర్చుకొంటారా అన్న ప్రశ్నకు 62 మంది అనుకూల వైఖరి ప్రదర్శించగా, 38 మంది విముఖతను వ్యక్తపరిచారు. విద్య గరపడానికి విముఖత చూపిన వారిని అందుకు కారణాలను వివరించమనగా వారు ఇంటి విషయాలు, బాధలు, బాధ్యతలు, ఈ వయసులో చదువేం? 'రెక్కాడితే డొక్కాడే' బ్రతుకులు వంటివి పేర్కొన్నారు. మరికొందరు తీరికలేని బ్రతుకులకు చదువేల అబ్బుతుందని అనుమానం వ్యక్తపరిచారు.

విద్యపట్ల సుముఖత చూపిన వారిని ఏయే విషయాలను నేర్చుకోవాలని ఉందో సూచించమనగా విభిన్న విషయాలను పేర్కొన్నారు. చదవడం, వ్రాయడం 25గురు, లెక్కలు చేయడం పది మంది, ఉత్తరాలు వ్రాయడం 12 మంది, కుట్టుమిషను కుట్టుట 7గురు నేర్చుకొనుటలో ఆసక్తి చూపారు. ఆడవారికి సంబంధించిన పనులేవైనా నేర్చుకోవాలని 5 గురు ఆడవారు, మగవారికి సంబంధించిన పనులేమైనా నేర్చుకోవాలని ముగ్గురు పురుషులు తమ ఇష్టతను ప్రదర్శించారు.

పై వివరాలనుబట్టి కొన్ని ఆసక్తికరమైన విషయాలు వెల్లడగుచున్నవి. ఉత్తరాలు వ్రాయడం వరకు చదవడం వీరి దృష్టిలో గొప్ప చదువు. సాధారణ విద్యకాక వృత్తి సంబంధ విద్య నేర్చుకోవాలనుకోవడం విశేషం. స్త్రీ, పురుష సంబంధ పనులందు ఆసక్తి చూపినవారు ఆ పనులను వివరించలేకపోయారు. అన్నింటికన్న ముఖ్య విశేషమేమంటే 'విద్య'ను చదవడం, రాయడంవంటి అక్షరాభ్యాసానికే పరిమితంగా భావించడం. అక్షరాభ్యాసానికే వయోజనవిద్య పరిమితం కాదు. మహాత్మాగాంధీగారి అభిప్రాయంలో కూడా వయోజనవిద్య కేవలం అక్షరాస్యులను చేయడం కాదు. గాంధీగారు తన 'హరిజన్' (1940) పత్రికలో ఈ విషయాన్నే ప్రస్తావిస్తూ 'గ్రామీణ ప్రజలకు గ్రామీణ ప్రాంతపు వ్యవహారాల గూర్చి, లెక్కలు, గ్రామీణ భౌగోళిక పరిస్థితులు, చరిత్ర వివరిస్తే చాలన్నాడు.[14] వారికి నేర్పే విద్య అనాదినుంచి వారిలో పాతుకుపోయిన మూఢవిశ్వాసాలు, అపరిశుభ్రత, అనారోగ్యం అమాయకత్వం తొలగించేదిగాను, పౌష్టికాహారమును గూర్చి, నీటి పరిశుభ్రమును గూర్చి వివరించేదిగాను ఉండాలని గాంధీ భావించారు.[15] వయోజనులకు నేర్పే విద్య వారిని, వారి పిల్లలను తీర్చి దిద్దుకోవడానికి సాధనంగా ఉండాలని గాంధీగారి అభిప్రాయం.

వయోజన విద్యాకేంద్రము ఏ కాలములో తెరిస్తే అనుకూలంగా ఉంటుందో చెప్పమనగా భిన్నాభిప్రాయాలను వ్యక్తపరిచారు. (విద్య గరపడానికి అనుకూలత చూపినవారే గాక విముఖత ప్రదర్శించినవారి అభిప్రాయాలనుకూడా తీసుకోబడినవి.) వేసవి కాలమునకు 20మంది, శీతాకాలమునకు 9 మంది, వర్షాకాలమునకు 5 మంది అనుకూలత చూపించారు. ఏ కాలమైన ఫరవాలేదని 66మంది అనుకూలంగా పేర్కొన్నారు. చదవాలన్న ఆసక్తికి ఇదొక నిదర్శనం. అలాగే విద్యాకేంద్రాన్ని ఏ సమయంలో తెరిస్తే బాగుంటుందన్న మరో ప్రశ్నకు 5గురు ఉదయాన్ని, 14మంది మధ్యాహ్నాన్ని, 63 సాయంత్రాన్ని సూచించగా 18 మంది ఏ సమయమైన ఫర్వాలేదన్నారు. అత్యధికులు 'సాయంత్రము'ను ఎన్నుకోవడానికి ప్రధాన కారణం—కూలీ పనులు చేసి ఇళ్ళకు సాయంత్రం చేరుకొంటారు కనుక.

విద్యగరపడంలో ఏవైనా వసతులు కావాలా అని అడిగినపుడు కొన్ని వసతులను కోరినారు. ఇవి యన్నీ విద్యాసంబంధమైనవికావడం విశేషం. వారు కోరిన వసతులలో పుస్తకాలు, పలకలు, బలపాలు, పెన్నులు లేదా పెన్సిల్లు, వ్రాత పుస్తకాలు ప్రధానమైనవి. మరి కొందరు ఆర్థిక సహాయం కోరినారు. తినడానికి తిండేలేని వీరికి చదువుమీద కొంత ఖర్చుచేయడం తలకుమించిన భారం అనుటలో అతిశయోక్తిలేదు.

విద్యద్వారా సాంఘిక సమానత్వమును సాధింపవచ్చునా యన్న దానికి అత్యధికశాతం మంది (80) సాధించవచ్చునన్నారు. కొందరు (20) మాత్రం అది సాధ్యం కాదన్నారు. విద్యవల్ల సంక్రమించే ప్రయోజనాలను పేర్కొనమనగా 48 మంది ఉద్యోగం, 32 మంది తెలివి, 19 మంది సంఘంలో గుర్తింపు, ఒక్కరు మాత్రం సామాజిక సేవచేయడంవంటి ప్రయోజనాలున్నట్లు చెప్పారు. సామాజిక చైతన్యమునకు విద్య తోడ్పడుతుందన్న భావన ఈ వర్గమువారిలో ఉత్పన్నమైందన్న దానికి ఇదొక ఉదాహరణ. చదివితే ఉద్యోగం లభిస్తుందన్న దానినిబట్టి 'విద్య' జీవనోపాధికి తోడ్పడుతుందని భావించబడుతున్నది.

# III

## ఉపసంహారం

ఈ పరిశోధనాత్మక అధ్యయనంలో ఎంపిక చేసిన వయోజనులలో యువకులే ఎక్కువ శాతము. వీరందరూ అల్పాదాయమును పొందే కూలీలు. బాల్యంలో 1నుంచి 4వ తరగతి వరకు చదివినవారు

కూడా చదివినదంతా మర్చిపోయారు. కనుక ఈ గ్రామంలో ప్రత్యేకంగా వయోజన విద్యాకేంద్రమును స్థాపించవలసిన అవసరం ఎంతేని కలదు.

వ్యవసాయ వృత్తి పనులకన్న వ్యవసాయేతర పనులు చేపట్టిన వారే అధికంగా ఉండడం గమనించదగినది. స్వంత భూములు లేకపోవడము, వ్యవసాయ కూలీరేట్లు గిట్టుబాటుగా లేకపోవడం ఇందుకు ప్రధాన కారణాలని స్పష్టమగుచున్నది. ప్రభుత్వ ఉద్యోగంలో ఉన్న వారు 4వ తరగతికి చెందిన అటెండర్లు, వాచ్‌మెన్‌లు. విద్యా, ఉద్యోగ రంగాలలో భారత రాజ్యాంగం కల్పించిన రిజర్వేషన్లుగాని, ఇతర సదుపాయాలుగాని ఏవిధంగాను ప్రయోజనం చేకూర్చలేదని అనేక పరిశోధనలవల్ల వెల్లడియగుచున్నది.[16] ఒకవేళ ఏకొద్ది ప్రయోజనం చేకూరినను "...కేవలం అక్షరాస్య, నగరప్రాంత, బలహీన వర్గాల ప్రజలకే అందుబాటులో ఉన్నాయేతప్ప, లక్షలాదిమంది నిరక్షరాస్య గ్రామీణ బలహీన వర్గాలపై కాని వారి సంతతిపై కానీ, ఈ రిజర్వేషన్ల విధానంయొక్క ప్రభావం కన్పించదు—ప్రయోజనాలు అందుతున్నట్లు కన్పించవు."[17] ఒక స్త్రీ సంక్షేమ సేవాసదనంలో 100 మంది స్త్రీలకు ప్రవేశావకాశముండగా 43 మంది స్త్రీలే చేరినారు.[18] మరో వృత్తి శిక్షణా సంస్థలో 30 మందికి ప్రవేశావకాశముండగా 23 మంది మాత్రమే చేరినారు.[19] ఈ సంస్థల గూర్చి తగు ప్రచారం జరగకపోవడంవల్ల మరికొందరికి చేరే అవకాశం లేకుండాపోయింది. కనుక బలహీనవర్గాల, స్త్రీల, హరిజనులకు సంబంధించిన సంస్థలగూర్చి, ప్రభుత్వం కల్పించిన సదుపాయముల గూర్చి తగు ప్రచారం జరపాలి. వయోజన విద్యద్వారా వృత్తివిద్యలను నేర్పడంతోపాటు స్వయం ఉపాధి పథకముద్వారా వారికి ఆర్థిక సంస్థల ద్వారాను, వాణిజ్య బ్యాంకులద్వారాను తగు ఆర్థిక సహాయమును అందించాలి.

వయోజనుల సాంవత్సరిక ఆదాయము వేయిరూపాయలైనా లేనివారి శాతమే ఎక్కువ. ఈ విధమైన ఆర్థిక దుస్థితియే వయోజనులు విద్య గరపకపోవడానికి, వారి పిల్లలను చదివించకపోవడానికి అడ్డంకిగా ఉంది. చదివిస్తున్న కొద్దిమంది ఏదో ఒక ఉద్యోగం లభిస్తుందన్న ఆశతో ఉన్నారు. అలాంటి వారికి తగురీతి ప్రభుత్వం సహకరించాలి. అంటే రిజర్వేషన్లను కట్టుదిట్టంగా అమలు పరచవలె.

కొద్దిమంది తల్లిదండ్రులు తమ పిల్లలను ప్రాథమిక విద్య పూర్తికాక మునుపే మానిపిస్తున్నారు. ప్రాథమిక విద్యాస్థాయిలో ఇలా మానిపించడం వలన వారు తర్వాతి కాలంలో నిరక్షరాస్యుల జాబితాలో చేరే ప్రమాదముంది. ఈ విధంగా ప్రాథమికవిద్య పూర్తికాకుండానే మధ్యలోనే మానివేసే వారి సంఖ్య గ్రామీణ ప్రాంతాలలో అత్యధికస్థాయిలో ఉందని ఆమధ్య జరిపిన సర్వేల[20] వలన స్పష్టమగుచున్నది. ఈ విషయంగా ప్రభుత్వం ఒక సమగ్ర 'సర్వే'ద్వారా తత్కారణాలను, వాటి మూలాంశాలను తెలుసుకొని తగు పరిష్కార మార్గాలద్వారా హరిజనులను విద్యావంతులను చేయవలె.

వయోజనవిద్య కేవలం అక్షరాస్యులను చేయడానికే పరిమితం కాకూడదు. వృత్తి విద్యలను నేర్పడంద్వారా వారి జీవనోపాధికి తోడ్పడేదిగా 'వయోజనవిద్య' 'ప్రయోజనవిద్య'గా రూపొందాలి. పిల్లలు విద్యగరపడంలోను, ఉన్నత విద్యలను పొందడంలోను కులము, మతము, విద్య, ఆర్థిక పరిస్థితులు తోడ్పడతాయి. తమ బాల్యదశలో విద్య గరపడానికి ప్రయత్నించినవారిలో అత్యధికులు కృతకృత్యులు కాకపోవడానికి వారి పేదరికమే ప్రధాన కారణమన్నది గమనించదగ్గ విషయం. ఆ పేదరికమే ఈనాడు వారి పిల్లలు విద్యావంతులు కావడంలో ముఖ్య అవరోధంగా పరిణమించిందని ఈ పరిశోధనవల్ల స్పష్టమగుచున్నది. అంతియేగాదు విద్యాసంస్థలన్నీ పట్టణ ప్రాంతాలలోనే కేంద్రీకృతం కావడం మరో ముఖ్య అవరోధం. కనుక ప్రతి కుగ్రామానికొక ప్రాథమిక పాఠశాల ఏర్పాటు జరిగేట్లు చూడవలె. వ్యవసాయ పనులు చురుగ్గా సాగే రోజుల్లో గ్రామీణ పాఠశాలలకు సెలవులు ఇవ్వడం, మొదటి తరగతినుంచే ప్రభుత్వ సహాయం అందేలా చూడ్డం, చదువుపట్ల పిల్లలకు, వారి తలిదండ్రులకు ఆసక్తి, విశ్వాసము కల్గించడంవంటి చర్యలు తీసుకొన్నచో చదువును మధ్యలోనే మానివేసేవారి సంఖ్యను తగ్గించవచ్చు. వ్యవసాయపు పనులు చురుగ్గాసాగే రోజుల్లో సెలవులు ఇవ్వడం వలన పెద్దవారికి ఆర్థికంగా కొంత లాభమును పిల్లలు అందించగల్గుతారు.

పాఠ్యాంశాల ఎంపికలో కడు జాగ్రత్త అవసరం. వయోజనుల అభిరుచులకు పాఠ్యాంశములు అనుగుణంగాను, ఉపయుక్తంగాను ఉండాలి. అనగా వ్యవసాయ పనులుచేసే వయోజనులకు నాటు వేసే పద్ధతి, వ్యవసాయసాగు, పరిశుభ్రత, విత్తనాలుచల్లే పద్ధతులు బోధించాలి.[21] అలాగే వయోజన విద్యాకేంద్రాలను ఏర్పాటు చేసే టప్పుడు కూడా విద్య గరపాలనుకునే వారికి అనుకూలంగా ఉండేలా చూడాలి. మరియు అవి ఏ కాలములో, ఏ సమయంలో తెరిస్తే బాగుంటుందో వారిని సంప్రదించినమీదట ప్రారంభించాలి. విద్య గిరపాలను కునే వారికి పలకలు, పుస్తకాలు, పెన్నులు ఉచితంగా సరఫరా చేయడంతోపాటు వారి దృష్టిని విద్యవైపు మళ్ళించుటకు ఉపకార వేతనాల పేరగాని, విద్యను గరపడంలో చురుకుదనం చూపించేవారికి బహుమతుల పేరగాని కొంత ఆర్థిక సహాయం అందించవలె.

గ్రామీణ ప్రాంతపు అగ్రవర్ణాలవారు, సంపన్నులు, హరిజనులు విద్యగరపడానికి అడ్డంకిగా ఉన్నారని పరిశోధనలు వెల్లడిస్తున్నాయి. గ్రామీణులు విద్యావంతులైతే తమ అధికారమును ప్రశ్నించగలరని వారి భయం.[22] ఈ విషయంలో ప్రభుత్వం తగు ఏర్పాట్లు చేయవలసిన అవసరమెంతో కలదు.

వయోజన విద్యా కార్యక్రమముతోపాటు ప్రాథమిక విద్యకు కూడా తగు ప్రాధాన్యతను ఇవ్వాలి. లేనిచో రాబోవు తరం నిరక్షరాస్యులయ్యే ప్రమాదము ఉంది. గ్రామీణ నిరక్షరాస్యులైన హరిజనులీనాడు 'విద్య' సామాజిక, ఆర్థిక సమానత్వమునకు తోడ్పడుతుందనడం విశేషం. మహాత్మాగాంధీగారి నూటపదవ జయంతినాడు ప్రారంభించిన ఈ బృహత్తర వయోజన విద్యా కార్యక్రమము సత్ఫలితాల నిస్తుందని ఆశిద్దాం.

# అ ధో జ్ఞా పి క లు

1 మోతీలాల్‌శర్మ: "నాన్ ఫార్మల్ ఎడ్యుకేషన్ : సమ్ కన్సి డరేషన్స్", డెవలప్‌మెంట్ పాలిసీ ఎండ్ ఎడ్మినిస్ట్రేషన్ రివ్యూ, వాల్. III, నెం. 2, జూలై–డిసెంబర్ 1977, పు–1.

2 [పునర్ గ్రహీతం] సి. శ్రీనివాసులు, "భూమి యాజ మాన్యంలో అసమానతలు : విద్యాస్థాయిపై దాని ప్రభావం." (ఒక పరిశోధనాత్మక అధ్యయనం) తెలుగు (త్రైమాసికం) ఏప్రిల్–సెప్టెంబర్ 1980, పు–224.

3 మోతీలాల్ శర్మ: అదే పు- 1, 2.

4 సి. శ్రీనివాసులు : అదే పు–225.

5 డా. బైజనాథ్‌సింగ్ : "పీపుల్స్ పార్టిసిపేషన్ ఇన్ నేష నల్ ఎడల్ట్ ఎడ్యుకేషన్ ప్రోగ్రామ్", ఇండియన్ జర్నల్ ఆఫ్ ఎడల్ట్ ఎడ్యుకేషన్, వాల్. 39, నెం. 10, అక్టోబర్ 1978, పు–3.

6 ఎన్. సంజీవరెడ్డి : "మెసేజ్ ఆఫ్ ది ప్రెసిడెంట్ ఆఫ్ ఇండియా ఆన్ ది లాంచింగ్ ఆఫ్ ఎన్. ఎ. ఇ. పి", ఇండియన్ జర్నల్ ఆఫ్ ఎడల్ట్ ఎడ్యుకేషన్, వాల్. 39, నెం. 10, అక్టోబర్ 1978, పు–8.

7 డా. జి. హరగోపాల్ ఎండ్ జి. సుదర్శన్: "రూరల్ ఎడల్ట్ లిటరెసీ: ఏన్ ఎన్‌క్వయిరీ ఇంటూ ది యాటిట్యూడ్స్", ఇండి యన్ జర్నల్ ఆఫ్ ఎడల్ట్ ఎడ్యుకేషన్, వాల్. 39, నెం. 10, అక్టోబర్ 1978, పు–34.

8 ఎ) కె. జనార్ధన్ : "కళాశాల అధ్యాపకుల సాంఘిక–ఆర్థిక పూర్వరంగము: ఒక పరిశీలన" భారతి, (మాసపత్రిక), ఏప్రిల్ 1980.

బి) డా. జి. హరగోపాల్ ఎండ్ జి. సుదర్శన్ : "రూరల్ ఎడల్ట్ లిటరెసీ : ఏన్ ఎంక్వయిరీ ఇంటూ ది ఏటి ట్యూడ్స్", ఇండియన్ జర్నల్ ఆఫ్ ఎడల్ట్ ఎడ్యు కేషన్, వాల్. 39, నెం. 10, అక్టోబర్–1978.

సి) డా. జి. హరగోపాల్ ఎండ్ సిహెచ్. బలరాములు : "సోషల్ కాంపోసిషన్ ఆఫ్ రూరల్ డెవలప్‌మెంట్ బ్యూరోక్రసీ ఇన్ ఎ డిస్ట్రిక్ట్ ఆఫ్ ఆంధ్ర:ఎ నోట్", ప్రశాసనిక, వాల్. III, నెం 2&3, ఏప్రిల్–సెప్టెం బర్ 1979.

9 ఇది పరిశోధకుల ప్రత్యక్ష పరిశీలనానుభవం.

10 ఎదిగిన పిల్లలు–అంటే వీరి దృష్టిలో 7 లేదా 8 సంవత్స రములు దాటిన పిల్లలు.

11 'తెలివి' అంటే వ్రాయడం, చదవడం, లెక్కలు చేయడం మాత్రమేనని గ్రహించాలి. (అభిప్రాయకుల ఆలోచనప్రకారం)

12 డా. జి. హరగోపాల్ ఎండ్ జి. సుదర్శన్ : అదే.

13 ఈ ప్రత్యక్ష పరిశీలన ఎమ్. కిష్టయ్యగారి పర్యవేక్షణలో ఒక అధ్యయనబృందం (సీతారామారావు మరియు జి. సుదర్శన్) జరిపింది. ఈ పరిశోధనా నివేదికను "పంచాయతీరాజ్ సంస్థల రాష్ట్రస్థాయి కమిటీ"కి సమర్పించబడినది.

"డ్రాప్–అవుట్స్ ఇన్ ప్రయిమరీ ఎడ్యుకేషన్ ఇన్ రూరల్ ఏరియా" (అన్‌పబ్లిష్డ్) రిపోర్ట్, 1980.

14 రికోటెడ్ ఫ్రమ్ డా. (మిసెస్) జె. కె. పిళ్లయి : "గాంధి ఆన్ ఎడల్ట్ ఎడ్యుకేషన్", ఇండియన్ జర్నల్ ఆఫ్ ఎడల్ట్ ఎడ్యుకేషన్, వాల్. 39, నెం. 10, అక్టోబర్ 1978, పు–20.

15 అదే పు–20.

16 ఎ) కె. జనార్ధన్ : అదే.

బి) డా. జి. హరగోపాల్ ఎండ్ సిహెచ్. బలరాములు : అదే.

సి) జి. వెంకటరెడ్డి : "సోషల్ కాంపోసిషన్ ఆఫ్ డిస్ట్రిక్ట్ బ్యూరోక్రసీ : ఏన్ ఎంపెరికల్ స్టడీ" ది ఎడ్మినిస్ ట్రేషన్, XXII, ఆగస్ట్–సెప్టెంబర్ 1977.

17 డా. మురళీ మనోహర్, శ్రీ బి. జనార్దన్‌రావు: "రిజర్వేషన్లు ఒక పరిశీలన", భారతి (మాసపత్రిక), ఏప్రిల్ 1980, పు–50.

18 వి. శోభ: "స్త్రీ సంక్షేమ కార్యక్రమాలు" తెలుగు (త్రైమా సికం), జనవరి–మార్చి 1980, పు–116.

19 అదే : పు–116.

20 ఎ) ఎమ్. కిష్టయ్యగారి ప్రత్యక్ష పరిశోధనా అధ్యయనం అదే.

బి) డా. జి. హరగోపాల్‌గారి పరిశీలన ప్రకారం–ఒక గ్రామంలో మొదటి తరగతిలో చేరిన విద్యార్థుల సంఖ్యలు (అగ్ర వర్ణాలు, వెనుకబడిన వర్గాలు, షెడ్యూల్డ్ కులాలు–

జాతులు వరుసగా) 164, 100, 27 కాగా 4వ తరగతిలోకి వచ్చేసరికి (అదే వరుస సంఖ్యలో) 21, 8, 1 మంది విద్యార్థులకు తగ్గిపోయింది. చూడండి. డా. జి. హరగోపాల్: "లిటరరీ ఎండ్ ఎడ్యుకేషన్" సెమినార్, మార్చి 1979 (235)

21 శ్రీ నాగభూషణరావు: "వయోజనవిద్య—గ్రామీణాభివృద్ధి" తెలుగు (త్రైమాసికం), జనవరి — మార్చి 1980, పు—63, 64.

22 డా. హరగోపాల్, "లిటెరసీ ఎండ్ ఎడ్యుకేషన్", సెమినార్, మార్చి—1979 (235)

[ఈ పరిశోధనా వ్యాసమునకు సంబంధించిన సమాచార సేకరణలో తోడ్పడిన ఎ. ఉపేంద్రం (రంగశాయిపేట, వరంగల్) గార్కి, వారి మిత్ర బృందమునకు ఈ వ్యాసరచయితలు కృతజ్ఞతలు తెలుపుకొంటున్నారు.]

# అందుకో ఈ లేఖ

పూర్ణ

చంద్రునికోసం చకోరంలా
స్వాతి వానకోసం ముత్యపు చిప్పలా
నీకోసం ఎదురుచూచి చూచిన
నా ఎదను తీరని వ్యధకు
గురిచేసిన విన్నేమని
నిందించగలను ?
చేసిన బాసలు మరిచి
చూపిన ఆశలు తుడిచి
నన్ను వదలి పోయిన
నిన్ను మళ్లీ కనాలని
ఎన్నో కలలు కన్నాను
నా ఎదలోని వ్యధను
నీ ఎదుట పరచాలనే
నా ఈ తపన
ఈ లేఖ నందుకోగానే
పోటీలో పరుగెత్తే గుఱ్ఱంలా
పరుగులిడే ప్రవాహంలా
పొంగే సముద్రంలా
నిన్ను చేరటానికి
ఉరకలువేస్తున్న
నా హృదయంలా
వేటగాని విల్లునుచూసి
పరుగులిడే కురంగంలా
ఎడారిలో ఎండమావిని గాంచిన
బాటసారి నడకలా
శిశుపాలుని సంహరించటానికి
కదలిన నీ చక్రంలా
గజేంద్రుని కాచుటకు
పరుగిడిన రయంతో
నన్ను చేరుకోమని
నిన్ను వేడుకుంటున్నాను.
కాని
ఈ లేఖ నీకు చేర్చేదెవరు ?
ఎన్ని తపాలా బిళ్లలంటించినా
చిరునామా లేనిదే చేరదుకదా
అందుకే
విన్నేవచ్చి
ఈ లేఖ అందుకోమని
అర్థిస్తున్నాను.

# వె న్నె ల్లో కొ బ్బ రి చె ట్టు

లొట్టలు వేసుకుంటూ చంకలు గొట్టుకుంటూ
కొబ్బరిచెట్టు
వెన్నెలను నోరు పట్టకుండా తాగుతున్నట్టు 1

అందమైన ప్రకృతినిచూచి కొబ్బరిచెట్టు
తన కదిలే కళ్ళల్లో మెరుపుల్ని నింపుకున్నట్టు 2

చల్లగాలి చెవిలో వేసే జోకులకు కొబ్బరిచెట్టు
ఉండుండి పగలబడి నవ్వుతున్నట్టు 3

చంద''మామ'' చూపుల గిలిగింతలకు కొబ్బరిచెట్టు
గల గలా నవ్వుతూ వూగిపోతున్నట్టు 4

తల్లో మల్లెలు తురుముకొన్న కొబ్బరిచెట్టు
తలూపుతూ వలపుతలపులు తెలుపుతున్నట్టు 5

వెన్నెల్లో స్నానమాడి తుడుచుకోకుండా కొబ్బరిచెట్టు
పెరట్లోకొచ్చి కాస్త గాలిపీల్చుకుంటున్నట్టు 6

కాంతికిరణాల పసిపాపలకు కొబ్బరిచెట్టు
జోలపాడుతూ ఆకుల చేతులపై వూపుతున్నట్టు 7

మిరుమిట్లు మేలిమి గాజుల్ని తొడిగి కొబ్బరిచెట్టు
చేతులు కదిలించుకుంటూ చూచుకున్నట్టు 8

ఇందాకటిదాకా చీకట్లోనే మునిగిపోయివుంది
ఇపుడేమో పాపాయిని ఎత్తుకున్న ముత్తయిదువులా
నవ్వుతోంది. 9

# ము ఖం పు ల్ల

మా యింటిముందు నిలబడ్డ వేపచెట్టు
మౌన గానం చేస్తున్న అగ్నిగోళం,
అందులోనుంచి నాకు
అనుక్షణం అరుణోదయం

ఆ అగ్నిగోళంనుంచి నేను
అగ్గిబరాటా అందుకుంటాను,
చీకటికారే నా ముఖం
చేసుకుంటా దాన్తో ప్రక్షాళనం

నేనప్పుడు పెదవి విప్పితే చాలు
వెల్లి విరుస్తాయి వెలుతురు కిరణాలు,
అలా నేను కన్నెత్తి చూస్తే చాలు
అనంత చైతన్య వర్ణ విశ్లేషణాలు

నన్నంతా అంటారందుకే —
''నిప్పులాంటి మనిషంటే వీడే.''

శ్రీ రావి రంగారావు



శ్రీ రంధి సోమరాజు

# డబ్బునోళ్ళంటే య్యెంత మోజు!

ఇరవై ఆరో నెంబరు బస్సు సింహాచలంనుంచి బయలుదేరి గోపాలపట్నం, మర్రిపాలెంమీదుగా మాంచి హుషారుగా జోరుగావచ్చి 104 బస్సుస్టాండ్ దగ్గర ఆగింది. అప్పుడే బ్యాస్కెట్ బాలంతవున్న ఎర్రని సూర్యుడు ఆటలో ఓడిపోయిన వాడిలా కృంగిపోతూ కనుమరుగై పోయాడు.

అప్పుడే నిండు యవ్వనంతో పంచదార కలశంలా చవులూరించే మచ్చలేని మామిడిపండు చిన్నది, తెల్లని నవ్వుల పలువరుసతో సన్నని చిక్కని కాటుక కన్నులతో బస్సు ఎక్కుతూ 'ఒరేయ్ ఫోను చెయ్యడం మరచిపోకు. టాక్సీలూ దొరకలేదు, ఆటోలూ దొరకలేదని చెప్పు. చిన వాళ్ళేరుకు మనిషిని పంపమనీ చెప్పు. మరచిపోకు.' కంఠం శ్రావ్యంగా వీణకన్న మధురంగా మోగించింది. అందరి చూపులూ అటు తిరిగాయి.

అడ్డుగావున్న జనం అటే చూశారు. తమకు అడ్డుగావున్న వాళ్ళను తిట్టుకుంటూ కనబడని ఆ జవ్వనిని చూసేందుకు వీలుచిక్కని చాలమంది మనసులో చికాకు పడిపోయారు. ఒక్కసారైన చూడక పోతే తప్పుకదూ అనుకున్నారు.

జనం ఆవిడకు చాల సులువుగా దారి యిచ్చేశారు. బహుశా ఆమె చేతి వజ్రాల గాజుల మహిమో...ఖరీదైన ఎలక్ట్రానిక్ రేడియమ్ డయల్ రిస్టువాచ్ మహిమో...వాళ్ళ యిళ్ళకు 'ఇందిరమ్మ' వచ్చినట్లు మూర్ఛపోతూ వెనక్కి వెనక్కి తగ్గిపోయారు. దారి సులభం చేశారు.

రెండో సీట్లోవున్న ఇద్దరిలో ఓ ముసలమ్మ పోతూ పోతూ 'ఇలా కూచో తల్లీ...' అంటూ లాలనగా ముద్దుగా అప్పుడే వచ్చిన వారికి ఎప్పటికీ దొరకని సీటు చప్పున యిచ్చేసి తను ఏదో గొప్ప సహాయం చేసినట్లు మహ ఇదైపోయి దిగిపోయింది. గొప్పవాళ్ళకు సహాయం చేశాం అన్న మహాగొప్ప ఆనందమేదో ఆమె కంటిలో మెరిసింది. 'ఇందిర'కే వోటు వేసినట్లు మహ సంబరపడిపోయింది.

కళ్ళల్లో చిలక నవ్వులు మెరిపిస్తూ పక్కనున్న ఆవిడ ఎలాంటి ఆవిడో ఒకసారి పరిశీలించి చూసుకొని, తన వెనుక మగవాళ్ళున్నట్టు అంతకుముందే గ్రహించి, తనముందు స్త్రీలే కూర్చున్నట్లు తెలుస్తూనేవున్న విషయం మనసులోనే నిలుపుకోని 'ఛి...ఛీ సమయానికి కారు చెడిపోయింది అని గుంజాటనపడుతూ చాతకాని డ్రైవర్ను తిట్టుకుంటూ, పరమేశ్వరి సినిమా హాలుదగ్గర వాల్ పోస్టర్లో ఎన్. టి. ఆర్.ను చూసి నిత్య యవ్వనుడు ఇంకా ఎంత వుషారు' అని తమల పాకులు సేవించిన పెదవుల్లోంచి పై కుబికిన సుకుమారమైన నవ్వుల వెన్నెలల్ని మోగాన వెలిగించింది. ఆ ముసలమ్మ యిచ్చిన సీటు ఇంకా తగ్గని వెచ్చదనానికి సహించలేని లక్షణమేదో ఆమె మొగంలో విల విల తన్నుకుంది. మెడలోని హారాలు, చీరలోని జరీపువ్వుల విలువలు అక్కడ ఆ బస్సులో ఆమెను కూర్చోనివ్వడంలేదు. లక్షలు విలువచేసే చెవుల సౌందర్యం, అంతకు రెట్టింపు విలువుండే ఆ లోలకుల నాజూకు, పనితనం కళ్ళముందు మెరిసిపోతూవుంటే తనలోంచి వెల్లువలై ప్రవహిస్తూ, ఆ బస్సులో పేరుకపోయిన కుళ్ళు కంపును తుడిచేసి ఫ్రెష్‌గా అందరికీ అమృతపు జల్లుల్లా సువాసనల నందించిన తన ఉడుపుల్లోంచి పెల్లుబికే సుగంధ పరిమళం ఆ బస్సుకు ప్రాణంపోసి నందుకు మహదానంద పడిపోయింది. తనలోంచి ఏదో వెలుతురు వాళ్ళ మొగాలమీదపడి వాళ్ళను వెలిగించినట్లు భావించింది.

బస్సు ఆగుతూ కదులుతూవుంది. జనం ఎక్కుతూ దిగుతూ వున్నారు. సినిమాలవేళ దాటిపోవడంవల్ల బస్సు మరీ ఇరకాటంగా లేదు. చాలమంది దిగిపోవడమేకాని ఎక్కేవాళ్ళు పల్చబడిపోయారు.

నవరత్నాలను బుల్లి బుల్లి ముత్యాల గుత్తులమధ్య పొదిగిన ఆ సొగసు లోలకుల్ని ఒకరు చూస్తూవుంటే, ఒకరు ఆమె చేతి గడియారంవైపే చూస్తున్నారు. ఒకరు ఆ చీర సౌందర్యానికి ముచ్చట పడిపోతూవుంటే, ఒకరు కాళ్ళ పాంజేబు పట్టాల్లోని పనితనం, సొగసులకు ముచ్చటపడిపోతున్నారు. పై పైకి తేలికనిపించే ఆ చీరలోని లంగా తళతళలకు కొందరు మోజు పడిపోతూ ఆ వజ్రాల గాజుల మీద నిలబడిపోతున్నారు.

ఆ అందంముందు ఏ సినీ హీరోయినైనా బలాదూరే అంటూ కొద్దిమందిమాత్రం ఆమె మొగంవైపు చూడగలిగే అదృష్టవంతులు ఉక్కిరి బిక్కిరై పోతున్నారు. ఆ చెంపల సౌకుమార్యానికి జ్వాలలా సూదంటురాయిలా లాగుకుంటూ గుండెల్ని మంటెక్కించేస్తూవుంటే, అటు చూడగలిగిన అదృష్టవంతులు ఉక్కిరిబిక్కిరై పోతున్నారు. వెనుకనున్నవారు జుత్తుముడి, మెడ సొగసుచూస్తూ బెంగపడి పోతున్నారు.

ఈలోగా దుర్గాలమ్మ గుడి రానే వచ్చింది. అంటే బస్సు పూర్ణామార్కెట్‌కు వచ్చిందన్నమాట. మూడువంతులు దిగిపోయారు. అంతకు రెట్టింపు ఎక్కారు. ఈసారి బస్సు కొంచెం సందడిగానే వుంది.

ఏవేవో మాటల కలయికల, 'ధ్వని తరంగాలు' ఆమెకు చికాకు కలిగిస్తూనే ఉన్నాయి. ఇంతసేపూ డబ్బులడగడం మరచిపోయిన కండక్టర్ 'టికెట్...టికెట్' అన్నాడు. అలా అంటూ ఆమెముందు నిలచాడు.

గుండల్ని పండ స హ్యాండ్‌బ్యాగ్ జిప్ సర్‌నలాగి కొత్త పది రూపాయల కాగితం చివరిఅంచు కండక్టర్ చేతికందించింది. మని షెంత గొప్పగా వుందో ఈ నోటూ అంత గొప్పగా వుందనుకుంటూ ఉన్న వాటిల్లో మంచినోట్లకోసం వెదికి వెదికి చివరికి నలిగిపోయిన కుళ్ళునోట్లు చిల్లరతోసహా చేతిలో పెట్టాడు.

ఆమె లెక్కచూసుకుంది. 'ఛీ...తను లెక్కపెట్టుకోవడ మేమిటీ...' అనుకుంది. నలిగిపోయిన అయిదు రూపాయలనోటూ, వడలిపోయిన ఆకుల్లాంటి రెండు రెండురూపాయలనోట్లూ, పది పైసలబిళ్ళు,అయిదు పైసలబిళ్ళు ఉన్నాయి. కాదు...వున్నట్లుఆకళ్ళు చూశాయి. పైట సర్దుకుంది. మళ్ళీ చూసింది. అలాగే అనిపించింది. ఆ డబ్బు చేతిలో వుంచినప్పుడు ఆ చేతి లావణ్యానికి కండక్టర్ తూలి పడిపోబోయాడు. వెంటనే ఆమె అతని గుండెలాగిపోయేట్టు 'వన్ నాట్ ఫోర్‌నుండి చినవాల్తేరుకు ఎంత?' అంది.

కళవళపడ్డ కండక్టరు 'అరవై పైసలండి' అన్నాడు.

'మరి చిల్లరెంత ఇచ్చావు' మామూలుగానే అంది. ఈ మాటతో బస్సులోనివారంతా చాలా ఎలర్ట్ అయిపోయారు.

''తొమ్మిది రూపాయల నలభై పైసలిచ్చాను. ఓ అయిదు రూపాయిలనోటు, రెండు రెళ్ళు, ఓ పావలా, పదిపైసలబిళ్ళ ఒకటి, ఐదుపైసలబిళ్ళ ఒకటీ...' అన్నాడు.

మళ్ళీ ఓసారి అతనిచ్చినడబ్బు లెక్కచూసింది. 'ఓ పావలా తక్కువుందే...' అంది.

వెంటనే ఆమె ప్రక్కనే కూర్చున్న విధవరాలు 'వీళ్ళంతే నండి...పావలాలు, అయిదు పైసలబిళ్ళలూ కొట్టేస్తూ వుంటా రండి' అంది.

కండక్టరుకు రాగూడనికోపం వచ్చేసింది. 'మాటలు సరిగ్గా రానివ్వండి. కొట్టెయ్యడం గిట్టెయ్యడం మనకు తెలియదు. ఎక్కడ పడిపోయిందో సరిగా చూసుకుంటే...మీకే...' అని అతనింకా ఆమాట పూర్తిచేయకముందే—

'ఏమిటోయ్...ఫూల్‌లా...ఆవిడ ఆఫీసరుగారి భార్య. ఇవ్వ లేదంటూవుంటే...నోటికొచ్చినట్లు వాగుతున్నావ్...సరిగా చూడ మంటావేమిటి? ఆమెకు లెక్కలు రావనా... ముందు ఇచ్చెయ్ పావలా...' అన్నాడు ఆమె పక్కనే నిలచి ఆమెలోంచి బంగారమేదో తనలోకి ప్రాకిపోతున్నట్లు మహా సంతోషపడి పోతూన్న ఆ పెద్ద మనిషి. ఆమెకు ఘోరమైన అన్యాయం జరిగిపోయినట్లు హడావుడై పోయాడు.

వెంటనే మరొకడు 'నేను చూస్తూనే ఉన్నాను. ఆమె లేచి చీర దులుపుకోవడం...పైట సర్దుకోవడం...ఎక్కడా పడందే... పాపం ఆవిడ వంగి కాళ్ళకిందకూడ చూసుకుంది' అంటూ గట్టిగా అరిచాడు ఓ చూపుల గుంటడు.

కండక్టరుకు పిచ్చెక్కినట్లయింది. 'ఆమె కాళ్ళకింద చూసు కుంటే నాకెందుకూ, చీర దులుపుకుంటే నాకెందుకు. నే నిచ్చాను. ఎవడమ్మ మొగుడి సొమ్మితేను; మీరంతా పారేసుకుంటూవుంటే తీసు కొచ్చి యివ్వడానికి' అనేశాడు కాస్త రఫియన్‌లా.

దీనితో ప్రజలు కుతకుత సున్నంలా ఉడికిపోయారు. 'ఆపు ముందు బస్సు. నీ దగ్గరున్న డబ్బు లెక్కపెట్టు. ఇచ్చిందీ లేందీ తేలి పోద్ది' అన్నాడు ఓ హీరో సర్‌న ముందుకు దూసుకొచ్చి.

'ఇలా అందరికోసం పైస పైసకు లెక్కపెట్టుకుంటూ కూచుంటే మరి బస్సు కదలినట్లే' అన్నాడు కండక్టరు ధీమాగా.

'అయితే ఎవడబ్బసొమ్ము దొబ్బుతావ్...ఆపు బస్సు' అన్నాడు కత్తిలా ఓ తాగుబోతు.

'నా జన్మలో ఒక్కసారికూడ ఎవ్వరికీ నే డబ్బు తక్కువివ్వ లేదు. అలా ఎప్పుడూ జరగదు' అన్నాడు కండక్టరు ఉక్రోషంతో.

ఈ మాటలు అలా అలా క్షణ క్షణం బస్సు చక్రాల్లా చుట్టుకుంటూ ముందుకుపోతుంటే హోరా హోరీ యుద్ధం జరిగి పోయే స్థితికి వచ్చేసింది.

జగదాంబ దాటి, రామ్‌నగర్ గవర్నర్ బంగళాదాటి బస్సు సిరిపురం వచ్చేసింది. ఆ స్టాప్ దగ్గర బండి ఆగుతూవుండగా

'అంతా దిగండి. ఊ...తొందరగా దిగిపోండి, బస్సెలా కదులు తుందో చూస్తాను. పావలా ఇవ్వడమో చావడమో ఇవ్వాళ తేలిపోవాల లేకపోతే ఇక్కడికిక్కడే బస్సు తుర తుర తగలడిపోద్ది ... దిగండి ముందు...' అంటూ ప్రళయంగా అరిచాడు ఓ వీర కిశోరం.

ఓ పదిమంది అతనితో దిగారు.. బస్సు కడ్డంగా ప్రాణాలకు తెగించినట్లు నిలబడిపోయారు. డ్రైవరు ఇంజను ఆపివేశాడు.

ఆమూల బస్సులో కెవ్వున అరుపులు. ఏవేవో విరిగి పోతూన్న ధ్వనులు. ఫెళఫెళార్భాటాలు. ఆలస్యమైపోతోందని ఇళ్ళదగ్గర తమ కోసం ఎదురుచూస్తూ పిల్లలు ఏడుస్తూ వుంటారని మరోమూల కాకిగోల. అంతా ఎవరికివారు వాళ్ళకు తోచినట్టు, ప్రపంచం అంతా యుద్ధంలో మునిగిపోయినట్లు, బలంకొద్దీ బాంబులు విసురు తున్నారు.

ఇహ ఏమి జరుగుతుందో ఏమీ తెలియడంలేదు. వాళ్ళ హడా వుడి చూస్తూవుంటే యూనివర్శిటీముందే బస్సును తగలేసేసేలా వున్నారు.

ఆ వీరావేశం ఎక్కడనుంచి ఎలాపుట్టుకొచ్చింది? అందరిలోనూ కొంపలు మునిగిపోయే ఆవేశం పెరిగిపోయి రెచ్చిపోయి సివాలేస్తోంది.

ఉధృతంగా సైనికుల అరపులు, వికృతంగా మృగాల భరించ నలవికాని కూతలు బస్సును చుట్టుముట్టేశాయి.

ఆమె మళ్ళీ ఏమీ మాట్లాడలేదు. బిక్కసచ్చినట్టు వూరుకుంది. కొడుకు చచ్చిపోయినప్పుడు ఇందిరా గాంధీలా బిగుసుకు పోయింది.

'దిగిపోదాం రండి. వాడు డబ్బు లెక్కపెట్టడు. వీళ్ళు బస్సు తగలెట్టడం మానరు' అంది పక్కనున్న విధవరాలు.

'దిగిపోవాలా' అన్నట్టుగా లేచిందావిడ. 'మరితప్పదా' అన్నట్టు బెంగెట్టిల్లిపోయింది.

'పోనీలెండి...ఎందుకు ఓ పావలాకోసం యింత రభస' అనాలని కూడ అనలేకపోయింది. సుదీర్ఘంగా ఆలోచనలో పడిపోయినట్లుంది, వారసునికోసం దిగులుపడిపోతూన్న ప్రధానిలా.

అప్పుడు ఆ ప్రక్క కింద కూర్చున్న, బస్సులో నిలబడి దాని ఊపులకు తట్టుకోలేని ముసలివాడు ఆకారంలో బిచ్చగాడిలా వున్న వాడు 'ఎందుకయ్యా పావలాకోసం అలా చచ్చిపోతారు. ఇదిగో ఇక్కడుంది తీసుకోండి' అన్నాడు.

అంతా చప్పన తుస్సుమనిపోయారు.

'వెధవ య్యింతవరకు ఎందుకు చెప్పలేదు. చెక్కెయ్యాలను కొని వుంటాడు' ఎవ్వరో పైకే అనేశారు.

ముసలివాడు 'నిజం నిలకడమీదకాని తెలియదుబాబూ...' అని తనలో తాను గొణుక్కున్నట్లు అన్నాడు. ఆమాట ఎవ్వరూ విన్నట్టు లేదు. అల్లరి యింకా సద్దు మణగలేదు.

ఆ పావలా దొరక్కపోతేమాత్రం ఆవిడగారికోసం, ఆవిడను తృప్తి పరచడంకోసం ఆ బస్సు ప్రాణాలు తోడేసేవారు. కండక్టరును డ్రైవర్ను మళ్ళీ నీళ్ళు త్రాగనిచ్చేవారుకాదు.

ఇన్‌గేట్, అవుట్‌గేట్, పోలీసు స్టేషను, పిచ్చాసుపత్రి దాటి బస్సు చినవాల్తేరు చేరింది.

ఆమెతోపాటు ఆ ముసలివాడూ దిగాడు.

వంగి చేతికర్ర పుచ్చుకొని మెల్లగా దీనంగా అపనిందను మోస్తూ ఎవరివైపూ చూడకుండా 'అంతా చల్లగా ఇళ్ళకు చేరుకున్నారు...చాల్లే...' అని తనలో తాననుకున్నట్లు అనుకున్నాడు. ఈ మాట ఆవిడకు చేరనే చేరింది.

ఇంటికి పనిమనిషి తోడురాగా కదిలి, గబగబా బాత్‌రూమ్‌కు పోయి ఆ చీర, జాకెట్టు, లంగా, బ్రా వూడదీసి ఓ మూలకు విసిరేసింది.

అప్పుడే టక్‌మని ఏదో ధ్వని—

రైళ్ళు గుద్దుకున్నట్టు, విమానం కూలిపోయినట్టు!

చూస్తే పావలా.

తను దిగంబరంగా వుంది.

షవర్‌లోంచి నీళ్ళు దేశప్రజల ప్రాణాలు తోడేసిన రాజ్‌నారాయణ్ దుశ్చేష్టల్లా ఒళ్ళంతా సర్ సర్‌న ఎడతెరిపి లేకుండ ఆక్రమిస్తున్నాయి.

'పాపం కండక్టర్...' అనుకుంది.

దేశనాయకుల అవక తవకలు చూడలేక కన్నుమూసిన జయప్రకాష్‌లా తల్లడిల్లిపోయింది.

జాకెట్‌కు, బ్రాకు మధ్య ఎలాపడిందో...!

ఇంతకీ ఆ ముసలివాడు తన స్వంతడబ్బు దానం చేశాడా? అంత పేదవాడు...అంత తెలివున్నట్టు కనబడనివాడు! వాడికి ఇంత గొప్ప ఆలోచన ఎలా పుట్టింది? అతను ఇవ్వకపోతే ఘోరాతి ఘోరం జరిగిపోయేది. భగవంతుడిలా కాపాడాడు. నిజంగా అతను భగవంతుడు!

'అంతా చల్లగా ఇళ్ళకు చేరుకున్నారు...చాల్లే...'

ఆ మాటలు గుండెల్ని చిదిమేస్తున్నాయి.

ఉదయం తన భర్త ఒక వందరూపాయలు తక్కువ ఉన్నాయి, మరోసారి ఇస్తానంటున్నా అయిదువందలకు తక్కువైతే పనిచెయ్యనని తిప్పికొట్టిన సంగతి ఆమెను కుళ్ళబొడిచేసింది. అందులో అదిలంచం. ఈ నగలు, ఈ రవ్వల గాజులు, ఈ లోలకులు, ఈ బ్రా, ఈ జాకెట్టు అన్నీ ఆ లంచాల బాపతే! కాని తను పావలా దొరికింది అని అనలేకపోయింది.

ఈచిర, ఈదుస్తులు అన్నీ...అన్నీ దుర్గంధంతో నిండిపోతూ న్నట్లున్నాయి. ఓ పావలాయేగా అనుకోలేకపోయింది తను.

ఉదారబుద్ధి ఈ రక్తంలో ఏడ్చి చావలేదు.

ఈ డబ్బురూపంలో ఈ లోకంముందు ఎంత గొప్పగా ఆ క్షణంలో తను నిలచిపోయింది !

ఎలాంటి వారికైనా ఓ రోజుంటుందట! తను కుళ్ళి కుళ్ళి ఛస్తున్న రోజు ఇది.

పాపం ఆ ముసలినాడు అంతటి ఉదారుడు, మానవత్వం రూపు దాల్చినవాడు నిందను నెత్తిని వేసుకొని వెళ్ళిపోయాడు.

ధనవంతులంటే ఈ ప్రజలకింత మోజేమిటో! ఒక్కరూ ఆ కండక్టరు తరఫున మాట్లాడలేదు. అందుకే అవిడను అలా కొలుస్తున్నారు! ఇంతకన్న ఘోరం మరొకటి వుండదు.

'అంతా చల్లగా ఇళ్ళకు చేరుకున్నారు. చాల్లే...' ఆ పేదవాని గుండెల్లో ఎలా పుట్టుకొచ్చింది ఆ దయాదేవత! మళ్ళీ మళ్ళీ ఆ మాటలే గుండెల్లో కలయ తిరుగుతున్నాయి.

ఆమె కళ్ళల్లో నీళ్ళు...కాదు...కాదు, పైనుంచి జారుతూన్న షవర్ కన్నీళ్ళు...పాపం !

ఇందాక పడమట అస్తమించిపోయిన ముసలి సూర్యుడు; అత గాడి ఓడిపోయి, కమిలిపోయిన ముఖం, ఆమె కళ్ళముందు భయం కరంగా నిలిపి, ఆమె గుండె కాయను ఒలుచుకొని నోట కరచుకొని గెద్దలా మాయమైపోయాడు !

# చర్మం కరుగుతున్న దృశ్యం

## శ్రీ కె. రామ్మోహనరాజు

గుండెలు మండుతున్నాయి
చిలుంపట్టిన కత్తిలావున్న నల్లని మేఘపు అంచుకు
మెరుపులు పదును పెడుతున్నాయి
శోకమయ వర్తులాలన్నీ నా చుట్టూ
గిరగిర తిరుగుతున్నాయి
ఒక్కో వర్తులం నన్నొరుసుకపోయినప్పుడల్లా
సుప్త చైతన్యం ఒక్కో మెట్టుగా మేల్కొంటున్నది
చెట్టుకింద గుడ్డ ఊయల్లో నగ్న శిశువు ప్రశ్నిస్తుంది
నా భవిష్యత్తుకి మీరిచ్చే భద్రత ఏమిటని !
వ్యవస్థపట్ల ధిక్కారంగా ఎక్కడో ఒక సంకెల
కదులుతుంది — తెగడానికి సిద్ధంగా
రక్తం స్రవిస్తున్న గాయాలతో అజ్ఞాతయోధుడు
ఘోషిస్తాడు — తిరగబడమని
పత్రికల్లో కార్టూనులు మాత్రమే చూసే
వాడికి యుగలక్షణం అర్థంకాదు
లోకంలో కోటికోట్ల బానిస పీనుగలు
వాళ్ల కైదడుగుల నేలకాదు అంగుళం గుడ్డకూడాలేదు
కర్మ భూమిలో కర్షకునిది సేద్యం
హస్తినలో కౌరవులది రాజ్యం.

నేడో రేపో ఈ పక్షి తన రెక్కలు
విశాలంగా చాస్తుంది
నేడో రేపో ఈ పక్షి పాత ప్రపంచాన్నంతా
పూడ్చి వేస్తుంది
వేల వందల సంవత్సరాల అణచివేత
మరిగి మరిగి లావాగా బయటికి వస్తుంది
వ్యవస్థ ఎండిపోయిన ముళ్ళపొద
వ్యవస్థ పుచ్చిపోయిన చెట్లున్న అడివి
ఈ నడుస్తున్న వెసువియస్‌లు పగిలి
ముళ్లపొదలు మసైపోయి, పుచ్చిపోయిన చెట్లున్న
అడివంతా కాలిపోయి
విజ్ఞానం విముక్తమవుతుంది
అప్పుడిక ఈ శవాలు కాలుతున్న
వాసన వుండదు
ఈ చర్మం కరుగుతున్న
దృశ్యాలుండవు.

డా. జి. చలపతి

# సంకుసాల నరసింహకవి కొన్ని చారిత్రక సత్యములు

'కవి కర్ణ రసాయనము'నే ప్రౌఢ ప్రబంధం వ్రాసిన మహాకవి సంకుసాల నరసింహకవి. ఇతని అసమాన పాండిత్యానికి, ఊహా వైభవానికి ఈ కావ్యం నిదర్శనం. రాయల యుగంనాటి ప్రబంధకవుల్లో ఇతనికి సాటివచ్చే మరొక కవిలేడని కొందరు పొగడితే, ఇతడు కేవలం వర్ణనా ప్రియుడని, కథా కథన దక్షుడు గాడని కొందరు తెగడినారు. ఎవరేమన్నా ఇతని కావ్యం వింత సొగసులు సంతరించుకొన్న ఉత్తమ ప్రబంధం. ప్రాచీన సాహిత్య చరిత్రకారులు ఇతనిని సరిగా గుర్తించక పోవడంవల్ల కావ్య విమర్శకులు సైతం కవికర్ణ రసాయనాన్ని సూక్ష్మంగా పరిశీలించలేదు. ఈకారణంవల్ల ఈ గ్రంథంలోని కవితా చమత్కారాలు, సొగసులు వెలుగులోకిరాలేదు. అందువల్ల ఈ కావ్యం పేరు వినగానే ఇది ఏదో ఔషధం పేరని చాలమందికి తోస్తూవుంది. ఇది ఈ కవి దురదృష్టం. ఈ వ్యాసంలో ఈ కావ్య విమర్శగాక, సాహితీ లోకంలో ఈ కవిని గూర్చి యేర్పడివున్న కొన్ని ఊహలు పరిశీలింపబడతాయి.

1. ఈ కవి పూర్తి పేరు సంకుసాల నరసింహకవిగా లోక వ్యాప్తి. అయితే నరసింహకవి తన కావ్యంలో ఎక్కడా సంకుసాల నరసింహకవినని చెప్పకోలేదు. కావ్య ఆశ్వాసాంత గద్యల్లో 'నరసింహ కవి నామధేయ ప్రణీతంబైన' అని మాత్రమే వుంది. ఈ కావ్యానికి తంజావూరు, మద్రాసు, తిరుపతులలోవున్న తాళపత్ర ప్రతుల్లోకూడ 'నరసింహకవి' అని మాత్రమే వుంది. సంకుసాల అనే ఇంటి పేరు లేదు. అయితే కావ్యంలో కవి చెప్పకోని ఇంటి పేరు ఎలా ప్రచారమైందో పరిశీలించాలి. ఈ కావ్యానికి ఇప్పటివరకు మూడు ముద్రిత ప్రతులున్నాయి. 1. పువ్వాడ వేంకటరావు పంతులు వర్తమాన తరంగిణీ ముద్రాక్షరశాలలో ముద్రించింది మొదటి ప్రతి. (1885). 2. ఉత్పల వేంకట నరసింహాచార్యులచే పరిష్కరించబడిన వావిళ్ల ప్రతి రెండవది (1916). 3. మోచర్ల రామకృష్ణయ్య సంపాదకత్వంలో వెలువడిన సాహిత్య అకాడమీ ప్రతి మూడవది (1967). మొదటి ప్రతిలో 'సంకుసాల' అని లేదు. రెండు మూడు ప్రతుల్లో 'సంకుసాల నరసింహకవి' అని వుంది. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు అన్నమాచార్య చరిత్రకు వ్రాసిన పీఠికలో లక్షణకర్తలు తమ లక్షణ గ్రంథాల్లో కవి కర్ణ రసాయన పద్యాలను లక్ష్యాలుగా వాడుకున్న సందర్భాల్లో ఇతనిని 'సుంకసాల నరసింగన్న' అని పేర్కొనినట్లు వ్రాశారు. ఏ లక్షణ గ్రంథంలో ఎవరు పేర్కొనిరో తెలపలేదు. ఈ కావ్యానికి తరువాత వచ్చిన ఏ లక్షణ గ్రంథంలోను ఈ విధంగా లేదు.

ఈ కావ్య మొదటి ముద్రిత ప్రతికి రెండవ ముద్రిత ప్రతికి మధ్యకాలంలో వీరేశలింగం పంతులుగారి కవుల చరిత్ర ద్వితీయ సంపుటం (1887) వెలువడింది. ఇందులో పంతులుగారు ఈ కవి సంకుసాల నరసింహకవిగా పేర్కొన్నారు. పంతులుగారి అభిప్రాయాన్ననుసరించి వావిళ్ల ప్రతి సంకుసాల నరసింహకవిగా పేర్కొంది. ఈ ప్రతి ననుసరించి పరిష్కరింపబడిన అకాడమీ ప్రతిలో గూడ 'సంకుసాల' కనిపిస్తుంది. మరొక ముఖ్య విషయం. ఈ కావ్యానికి జూలూరి అప్పయ్య పండితుడు వ్రాసిన వ్యాఖ్యానం మద్రాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారంలో (D 453, 454) వుంది. ఈ వ్యాఖ్యానానికి కారకుడైన సి. పి. బ్రౌన్ గూడ ఆ ప్రతిలో 'సంకుసాల' అని వ్రాయలేదు. నిశిత పరిశీలనాదక్షుడైన బ్రౌన్ పేర్కొనలేదంటే ఆధారం లేదనే చెప్పాలి.

ఏ కారణం చేతనో కవి తన ఇంటి పేరును చెప్పకోలేదు. కవి చెప్పకున్నా ఈ ప్రతికి పుత్రికలను వ్రాసుకున్నవారుగూడ 'సంకుసాల'గా చెప్పలేదు. ఇదంతా పరిశీలిస్తే మొట్ట మొదట వీరేశలింగం పంతులుగారే నరసింహకవి ఇంటి పేరుగా 'సంకుసాల'ను గ్రంథస్థం చేసినట్లు స్పష్టమవుతుంది. పంతులుగారిలా చేశారంటే వారి కాలం నాటికి నరసింహకవి ఇంటి పేరు 'సంకుసాల' అని వ్యవహారంలో వుండి వుండాలి. కొంత మంది ప్రసిద్ధ వ్యక్తులుగూడ వారి పేర్లతో గాకుండా వారి ఊరి పేరు మీద, లేక ఇంటి పేరుమీద ప్రఖ్యాతిని పొందుతూ వుండడం మన అనుభవంలోని విషయమే. నరసింహకవి సుంకేసుల గ్రామవాసి గావడంచేత ఆగ్రామనామమే కవి గృహనామంగా మారిందని అంగీకరిస్తే ఆనాటి కవులు, విమర్శకులు సుంకేసులకు చెందినవాడు గాబట్టి సంకుసాల నరసింహకవి యని ఇతనిని పిలిచి వుండవచ్చు. అప్పటి నుండి లోకంలో ఆ పేరుకు వ్యాప్తిగలిగి నేటికీ వృద్ధాను శ్రుతిగా మిగిలి వుండవచ్చు. ఇలా జరగడంవల్ల కవి అసలు ఇంటి పేరు మరుగునబడి వుండవచ్చు. నరసింహకవికి సుంకసాల తిరుమలకవి అనే మనమడు ఉన్నాడు గాబట్టి (వివరాలు 3వ విషయం క్రింద తెలుస్తాయి) పై ఊహలలో సత్యముందని అంగీకరించక తప్పదు. ఈ వృద్ధానుశ్రుతి ననుసరించి వీరేశలింగం పంతులుగారు నరసింహకవికి 'సంకుసాల'ను తగిలించారు.

2. సుంకేసుల అన్న ఊరి పేరు కవి ఇంటి పేరుగా మారిందని పైన చెప్పబడింది. రాయలసీమలో ముఖ్యంగా కడప, కర్నూలు మండలాలలో చాలా సుంకేసుల గ్రామాలున్నాయి. వీటిలో ఈ కవి

ఏ సుంకేసులకు చెందినవాడో చెప్పడం కష్టం. కడప జిల్లా పులివెందుల తాలూకాలోని సుంకేసులే కవి గ్రామమని వేటూరి ప్రభాకర శాస్త్రిగారు నిర్ణయించారు. దీనికి ఆధారం లేదు. అయితే వి. రంగాచార్యగారు ఈ గ్రామ నృసింహాలయ ప్రాకారంలోవున్న ఒక దాన శాసనాన్ని వివరిస్తూ "This village gave its name to Narasimhakavi, the author of Kavi Karnarasayana" అని అభిప్రాయపడటం (Topographical List of Inscriptions of the Madras Presidency, pg. 633) దీనికి కొంత ఆధారం. అయితే రంగాచార్యగారు జన వ్యవహారంలోవున్న అభిప్రాయాన్ని ప్రకటించారేగాని వేరొక ఆధారం వుండికాదు. ఒకవేళ అక్కడ నరసింహాలయం ఉంది గాబట్టి దేవుని పేరే కవిపేరు గాబట్టి ఆ గ్రామాన్నే కవి గ్రామంగా భావించినా కేవలం ఊహే అవుతుంది. ఈ కవి గురువు భట్టపరాశరుడు. అహోబిలము, తిరుపతి, శ్రీరంగము ఆనాటి విశిష్టాద్వైత మత ప్రచార నిలయాలు. ఈమఠాలలో ఆచార్యులుగా వున్నవారందరూ చాలవరకు భట్టరాఖ్యులే. ఆహోబిల మఠంలోవున్న భట్టపరాశరుడు ఇతని గురువని భావిస్తే ఆ మఠానికి సమీపంలో ఏ సుంకేసుల వుంటుందో ఆ సుంకేసుల కవిగ్రామంగా చెప్పవచ్చు. ఇదిగూడ కేవలం వూహే. అందువల్ల దీనికిసంబంధించిన సరియైన ఆధారం దొరికేవరకు నరసింహకవి ఏ సుంకేసుల వాడనేది అటుంచి సుంకేసుల గ్రామవాసిగా భావించుకోక తప్పదు.

3. సంకుసాల నరసింహకవి తాళ్లపాక అన్నమాచార్యుల కుమారుడని లోకంలో ఒక నమ్మకం కుదురుకుంది. దీన్ని ప్రచారం చేసినవారు వేటూరి ప్రభాకరశాస్త్రిగారు (అన్నమాచార్య చరిత్ర పీఠికలో) దీనికి ఆధారంగా వీరు చూపించే కారణాలు రెండు— 1. తెనాలి రామకృష్ణకవి చాటువు. 2. తాళ్లపాక చిన్నన్న కృత అష్టమహిషీ కల్యాణ పీఠిక.

> "చిన్నన్న ద్విపద కెఱగును, పన్నుగ బెద తిరుమలయ్య పదముల కెఱగున్
> మిన్నంది మొరసె నరసిం, గన్న కవిత్వంబు పద్య గద్య శ్రేణిన్."

అన్న తెనాలి రామకృష్ణ కవి పేరుమీద చాటువుగా వ్యవహారంలోవున్న ఈ పద్యం అప్పకవీయం (3–224) లో ఉదహరింపబడింది. ఈ పద్యంలోని చిన్నన్న, పెదతిరుమలయ్య తాళ్లపాక వంశంవాళ్లు గాబట్టి నరసింగన్న గూడ ఆ వంశంవాడే అయివుంటాడని వీరి వాదం.

> "తిమ్మాంబకు నాత్మ సంభవుండు, పాడ జెప్పగ వర్ణ పద్ధతి నీడు జోడు లేడన సభజొచ్చి వాదించి, పరగిన ధీశాలి ప్రతివాద దైత్య నరసింహుడన గల్గె నరసింహగురుడు......" (అష్టమ పీఠిక)

అన్న చిన్నన్న అష్టమహిషీ కల్యాణ పీఠికలో కవిత్వం చదవడంలోను, చెప్పడంలోను తనకు తానే సాటియని సభలలో వాదించి నిరూపించుకున్న నరసింహుడొకడున్నాడు. ఇతడు అన్నమాచార్యులకు ప్రథమ కళత్రమగు తిమ్మక్క వలన కలిగిన పుత్రుడని చిన్నన్న కథనం. ఈ నరసింగన్న, రామకృష్ణకవి చాటువులోని నరసింగన్న — ఇద్దరూ ఒకరే నని, అతడే అన్నమాచార్యుల పుత్రుడని ప్రభాకరశాస్త్రిగారు నిర్ణయిస్తే ఇప్పటివరకు అదే చెల్లుతూవుంది. అయితే సుంకసాల తిరుమలకవి తన 'భాగవత వైభవము' అనే ద్విపద గ్రంథంలో తాను సంకుసాల నరసింహకవి మనుమడనని చెప్పుకున్నాడు.

> "సుంకసాల కులాబ్ధి సోమ నిష్కామ, పంకజోదరపాద భక్త్యేకధామ
> నమిత విద్వజ్జన నరసింహ పౌత్ర, రమణీయ గుణ గణ రఘునాథ పుత్ర
> తిరుమల శుభనామధేయ ప్రణీత, వరకావ్యమగు భాగవత వైభమున"

ఆ గ్రంథ పీఠికలోని పై పంక్తుల్లో సుంకసాల తిరుమలకవి తండ్రి రఘునాథుడని, రఘునాథుని తండ్రి నరసింహకవియని వంశ వృక్షముంది. తిరుమల కవి ఇంత స్పష్టంగా చెపుతూవుంటే అస్పష్టమైన నిదర్శనాలను బట్టుకొని నరసింహకవిని తాళ్లపాక వంశంలో చేర్చడం అనుచితం. అష్టమహిషీ కల్యాణ పీఠికలో నరసింగన్నకు నారాయణుడు, అప్పలార్యుడు, అన్నమార్యుడు అని ముగ్గురు కొడుకులున్నట్లు చెప్పబడింది. చిన్నన్న యిచ్చిన తాళ్లపాక వంశ వృక్షంలో తిరుమల కవి పేర్కొన్న రఘునాథుడు లేడు.

తాళ్లపాక నరసింగన్న కవిత్వం చదవడంలోను, చెప్పడంలోను ప్రఖ్యాతి చెందితే కవికర్ణ రసాయన కర్త ఏ సభలోను తన పాండిత్యం నిరూపించుకున్నట్టులేదు. పైగా రాజుల ఆదరణకు నోచుకోలేదు. ఒకవేళ తాళ్లపాక నరసింగన్న కవికర్ణ రసాయన కర్త అయితే అంతటి ప్రౌఢ ప్రబంధం వ్రాసిన వానిని గూర్చి చిన్నన్న స్పష్టంగా ప్రస్తావించకుండా వుంటాడా? నరసింగన్న ఆనాటికి సంకీర్తన సార్వభౌముడుగా, పద కవితా పితామహుడుగా వాసికెక్కిన అన్నమాచార్యులను తండ్రిగా పరిచయం చేసుకోకుండా వుంటాడా? తన వంశం వాళ్లంతా శ్రీ వేంకటేశ్వరస్వామికి తమ కృతులు అంకితమిస్తే తాను రంగనాథుడికి అంకితమిస్తాడా? ఈ కారణాలన్నీ సంకుసాల నరసింహకవి తాళ్లపాక వంశంవాడు కాడని స్పష్టంగా నిరూపిస్తున్నాయి.

4. నరసింహకవి కాలానికి సంబంధించి చాలా మంది విమర్శకులు ఇతడు శ్రీకృష్ణదేవరాయలకు సమకాలికుడని అంగీకరిస్తే ఒక్క రాళ్లపల్లి అనరితకృష్ణశర్మగారు మాత్రం (ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక. 6వ సం. పుట 270) క్రీ.శ. 14వ శతాబ్దం వాడని తేల్చారు. నరసింహకవి గురువు భట్టపరాశరుడు. ఈ పేరుగలవాళ్లు శర్మగారి ఊహలో శ్రీవత్సచిహ్న మిశ్రుని జ్యేష్ఠకుమారుడైన భట్టపరాశరుడు, వేదాంత దేశికుల శిష్యుడైన భట్టపరాశరుడు మాత్రమే వున్నారు. వేదాంత దేశికులు క్రీ. శ. 1268 నుండి 1369 వరకు జీవించియుండడంచేత వారి శిష్యుడుగూడా 14 వ శతాబ్దము ముగిసే లోపల పరమపదం చేరియుండాలి. శ్రీవత్సచిహ్నమిశ్రుని కుమారుడైన భట్ట పరాశరుడు వేదాంత దేశికుల శిష్యుడైన భట్టపరాశరుని కంటె పూర్వుడు గాబట్టి వేదాంత దేశికుల శిష్యుడగు భట్టపరాశరుడే సంకుసాల గురువు. ఈ భట్టపరాశరుడు 14 వ శతాబ్దమువాడే గాబట్టి ఇతని శిష్యుడైన నరసింహకవి రాయలకాలంవాడని చెప్పడం

పొసగదని శర్మగారి అభిప్రాయం. అల్లసాని పెద్దన అసూయతో నరసింహకవికి రాయల ఆస్థాన ప్రవేశం కలిగించలేదనేమాట అసత్యమని చాటడానికే తాను కవి కాలాన్ని 14వ శతాబ్దంగా నిర్ణయించినట్లు శర్మగారే చెప్పారు,

అనంతకృష్ణశర్మగారి ఊహ సహేతుకంగా కనిపించినా భట్టపరాశరులు ఇద్దరే ఉన్నారనడం సరిగాదు. ఈ పేరుగలవాళ్ళు చాలా మంది వున్నారు. తిరుపతి దేవస్థానంవారు ప్రకటించిన నాల్గవ శాసన సంపుటంలోని 553వ శాసనంలో మట్ల రామయ్య తాను భట్టపరాశరుని శిష్యుడనని చెప్పుకున్నాడు. ఈ శాసన కాలం 6–3–1536. ఈ భట్టపరాశరుని శర్మగారు గమనించినట్టు లేదు. రామానుజాచార్యుల కాలం నుండీ 'భట్టరు' అనేది బిరుద వాచకంగా వైష్ణవ గురువు లందరి పేర్లకు ముందూ వెనకా చేరినట్లు కనిపిస్తుంది. తెనాలి రామకృష్ణుని గురువు భట్టరు చిక్కాచార్యులు (పాండు. 1–17). రెట్టమత, కామందకాల కృతిభర్త కొండ్రాజు వెంకట్రాజు చిక్కాచార్యుల శిష్యుడే. చరిగొండ ధర్మన భట్ట పరాశరుని శిష్యుడు (చిత్ర భారతం. 1–17). సులక్షణసార కర్త లింగంగుంట తిమ్మకవి గురువు చిక్కయ భట్టరు. ఇంతమంది భట్ట పరాశరులుండగా ఈ కవి గురు వే భట్టపరాశరుడో తేల్చడం కొంచెం కష్టం. కవికర్ణ రసాయనంలోని పీఠికను బాగా పరిశీలిస్తే కవి ఆదర్శాలతోపాటు నిరాశా నిస్పృహలు గూడా కనిపిస్తాయి. నిరాశ చెందడం వల్లనే గాబోలు రాజనింద చేశాడు. రాజనిందకు వినియోగించిన ఒక సీస పద్యంలో గర్వము, నిరాదరణ, విచక్షణారాహిత్యము మొదలైన అవలక్షణాలు రాజుల్లో వుండడం వల్లనే వాళ్ళు అందరికీ సులభులుగారని చెప్పాడు. ఆధారం లేకున్నా లోక వ్యాప్తిలోని మోహనాంగి కథను కొంత విశ్వసిస్తే ఈ కవి రాయల ఆస్థాన ప్రవేశానికి నోచుకోక నిరాశపడినట్టు తెలుస్తుంది. ఇతడు చేసిన రాజనింద కృష్ణరాయలకు సంబంధించిందేనని కవి చరిత్రకారులు వ్రాశారు. ఇదే సబబుగా వుంది. మట్ల రామయ్య పేర్కొన్న భట్ట పరాశరుడు దాదాపు రాయలయుగం వాడే గాబట్టి ఇతడే నరసింహకవి గురువు.

ఇది వర్ణనా కావ్యమని, కథైక్యంలేదని చాలమంది ఊసడించారే గాని, ఇందులోని కావ్య సౌందర్యం దర్శించడానికి ప్రయత్నించ లేదు. ఈ కావ్య గొప్పతనాన్ని మొదట గుర్తించినవాడు దిగుమర్తి సీతారామస్వామిగారు. ఇందులోని ఆధునిక భావాలను గురించి వీరు 1949 నవంబరు భారతిలో ఒక వ్యాసం వ్రాశారు. అప్పటి నుండి ఈ కావ్యం పైన ఎవరూ దృష్టి సారించలేదు. చాలమంది విమర్శకులు కథా సంవిధానానికి, సౌందర్యానికి పతీకలుగా గ్రహించే కావ్యాల కంటె అన్ని విధాలా గొప్ప కావ్యమిది. ఈ కావ్యంలోని లోతులు చూడడానికిది సమయంగాదు. మరొక వ్యాసం అవసరం.

[ శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయానికి సమర్పించిన "కవికర్ణ రసాయన కావ్యానుశీలనము" అన్న నా సిద్ధాంత గ్రంథం (1978) నుండి ... ]

——— ०:०— — —

**Statement about Ownership and other particulars about newspaper**

**BHARATI**

Form IV (See Rule 8)

1. Place of Publication : Vijayawada
2. Periodicity of its Publication : Monthly
3. Printers Name : Sri S. Radhakrishna
   Whether citizen of India : Yes.
   Address : 8-2-322, Banjara Hills, Hyderabad-500 034.
4. Publisher's Name : Sri S. Radhakrishna
   Whether citizen of India : Yes
   Address : 8-2-322, Banjara Hills, Hyderabad-500 034.
5. Editor's Name : Sri S. Radhakrishna
   Whether citizen of India : Yes
   Adress : 8-2-322, Banjara Hills, Hyderabad-500 034.
6. Name - and address of individuals who own the newspaper and partners or share holders - holding more than one percent of the total capital :
   1. Name : S. Kamakshamma
      Address : 1, Luz Avenue, Mylapore, Madras-600 004.
   2. Name : S. Radhakrishna
      Address : 8-2-322, Banjara Hills, Hyderabad-500 034.
   3. Name : S. Nageswara Rao,
      Address : 1, Luz Avenue, Mylapore, Madras-600004
   4. Name : S. Rajeswari,
      Address : 8-2-322, Banjara Hills, Hyderabad-500 034.
   5. Name : S. Seshamma,
      Address : 1, Luz Avenue, Mylapore. Madras-600 004.
   6. Name : S. Sreeramamurty, Trustee, Kasinaduni Nageswarao, Sivalenka Sambu Prasad Dharma Nidhi.
      Address: 42/45, Luz Church Road, Mylapore, Madras-600 004.
   7. Name : Dr. P. S. N. Murthi
      Address: PO Yellamanchili, VizagDt.
   8. Name : S. Ramayamma
      Address : 1, Luz Avenue, Mylapore, Madras-600 004.
   9. Name : P. Satyanaryana
      Address : 183,184,RashtrapathiRoad, Secunderabad.
   10. Name : D. Subba Rao
      Address : 1, Luz Avenue, Mylapore, Madras-600 004.

I, S. Radhakrishna, hereby declare, that the particulars given above are true to the best of my knowledge and belief.

**S. Radhakrishna,**
1—3—81 Signature of Publisher.

శ్రీ విశ్వనాథం బత్తినేని

# మధ్యయుగంలో ఉన్నత విద్య

## ఒక సంగ్రహ చారిత్రక పరిశీలన

రోమన్ సామ్రాజ్యము పతనమయ్యాక గ్రీకులు నివసించే ప్రాంతమంతా బిజంటైన్ రాజ్యంగా ఏర్పడినది. లాటిన్ ప్రబలంగా నున్న పశ్చిమ భాగమంతా జర్మన్ జాతీయుల అధీనమైనది. పశ్చిమ ప్రాంతాలలో లాటిన్ – జర్మన్ సంస్కృతుల సంయోగం జరిగినప్పటికీ, రోమనుల సాంస్కృతిక, రాజకీయ, విద్యా వ్యవస్థలు జర్మన్ల కాలంలో బాగా దెబ్బతిన్నవి. 12వ శతాబ్దము వరకు ఈ వ్యవస్థలు తిరిగి కోలుకోలేదని చెప్పవలె. మధ్యధరా, తదితర తూర్పు ప్రాంతాలలో మాత్రము పాండిత్యం, విద్య బాగా వర్ధిల్లినవి.

అధ్యయన సౌలభ్యం కోసం, మధ్యయుగపు ఉన్నత విద్యను ప్రధానంగా రెండు కాలాల క్రింద విభజించటమైనది. (1) తొలి మధ్య యుగంలో ఉన్నత విద్య (2) తర్వాతి మధ్య యుగంలో ఉన్నత విద్య.

## I తొలి మధ్య యుగంలో ఉన్నతవిద్య

దీనిని మళ్లీ మూడుభాగాలుగా చేసి, ఈవ్యాసంలో వివరించడమైనది. అవి: (1) బిజంటైన్ రాజ్యంలో ఉన్నత విద్య. (2) ఇస్లామిక్ ప్రపంచంలో ఉన్నత విద్య. (3) క్రైస్తవ ప్రపంచంలో ఉన్నత విద్య.

## బిజంటైన్ రాజ్యంలో ఉన్నత విద్య

కాన్‌స్టాంటినోపుల్ బిజంటైన్ రాజ్యానికి రాజధాని. గ్రీకుల సంప్రదాయాలు, ఉన్నత విద్యా విధానం ఇక్కడ యథాతథంగా కొనసాగినవి. బిజంటైన్ ఉన్నత విద్యా చరిత్రకు సంబంధించి మనకు తగినన్ని ఆధారాలు లేవు.

క్రీ. శ. 425 లో 5 వ థియోడోసియస్ అనే రాజు ఉన్నత విద్యకు అధిక ప్రాధాన్య మిచ్చి, పోషించినట్లు ఆధారాలున్నవి. కాన్‌స్టాంటినోపుల్‌లో లాటిన్ భాషకు 3, లాటిన్ వ్యాకరణానికి 10, గ్రీక్ భాషకు 5, గ్రీక్ వ్యాకరణానికి 10 పీఠాలు నెలకొల్పి, తత్త్వ విచారంలో ఒక ఆచార్యునకు, న్యాయ శాస్త్రంలో ఇద్దరికి జీత భత్యాలను ఈ రాజు సమకూర్చినట్లు తెలుస్తున్నది. ఈ ఏర్పాట్లే తర్వాత పిలువబడ్డ కాన్‌స్టాంటినోపుల్ విశ్వవిద్యాలయమనే వ్యవస్థకు పునాదులైనవి. కాని ఇది ఎప్పుడు ఏర్పడింది ఖచ్చితంగా చెప్పడం కష్టం. 7వ శతాబ్దంలోని పాఠ్యప్రణాళికల్లో వ్యాకరణం, సాహిత్యం, తర్కం, అలంకారం, తత్త్వ విచారం, ఖగోళం, గణితం పేర్కొనబడినవి. క్రీ. శ. 863 లో విజ్ఞానశాస్త్రాలకు బాగా ప్రోత్సాహం లభ్యమైనది. క్రీ. శ. 1045 లో 9వ కాన్‌స్టాంటైన్ అనే రాజు ఈ విశ్వ విద్యాలయాన్ని న్యాయశాస్త్ర విభాగం, తత్త్వవిచార విభాగం అని రెండుగా విభజించినాడు. బాగా విద్యావంతులు, శిక్షితులు అయిన ప్రభుత్వోద్యోగులను పొందేటందుకు ఈ సంస్కరణ తెచ్చినట్లు చెప్పబడినది. మత విషయాల బోధనకు ఇక్కడ ప్రాముఖ్యత ఇవ్వలేదు. లాంఛనము, వ్యవస్థీకృతము అయినా విద్యాబోధన ఎల్లప్పుడూ జరగకపోయినా, 'లియో నైసిఫరోస్, ప్లిథాన్, బెస్సారియన్' మొదలైన మహా మేధావులు ఈ విశ్వవిద్యాలయంలో పనిచేసినట్లు ఆధారాలున్నవి.

## ఇస్లామిక్ ప్రపంచంలో ఉన్నత విద్య

7 వ శతాబ్దములో తురుష్కులు రంగ ప్రవేశం చేయడంతో, పూర్వ రోమన్ సామ్రాజ్యము మూడు ముక్కలైనది. అవి: (1) తూర్పు గ్రీక్ బిజంటైన్ ప్రాంతము (2) పశ్చిమ లాటిన్ జర్మన్ ప్రాంతము (3) అరేబియన్ ఇస్లామిక్ ప్రాంతము. ఒకప్పటి తూర్పు మధ్యధరా సంస్కృతులకు కేంద్రమైన అలెగ్జాండ్రియా, ఏంటియోక్, జెరుసలం, బెరూట్‌లు తురుష్కుల వశమైనవి. పర్షియన్ సామ్రాజ్యాన్ని, ఇంకా తూర్పుగా భారతదేశందాకాఉన్న ప్రాంతాలను హస్తగతం చేసుకొన్నారు. ఉత్తరఆఫ్రికాను, ఇంకా స్పెయిన్‌లో చాలా భూభాగాన్ని స్వాధీనం చేసుకొన్నారు. తురుష్కుల దండయాత్రల వలన, ప్రసిద్ధి కెక్కిన 'గొండెషాపూర్' పర్షియన్ అకాడమీతో సహా, హెలినిష్టిక్, బెజంటైన్ విద్యా కేంద్రాలన్నీ ఇస్లామిక్ ప్రపంచంలోకి వచ్చినవి.

ఉన్నతవిద్యకు సంబంధించి తురుష్కులు రెండు మంచిపనులు చేసారు. ఒకటి, అనువాదాలను ప్రోత్సహించడము; రెండు, అనేక స్వంత రచనలు చేయడం. 8–11 శతాబ్దాల మధ్య 'బాగ్దాద్'ను పాలించిన అబ్బాసిడ్ కాలిఫేట్స్‌కాలంలో 'సిరియనులు, పర్షియనులు, నెస్టోరియన్ క్రైస్తవులు' అనేక అనువాద రచనలు చేసారు. 9 వ శతాబ్దములో 'బాగ్దాద్' ఒక విజ్ఞాన కేంద్రమైనది. శాస్త్రాలు, 'తత్త్వ విచారం' ఇక్కడ చదవబడినవి. ఒక గ్రంథాలయం ఒక పరి

శిలక కేంద్రము దీనికి అనుబంధం చేయబడినవి. ఉత్తర ఆఫ్రికాలో బాగ్దాద్ మాదిరి విద్యా, పరిశోధనా కేంద్రాలెన్నో నెలకొల్పబడినవి. కైరోలో అల్‌అజర్, మొరాకాలో క్వారావీయిన్, ట్యునీషియాలో జైటౌనాలు కొన్ని ఉదాహరణలు. తురుష్క స్పెయిన్ నగరాలలోను, డెమాస్కస్, నైషాపూర్ మొదలైన తూర్పు నగరాలలోను ముఖ్య విద్యాకేంద్రా లెన్నింటినో నెలకొల్పారు.

తురుష్కుల మధ్య, తర్వాత వచ్చిన షియా — సున్నీ వివాదము వారి విద్యా సంస్థలపై కూడ ప్రభావం చూపినది. షియాలు మాత్రమే విజ్ఞాన శాస్త్రాలకు, గణితానికి ప్రాముఖ్యత ఇచ్చారు. మొత్తంమీద, ఇస్లామిక్ ప్రపంచం మధ్య యుగంలో అల్‌రజ్వీ, అల్ బెరూని, అల్‌ఫరాభి, ఇబన్‌సినా, ఇబన్ రుష్దాద్ మొదలైన మేధావు లను, శాస్త్రజ్ఞులను ఉత్పత్తిచేసినది. వీరు వైద్యం, తత్త్వవిచారం, ఖగోళ, భౌతిక శాస్త్రాలలో, అనువాద రచనలలో విశేషమైన కృషి సల్పినారు. ఈ తురుష్క మేధావుల ముందడుగు కృషి లేకుంటే, ఐరోపా దేశాలలో, ఆ తర్వాత వచ్చిన సాంస్కృతిక వైజ్ఞానిక విప్లవ మనేది బహుశః వచ్చి ఉండేది కాదేమో! వీరి అనువాదాలు, వ్యాఖ్యా నాలు ఊహాత్మక రచనలు, తర్వాత, ఐరోపా విశ్వవిద్యాలయాల పాఠ్య ప్రణాళికలకు పునాదిరాళ్ళు గావడం గమనార్హం.

## క్రైస్తవ ప్రపంచంలో ఉన్నత విద్య

పశ్చిమ ఐరోపా చరిత్రలో 11, 12, 13 శతాబ్దాలు పేర్కొనదగినవి. ఈ కాలంలోనే నగరీకరణం, వర్తకం, బైజంటైన్ — తురుష్క రాజ్యాల మధ్య సంబంధాలు, విద్యా సాంస్కృతిక కార్య కలాపాలు బాగా అభివృద్ధి చెందినవి. చర్చి ప్రాముఖ్యత పెరగడం, చర్చి అవసరాలకు, యోగ్యులైన చర్చి ఉద్యోగుల కోసం చార్ట్రెస్, లోన్, రీమ్సు, ఆర్లియన్స్, పారిస్ మొదలైన చర్చిపాఠశాలలు అనేకం వెలిసినవి. ఫలితంగా విజ్ఞానం పెరిగి, మహా కావ్యాలపట్ల జనంలో ఆసక్తి కలిగినది. శాస్త్రీయ పరిశోధనలో ప్రవేశం, రోమన్ న్యాయ శాస్త్రం పట్ల మోజు పెరిగినది. అంతర్జాతీయంగా చర్చి పాఠశాలలు విద్యార్థులను ఆకర్షించినవి.

ఐరోపా మధ్యయుగపు ఉన్నత విద్యలో వ్యాకరణం, తర్కం, భాషలు, అంక, రేఖా గణితాలు, ఖగోళ శాస్త్రం, సంగీతం అనే ఏడు ఉదారకళలు ముఖ్యభాగాలైనవి. మొదటి మూడుకళలను 'ట్రివియం' గాను చివరి నాల్గింటిని 'క్వాడీవియం'గాను పిలవడం ఆచారమైనది.

విశ్వవిద్యాలయమనే వ్యవస్థ అవతరణతో మధ్యయుగపు ఉన్నత విద్యకు ప్రాముఖ్యత పెరిగినది. ఉన్నత విద్యయొక్క ఆధునిక వ్యవస్థీ కృత స్వరూపమనేది మధ్యయుగపు ఐరోపా దేశాల కానుకే. ప్రాచీన నాగరికతల కాలంలో ఉన్నత విద్యా కేంద్రాలు బాగా వర్ధిల్లినప్పటికీ, నిర్ణీత పాఠ్య ప్రణాళిక, లాంఛనమైన పరీక్షా విధానం, వివిధ పాఠ్య విషయ విభాగాలు, పట్టాలు ప్రదానం చేయడం, మొదలైనవి ఈ మధ్యయుగపు కానుకలే.

పశ్చిమ ఐరోపాలో 12వ శతాబ్దములో తొలి విశ్వవిద్యా లయాలు ఆధునిక అర్థంలో అవతరించడము చాలా సహజంగా జరిగి నది. రాజులచేగాని, పోప్‌లచేగాని, మరేతర ధన స్వాములచేగాని ఇవి నెలకొల్పబడలేదు. అధ్యాపకుల—విద్యార్థుల సమస్యలకోసం ఒక రక్షిత వ్యవస్థ ఆవశ్యకత రీత్యా ఇవి ఏర్పడినవి.

'యూనివర్శిటీ' అనేది 'యూనివర్శిటాస్' అనే లాటిన్ పదం నుండి వచ్చినది. ఆదిలో 'యూనివర్శిటీ' అనగా ఒక 'స్టూడియం', ఒక కార్పొరేషన్, ఒక గిల్డ్, ఒక విద్యావంతుల సంఘము. వర్తకులు, చేతి పనివారలు సంఘాలు ఏర్పాటు చేసుకొన్నట్లే, దోపిడిదారుల, పెత్తందారుల నుండి రక్షణ కోసం; తిండి, బట్ట, వసతి మొదలైన అవసరాలకోసం విద్యార్థులు, అధ్యాపకులు సంఘాలు ఏర్పాటు చేసు కొన్నారు. అభ్యర్థులను పరీక్షించడం, బోధనా లైసెన్సులను అనగా డిగ్రీలను మంజూరు చేయడం మొదట్లో ఈ సంఘాల విధి. తర్వాత నిర్దిష్టమైన అవసరాలరీత్యా, నిర్ణీత పాఠ్య ప్రణాళికలు, పరీక్షలు, అర్హతలు నిర్ణయించే ప్రమాణాలు, పద్ధతులు వచ్చినవి. క్రమేణ ఈ సంఘాలు శాసనాత్మకములైనవి. కొన్ని ప్రత్యేకఅర్హతలు, హోదాలు, గౌరవాలు, ప్రతిష్ఠలు, మినహాయింపులు, సౌకర్యాలు సంతరించు కొన్నవి. ఒక వ్యవస్థీకృత నిర్మాణం పొందినవి. కళలు, వైద్యం, మతం, న్యాయం అనే నాలుగు అధ్యయన విషయాలకు కేంద్రాలైనవి. ఐతే మధ్యయుగపు ఈ విశ్వవిద్యాలయం భవనాల, ప్రయోగశాలల, గ్రంథాలయాల సముదాయం కాదు. బాగా చదువుకొన్న వ్యక్తుల యొక్క సమూహం మాత్రమే.

ఉన్నత విద్యకు సంబంధించి మధ్యయుగంలో ముఖ్యంగా రెండు రకాల వ్యవస్థీకృత నిర్మాణాలు అభివృద్ధి చెందినవి. అవి: (1) బొలొగ్నా నమూనా (2) పారిస్ నమూనా. ఐరోపా చరిత్రలో ఆ తర్వాత ఆవిర్భవించిన అనేక విద్యా కేంద్రాలు, వ్యవస్థలు ఈ రెండింటిలో ఏదో ఒక కోవకు చెందినవే. అందుచేత ఈ రెండు నమూనాలను గురించి వివరంగా తెల్సుకోవడం అవసరం.

### బొలొగ్నా నమూనా

ఇటలీలో ఒక విద్యాలయంగా బొలొగ్నా 11వ శతాబ్దములో ఏర్పడిందని చెబుతారు. న్యాయ శాస్త్రాల అధ్యయనాలకు ఇది ఒక కేంద్రంగా చాలా కాలం పనిచేసినది. ఐరోపా అన్ని ప్రాంతాల నుండి విద్యార్థులను ఆకర్షించినది. బొలొగ్నా సర్వ సమభావం గల ఒక పాఠశాల. ఇటలీకి చెందిన విద్యార్థు లందరు మొదట ఒక సంఘంగా ఏర్పడ్డారు. ఇతరప్రాంతాల విద్యార్థులంతా మరో సంఘాన్ని ఏర్పాటు చేసుకొన్నారు. ఈ రెండు రకాల విద్యార్థి సంఘాలే ఒక గిల్డ్‌గా, ఒక కార్పొరేషన్‌గా, ఒక యూనివర్శిటీగా ఏర్పడటమైనది. క్రమేణ ఇక్కడ విద్యార్థులు అనేక అధికారాలు, గౌరవాలను పొందారు. అధ్యా పకులు, ఏ వేళల్లో, ఏ విషయాన్ని, ఏ విధంగా బోధించాలో విద్యా ర్థులే నిర్ణయించేవారు. విశ్వ విద్యాలయ ప్రధాన కార్య నిర్వహణాధి కారి, 'రెక్టార్'ను తమలోనుండి విద్యార్థులే ఎన్నుకొనేవారు. అందుకే

బొలొగ్నా విశ్వవిద్యాలయం విద్యార్థుల సంఘంగా పరిగణించబడినది. తరువాత ఆచార్యులు తమ ప్రయోజనాలకోసం ఒక గిల్డ్‌ను ఏర్పాటు చేసుకొన్నారు. దానిని 'కాలేజి' అన్నారు. కాని ఇది విద్యార్థులయొక్క 'స్టూడియం' అంత శక్తివంతంగా పనిచేయలేదు.

బొలొగ్నా పాఠ్య ప్రణాళికలో న్యాయశాస్త్ర అధ్యయనం ముఖ్యమైనది. ఇతర ఇటాలియన్ విద్యాలయాలలో మతేతర న్యాయం, వైద్యం ముఖ్య విషయాలు. ఇటలీ, దక్షిణ ఫ్రాన్సు, స్పెయిన్‌లలో తర్వాత నెలకొల్పిన విశ్వవిద్యాలయాలన్నీ విద్యార్థుల ఆధిక్యత గల బొలొగ్నా నమూనాను పాటించినవి.

## పారిస్ నమూనా

మధ్యయుగపు విశ్వ విద్యాలయాలలో పారిస్ విశ్వవిద్యాలయం చాలా గొప్పది. బొలొగ్నావలె సహజంగా ఏర్పడి, 12వ శతాబ్దంలో అభివృద్ధి చెందినది. లాంఛనమైన పునాది ఏదీ దీనికి లేదు. ఒకప్పుడు పారిస్‌లో ఏర్పడ్డ చర్చి పాఠశాల యొక్క రూపాంతరమే ఇది. అబ్‌లార్డ్ మొదలగు అధ్యాపకుల కారణంగా పారిస్ పాఠశాల అన్ని ప్రాంతాల విద్యార్థులను ఆకర్షించి, అంతర్జాతీయంగా ప్రసిద్ధి కెక్కినది. క్రమేణ ఈ పాఠశాలే పారిస్ విశ్వవిద్యాలయమైనది.

అధ్యాపకులు తమ అవసరాలకోసం తమ హక్కులను, స్వేచ్ఛలను కాపాడుకొనేందుకు, బోధనా లైసెన్సుల మంజూరులను పర్యవేక్షించేటందుకు అంతా కలిసి 'యూనివర్శిటాస్'గా ఏర్పడ్డారు. ఉదార, మత విషయాలకు పారిస్ విశ్వవిద్యాలయం ప్రాధాన్యమిచ్చినది. ఉత్తర, పశ్చిమ, మధ్య ఐరోపాలో, ఆతర్వాత ఏర్పడ్డ విశ్వవిద్యాలయాలన్నీ పారిస్ నమూనాను పాటించినవి. ఆచార్యుల ఆధిక్యతగల విశ్వవిద్యాలయాలుగా రూపొందినవి.

బొలొగ్నా, పారిస్ విశ్వవిద్యాలయాల కోవకు చెందినదే ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయం. ఇది 12వ శతాబ్దంలో ఇంగ్లండులో ఏర్పడినది. దీనికెట్టి మూలపురుషుడు లేడు. ఇది కూడ సహజంగా పుట్టి పారిస్ నమూనాలో అభివృద్ధి పడినది. అధ్యాపకులు, విద్యార్థులు 'తరలిపోవడం' మూలంగా తర్వాత అనేక విశ్వవిద్యాలయాలు ఉత్పన్నమైనవి. అట్లా వచ్చినవే 1209 లో కేంబ్రిడ్జి, 1220 లో పాదువా, 1229 లో ఆర్లియన్స్ విశ్వవిద్యాలయాలు. ఆ తర్వాత పాపల్ డిక్రీ ద్వారా, పరిపాలకుల ద్వారా ఇతర విశ్వవిద్యాలయాలు ఏర్పడినవి. నేపుల్స్, వర్సైల్స్, లిస్బన్‌లు ఉదాహరణలు. 14,15 శతాబ్దాలు వచ్చేదాక, పవిత్ర రోమన్ సామ్రాజ్యంలోగాని, స్కాండినేవియాలోగాని, మధ్య ఐరోపాలోగాని విశ్వవిద్యాలయాలు స్థాపించబడలేదు.

తొలి విశ్వ విద్యాలయ ఉన్నత విద్యలో అన్ని వర్గాల వారికి ప్రవేశం ఇవ్వబడినది. ఉన్నత విద్య పూర్తి చేసిన విద్యార్థులు వివిధ వృత్తులను స్వీకరించేవారు. అధ్యాపక వృత్తికి మాత్రము ఎం. ఎ. డిగ్రీని అర్హతగా పరిగణించారు. బి. ఎ. చదవడానికి 3లేక 4సం॥లు, ఎం. ఎ. కి కూడ అంతేకాలం చదువు ఉండేది.

తొలి మధ్యయుగంలోనే 'కళాశాల' అనేది కూడ ఆవిర్భవించినది. ఆదిలో కళాశాల అంటే ఒక కేంద్రీయమైన వసతి గృహం. అవసరమైన విద్యార్థులకు వసతి భోజన సౌకర్యాలు ఇక్కడ కల్పించబడేవి. మొదట్లో ఇవి పారిస్, బొలొగ్నా, ఆక్స్‌ఫర్డ్, కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయాలలో నెలకొల్పబడినవి. క్రమేణ ఈ కళాశాలలు వసతి కేంద్రాలుగానే గాక బోధనా కేంద్రాలుగా కూడ అభివృద్ధి పడినవి.

మొత్తంమీద మధ్యయుగపు సాంస్కృతిక జీవనంలో ఈతొలి విశ్వవిద్యాలయాలు చాలా గొప్ప పాత్రను నిర్వహించినవి. ఎన్నోరకాల వైజ్ఞానిక దృక్పథాలకు ఇవి కేంద్రాలుగా పనిచేసినవి. వీటి నిర్వహణ కోసం మతాధిపతులు, రాజులు, ధనస్వాములు పోటీ పడటం వీటి ప్రత్యేక పాత్రకు నిదర్శనం.

# II తర్వాతి మధ్యయుగంలో ఉన్నతవిద్య

14 – 17 శతాబ్దాల మధ్య ఐరోపాలో అనేక మార్పులు వచ్చినవి. జనజీవనంలో తొలి మధ్యయుగపు లక్షణాలు క్రమేణ క్షీణించడం, 'రినైసన్స్' తలెత్తడం, క్రైస్తవ ప్రపంచం ప్రొటెస్టాంట్, కేథలిక్ అని రెండుగా చీలడం, సంస్కరణ, ప్రతికూల – సంస్కరణోద్యమాలు ఉత్పన్నం గావడం జరిగినవి.

ఈ కాలపు తొలి రోజుల్లో ఐరోపా సాంస్కృతిక వైజ్ఞానిక జీవనంలోను, చర్చిలో తలెత్తిన అంతః కలహాలను అంతం చేయడంలోను, పౌర జీవనంలో ప్రశాంతతను నెలకొల్పడంలోను మధ్యయుగపు తొలి విశ్వవిద్యాలయాలు. ముఖ్యంగా పారిస్ విశ్వవిద్యాలయం గణనీయమైన పాత్రను నిర్వహించినవి.

14, 15 శతాబ్దాలు ఐరోపాలో నూతన విశ్వ విద్యాలయాల స్థాపనకు ఎంతో ఫలవంతమైన కాలంగా పరిగణించబడినవి. పవిత్ర రోమన్ సామ్రాజ్యంలోను, మధ్య ఐరోపాలోను అనేక నూతన విశ్వవిద్యాలయాలు వెలిసినవి. వివిధ జాతీయ విద్యా కేంద్రాలు నెలకొల్పబడినవి. ప్రేగ్, వియన్నా, హైడిల్‌బర్గ్, ఎర్‌ఫర్ట్, బుడాపెస్ట్ మొదలైన ముఖ్య విద్యాలయాలనేకం పారిస్ నమూనాలో స్థాపించబడినవి. ఇవి విత్తవిషయాలకు సంబంధించి చర్చిమీద అధికంగా ఆధారపడినవి. తర్వాత ఫ్రాన్సులోను, స్పెయిన్‌లోను, ఇటలీలోను, అటుపైన స్కాట్‌లాండ్, డెన్మార్క్, స్విట్జర్లాండ్‌లోను క్రొత్తగా విశ్వవిద్యాలయాలు అవతరించినవి.

ఈ కాలం, ఉత్తర మధ్య ఐరోపాలలో తుది మధ్యయుగపు సాంస్కృతిక వికాసాన్ని చవిచూడటమేగాక, ఇటలీలో వైజ్ఞానిక విప్లవాన్ని కూడ దర్శించినది. ఇటాలియన్ రినైసన్స్ ప్రాచీన మహాకావ్యాల అధ్యయనానికి పునరుజ్జీవం కల్పించడమేగాక, ప్రాచీన ప్రపంచపు వైభవాల సముద్ధరణకు పునాదులు వేసినది. మానవీయ అధ్యయన విషయాలకు ఒక వెలుగు పట్టినది. భాషాతత్త్వంలోను, వాచక విమర్శలోను నూతన ఆసక్తిని పెంపొందించినది. క్రొత్తగా ఒక మేధావి వర్గాన్ని సృష్టించినది. ధనవంతుల, రాజుల మద్దతు ఈ

వర్గానికి లభింపజేసినది. పౌలో, ఫెల్ట్రే మొదలైన వారి నూతన విద్యా సిద్ధాంతాలకు ఒక స్థానం కల్పించినది. మానవీయ విషయాల ఆచార్యులను ఉత్పత్తి చేసినది. మానవీయ విషయాలకు, గ్రీక్ అధ్యయన విషయాలకు, ఇటాలియన్ విశ్వ విద్యాలయాలలో పీఠాలు ఏర్పాటు చేసినది. విద్యార్థుల, అధ్యాపకుల మైగ్రేషన్ కారణంగా ఇక్కడి రినైసన్స్ ఆదర్శాలు తర్వాత పలు ప్రాంతాలకు వ్యాపించినవి.

15వ శతాబ్ది చివరిలో, ఇటలీయేతర విశ్వవిద్యాలయా లన్నింటిలోను మానవీయ విషయాల అధ్యయనం ప్రారంభమైనది. అనేక విశ్వవిద్యాలయాలలో ప్రాచీన మహాకావ్యాల అధ్యయన కేంద్రాలు ఏర్పడినవి. 1530లో ఒకటవ ఫ్రాన్సిస్ అనే ఫ్రెంచిరాజు 'కాలేజ్ డి ఫ్రాన్సు' అనే సంస్థను నెలకొల్పి లాటిన్, గ్రీక్, హెబ్రూ, గణితాలలో పీఠాలు ఏర్పాటు చేసాడు.

'క్రిస్టియన్ రినైసన్స్' మానవీయ విద్యావేత్తలనే ఒకవర్గాన్ని సృష్టించినది. వీరిలో డెసిడరస్, ఎరాస్‌మస్ వీవ్స్, ఇలియట్ మొదలైనవారు ముఖ్యులు. 'ఉన్నత విద్యకు ప్రాచీన మహాకావ్యాల అధ్యయనం ఒక ఆధారమని' వీరు వక్కాణించారు. ఈ ఉద్బోధల ప్రభావం తర్వాత ఫ్రెంచి, జర్మన్, ఇంగ్లీష్ పాఠ్య ప్రణాళికల్లో స్పష్టంగా గోచరించినది. భాషలు, చరిత్ర, వ్యాయామ విద్య, ఉపన్యాసాల అధ్యయనం, మహాకావ్యాల అధ్యయనం ఈ ప్రణాళికల్లో ప్రధాన విషయాలైనవి. ఈ కాలంలోనే ముద్రణాయంత్రం కనుగొనబడటంతో, ఉన్నత విద్యారంగంలో బహు విప్లవాత్మక మార్పులు వచ్చినవి.

ఐతే 16 వ శతాబ్దములో వచ్చిన సంస్కరణోద్యమం విశ్వవిద్యాలయ విద్యను చావుదెబ్బ తీయడం జరిగినది. విశ్వవిద్యాలయాల స్వతంత్ర ప్రతిపత్తి, స్వయం వినిమాయకతలు బాగా దెబ్బతిన్నవి. ఆర్థికంగా కూడా బాగా బలహీనపడినవి. ఎడతెగని మత యుద్ధాలు ఉన్నత విద్యా కేంద్రాలపై, ముఖ్యంగా జర్మన్ కేంద్రాలపై గట్టి ప్రభావం చూపినవి. ఈ ఉద్యమం వలన, అనేక విశ్వవిద్యాలయాలు ప్రొటెస్టాంట్, కేథలిక్ అనబడే రెండు వర్గాలలో ఏదో ఒకదాని ఆధికృతకు లోబడి, ఆ వర్గ ప్రయోజనాలకు కేంద్రాలుగా పనిచేసినవి. పశ్చిమ దేశాల సాధారణ వైజ్ఞానిక సంప్రదాయాలను సంరక్షించే బదులు, అనేక మతాలను, వర్గాలను సృష్టించి వారిమధ్య విరోధాలను, వైషమ్యాలను పెంచడం జరిగినది. "ప్రభుత్వంమీద పెత్తనం ఎవరిదో మతంమీద పెత్తనం కూడ వారిదే" అనే సిద్ధాంత ఆధారంగా రెండు ముక్కలైన క్రైస్తవ ప్రపంచ ప్రభావానికి విశ్వవిద్యాలయాలు కూడ గురికావడమైనది.

కొన్ని ప్రొటెస్టాంటిజాన్ని, కొన్ని కేథలిజాన్ని, మరికొన్ని విశ్వవిద్యాలయాలు క్రొత్తగా ఉద్భవించే 'ఇజాల' ను పాటించినవి. ఈ మత కల్లోల కాలంలో కూడ నూతన విశ్వవిద్యాలయాలు వెలసినవి. స్పెయిన్ దేశంలో ఇవి ఎక్కువగా ఏర్పడినవి. కారణం, అప్పటి ఆ దేశంలోని స్వర్ణయుగమే.

క్రీ. శ. 1540 లో సెయింట్ ఇగ్నేషియస్ లయోల, జెసూయట్ ఉత్తర్వు ద్వారా, ప్రతికూల — సంస్కరణోద్యమం తేవడం వలన, రోమన్ కేథలిక్ దేశాలలో విశ్వవిద్యాలయాలు శీఘ్రంగా నిలదొక్కుకోగలిగినవి. "విద్య ద్వారానే మార్పు తేవచ్చు" అని జెసూయట్స్ ప్రచారం చేసారు. సెకండరీ, ఉన్నత విద్యలకు వీరు చాలా ప్రాముఖ్యత నిచ్చారు. తూర్పు, పశ్చిమ ఐరోపాలలో అనేక కళాశాలలను నెలకొల్పారు. విరోధులకు ఈర్ష్య కలిగే విధంగా ప్రతిభావంతులైన అధ్యాపకులను తయారు చేసారు. ట్రెంట్ కౌన్సిల్ డిక్రీల ద్వారా, మత గురువులకోసం శిక్షణా సంస్థలనేకం స్థాపించారు. దురదృష్టవశాత్తు ఇవి అనుకొన్నట్లు పనిచేయలేదు. ప్రొటెస్టాంట్, కేథలిక్ విద్యా సంస్థలనేకం గట్టి పోటీని కల్పించినవి. ఈ కారణం వలన వైజ్ఞానిక స్వేచ్ఛకు, భిన్నాభిప్రాయాల నివేదనకు సంబంధించిన వాతావరణమంతా ఎంతో కలుషితమైనది. మత విషయాలకు విశ్వవిద్యాలయాలన్నింటిలో అధికప్రాముఖ్యత ఇవ్వడంచేత, ఈకాలంలో శాస్త్రీయమైన పరిశోధనలకు తగిన మద్దతుగాని, ప్రోత్సాహంగాని లభించలేదు. మధ్యయుగపు చివరి రోజుల్లో ఉన్నత విద్య యావత్తు మత విషయాలతో, మతపరమైన వివాదాలతో ముడిపడిపోవడం చాలా శోచనీయం.

## సంప్రదించవలసిన గ్రంథములు

1 జె. ఎల్. డాలీ: ది మెడీవల్ యూనివర్సిటీ 1200-1400, న్యూయార్క్, షీడ్ ఎండ్ వార్డ్, 1961.

2 బి. డాడ్స్ : ముస్లిమ్ ఎడ్యుకేషన్ ఇన్ మెడీవల్ టయిమ్స్, వాషింగ్టన్, డి.సి., మిడిల్ ఈస్ట్ ఇన్‌స్టిట్యూట్, 1962.

3 బాయిడ్ ఎండ్ క్రైండ్ : ది హిస్టరీ ఆఫ్ వెస్టర్న్ ఎడ్యుకేషన్, న్యూయార్క్, బార్న్స్ ఎండ్ నోబల్, 1966.

4 ప్రెసెంట్ ఎండ్ ఫ్యూచర్ ఇన్ హయ్యర్ ఎడ్యుకేషన్, ఎడిటెడ్ బయి ఆర్. ఇ. బెల్ ఎండ్ ఎ. జె. యంగ్‌సన్, టావిస్టాక్ పబ్లికేషన్స్, లండన్, 1973.

5 డబ్ల్యు. హెచ్. వుడ్‌వార్డ్ : స్టడీస్ ఇన్ ఎడ్యుకేషన్ డ్యూరింగ్ ది ఏజ్ ఆఫ్ రినెయిసాన్స్ 1400-1600, కేంబ్రిడ్జ్ యూనివర్శిటీ ప్రెస్, ఇంగ్లండ్ 1924,

6 ది ఇంటర్నేషనల్ ఎన్‌సయిక్లోపీడియా ఆఫ్ హయ్యర్ ఎడ్యుకేషన్, ఎడిటెడ్ బై ఆసా ఎస్. నోల్స్, వాల్యుమ్ 5, జోస్సే—బాస్ పబ్లికేషన్స్, 1977.

---

# కొండలు

## చైతన్య

నా ముందుగా
ఎంతో దూరంలో
నిలిచి, నివసించే ఆ కొండలు
అదో ప్రత్యేక "లోకం"లా
అనిపిస్తాయి నాకు

ఆకాశపు నీలిమ క్రింద
వింత శయ్యలుగా పర్చుకొని
"నిశ్శబ్దాన్ని" తేటగీతిలా మీటుతూ
నిరీక్షిస్తుంటాయి తరచూ
అవి ఎవరికోసమో ...

ఆ శిఖరాగ్రాలమీద
పక్షి సంహతి విహరించినప్పుడల్లా
సారించిన నా కన్నులకదో
కనువిందు ...

వాటి మధ్యలోంచి
సూర్యు డస్తమిస్తుంటే
ఆ సౌందర్యంమీద
తమకం మీరిన నాలో
తుదిలేని
ఓ రసాభినివేశం !

ప్రభాతాన్నే
ఆకాశం కురిపించే
సన్నని తెల్లని
మంచు మేలి ముసుగుల్లో
ముఖాలు దాచుకొని
ఆదిత్యుని రాకతో
నీరెండలో
వాటి ఆకృతి
సాటిలేని
రమణీయ
దృశ్యకృతి !

# ఆంధ్రప్రదేశ్‌లో
# కరువు నివారణ సహాయ చర్యలు

ఈ సంవత్సరం ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోని అధిక భాగం తీవ్రమైన కరువుకు గురి అయింది. దుర్భిక్ష ప్రాంతాల్లో మంచినీరు, ఆహారం, పశుగ్రాసం, ఉపాధి సౌకర్యాలు కల్పించే బృహత్తరమైన సవాలును రాష్ట్రప్రభుత్వం విజయవంతంగా ఎదుర్కొంటున్నది.

## సహాయ కార్యక్రమాలలోని కొన్ని ముఖ్యాంశాలు :

* సహాయ కార్యక్రమాల నిమిత్తం రూ. 28.95 కోట్లు విడుదల చేశారు. ఈ మొత్తంలో రాయలసీమ జిల్లాలకు రూ. 10.80 కోట్లు, కోస్తా ఆంధ్ర జిల్లాలకు రూ. 3.15 కోట్లు విడుదల చేశారు.
* బోరింగ్ బావులు. కొత్తగా మామూలు బావుల త్రవ్వకం, మామూలు బావుల లోతు త్రవ్వకం, రక్షిత మంచినీటి సరఫరా పథకాలను అమలులోని చెరువుల ద్వారా నీటి రవాణా సౌకర్యాల నిమిత్తం 1881 మార్చి ఆఖరునాటికి రూ. 6.50 కోట్లు ఖర్చు చేస్తారు.
* బోరింగ్ బావుల త్రవ్వకానికి 200 లకు పైగా రిగ్గులు ఉపయోగిస్తున్నారు.
* మిగులు ప్రాంతాల నుంచి పశుగ్రాసం రవాణా చేయడం ద్వారా సమగ్ర పశుగ్రాసం సరఫరా పథకం అమలు, అటవీ ప్రాంత పశుగ్రాసం నిల్వల నిర్వహణ, డిపోల ద్వారా పశు గ్రాసం విక్రయం జరుపుతున్నారు. రైతులు పశుగ్రాసం పెంపకాన్ని చేపట్టే విధంగా ప్రోత్సాహం కల్పిస్తున్నారు. అనుబంధ ఆహారం సరఫరా వగైరా కార్యక్రమాలు అమలు జరుపుతున్నారు.
* బాధిత ప్రాంతాల్లో ఉపాధి కల్పనా పథకాలు అమలు జరుపుతున్నారు.
* వ్యవసాయ రుణాలు, ఇతర స్వల్పకాలిక రుణాల గడువు పునర్నిర్ణయించారు. కొత్తగా పంట రుణాలు మంజూరు చేస్తున్నారు.
* కరువు బాధిత జిల్లాలకు జాతీయ గ్రామీణ ఉపాధి కార్యక్రమం క్రింద 42,000 టన్నుల ఆహార ధాన్యాలు కేటాయించారు.

పరిస్థితిని గురించి రాష్ట్రప్రభుత్వానికి క్షుణ్ణంగా తెలుసు. కరువు బాధిత ప్రాంతాల్లో ప్రజలకు సహాయం అందజేస్తూ కరువు తీవ్రతను తట్టుకోవడానికి, అవసరమైన అన్ని చర్యలు తీసుకుంటున్నారు.

**సమాచార, పౌరసంబంధ శాఖ డైరక్టరుచే ప్రకటితం.**

**DIPR No. 10255/Advt./C1-3/81**

కీ. శే. వేలూరి శివరామశాస్త్రిగారు

# విభూతి తత్త్వము

జగత్తునకు పరమాత్మతోఁగల సంబంధము వెనుకటి ప్రకరణమున విచారింపఁబడినది. కాని దానినింకను దెలియవలసి వచ్చినచో విభూతి తత్త్వమును గూడ విచారించు టావశ్యకము.

విభూతి యనఁగా వైభవము,ఐశ్వర్యము, ఆవిర్భావము, వికాసము, సంపూర్ణమగు అభివ్యక్తి — ఈ మొదలయినది. గీతాకారుఁడు ప్రధానముగా నాలుగుచోట్ల ఈ విభూతిని గూర్చి చెప్పియున్నాఁడు.

సప్తమాధ్యాయమున ౭, ౮—౧౧ శ్లోకములు విభూతి విషయకములు. ఇవి తెలియుటకు వీని వెనుకటి నాలుగు శ్లోకములును తెలిసికొనవలయును. ఆ శ్లోకములందలి విషయ మిది :

నేల, నీరు, నిప్పు, గాలి, ఆకాశము, మనసు, బుద్ధి, అహంకారము ఈ యెనిమిదియు అపర ప్రకృతి. (౪) జగత్తును ధరించునదియు, జీవభూతమయినదియు పరప్రకృతి. ఈ రెండును భగవంతునివే. (౫) ఈ రెండు ప్రకృతులనుండి భూతములు పుట్టుచున్నవి. (౬) ఈ ప్రకృతులు భగవంతునిదే యగుటవలన భగవంతుఁడే జగతికి కారణమును, పైని ప్రలయమును.

ఏడవ శ్లోకము చివర రెండు చరణములలో భగవంతుఁ డిటులనుచున్నాఁడు—'దారమునందలి పూసలవలె నా యందివి యున్నవి.'

[ఇట్టి యుపమలు మహాభారతమునఁ గలవు. వన—౩౦-౨౬, శాంతి ౪౩—౨౦; ౨౦౬—౧ ఇత్యాది]

ఈపైనిఁగల నాలుగు శ్లోకములును విభూతి విషయకములు.

'ఓ కౌంతేయా! నీళ్లలో రసను నేను. చంద్ర సూర్యులలో కాంతి నేను. వేదములలో ప్రణవము నేను. ఆకాశమున శబ్దమును నేను. మానవులలో పౌరుషము నేను. (౮) నేలలో తావి నేను. సూర్యునిలో తేజస్సు నేను. భూతములలో జీవమేను. తాపసులలో తపస్సు నేను. (౯) భూతము లన్నింటికి బీజ మేను. బుద్ధిమంతులలో బుద్ధి నేను. తేజస్వులలో తేజస్సు నేను. (౧౦) బలవంతులలో కామరాగములు లేని బలమేను. ధర్మవిరుద్ధము కాని కామమేను.(౧౧)'

ఈ నాలుగును విభూతి విషయకములు. వీనిపై శ్లోకమిది :

'సాత్త్విక రాజసిక తామస భావములన్నియు నా వలననే కలిగెడివి. వానిలో నేను లేను. కాని అవి నా యందున్నవి. (౧౨)'

విభూతి శ్లోకములకు ముఖ్యార్థము చెప్పచో పరిణామవాదములోనికి దిగును. ఏలనఁగా భగవంతుఁడే రసము, కాంతి మొదలగు రూపములు తాల్చెనని చెప్పవలసి వచ్చును. కాని వెనుకటి నాలుగు శ్లోకములు, పదపటి నాలుగు శ్లోకములతో సరిపడవు. అపర ప్రకృతి, జడప్రకృతియని నాలుగయిదు శ్లోకములలో తేటతెల్లముగనే చెప్పఁబడెను. ఈ జడస్వరూపము జ్ఞాన స్వరూపమగు ఆత్మ కాదుగదా! ఏడవ శ్లోకమున దారము, పూసలు, వీని పోలికచే ఈ సముదాయమునకును ఆత్మకును భేదము చెప్పబడెను. దారమును పూసలును ఒకటి కావు. ఈ విషయానంతరమందే విభూతిశ్లోకములున్నవి. వీని సమనంతరమందే 'పరమాత్మ జగత్తులో లేఁడుకాని జగత్తు పరమాత్మలో నున్నదని చెప్పబడెను.' (౩—౧౨) ఈ రీతిగా విభూతి శ్లోకములకు పూర్వాపరములందు ద్వైతవాదము కనిపించుచున్నది. కాని విభూతి శ్లోకముల ముఖ్యార్థమో అద్వైతవాదము. ఇక వీనికి సామంజస్య మెటులు ? ఇక్కడ మూఁడు త్రోవలు త్రొక్కవచ్చును.

౧. విభూతి శ్లోకాంశమునకు గౌణార్థము చెప్పవచ్చును. ఆత్మమహిమచే జగదుత్పత్తి స్థితిలయములు కలుగును. ఆత్మావలంబనము లేనిదే ప్రకృతియేమియు చేయఁజాలదు. ప్రకృతి చేయునదెల్ల ఆత్మాశ్రయముననే. ఈ యర్థము చెప్పఁదలఁచి 'ఆత్మయే జలమందు రసమనియు, సూర్యచంద్రులలో కాంతియనియు' చెప్పవచ్చును.

౨. ఈ యధ్యాయమున ఆఱవశ్లోకము పిదప పండ్రెండవ శ్లోకమని కొందఱందురు. ఆఱవ శ్లోకమున—'పరాపర ప్రకృతుల నుండి భూతములు పొడుమును. (నా ప్రభావమువలననే ఇవి పొడముటవలన) నేనే వీనికి కారణము, ప్రలయము' అను నీ విషయమే పండ్రెండవ శ్లోకమునందలి మొదటి మూఁడు పాదములలో—'ఈ సకల సాత్త్విక రాజసిక తామస భావములు నా నుండియే పుట్టినవి' అని వ్యక్తమగుచున్నది.

పరమాత్మ వలననే సాక్షాత్తు భూతోత్పత్తి యగునని భ్రమను నివారించుటకు నాలుగవ పాదమున 'వానిలో నేను లేనుగాని అవి నాలో నున్నవి' అని ముగింపఁబడియెను.

పండ్రెండవ శ్లోకమును ఏడవ శ్లోకముగా చేయుచో అర్థమతి సరళ మగును. 'దారములో పూసలవలె' అను ఉపమగల ఏడవ శ్లోకము విభూతి విషయకములగు శ్లోకములను ౬, ౧౨ శ్లోకముల నడుమ నిఱికించుచో భావమునకు వ్యత్యయమును అర్థమున కసంగతియును కలుగును. కావున ఏడవ శ్లోకము మొదలుకొని పదునొకండవ శ్లోకము వఱకుఁగల వానిని ప్రక్షిప్తములనుట ఉచితము.

3. పై రెండు రీతులు యుక్తియుక్తములుకావని తోచుచో గీతలలో ఆత్మవిరుద్ధమయిన మతము చెప్పబడినదని అనవలసివచ్చును.

నవమాధ్యాయమున విభూతి శ్లోకములివి :

'క్రతువు, యజ్ఞము, స్వధ, ఔషధము, నేయి, నిప్పు, హోమము నేనే' (౯–౧౬)

'నేనే జగతికి తండ్రిని, తల్లిని, దాతను, తాతను. తెలియఁదగినవాఁడను నేనే. పవిత్రమగు ఓంకారము ఋక్కుసామము యజస్సు, గతి, భర్త, ప్రభువు, సాక్షి, నివాసము, శరణము, నెచ్చెలి, ప్రభవము; ప్రళయము, ఆధారము, నిదానము నేను. మఱియు నే నవ్యయుఁడను. (౧౩–౧౮)

'ఓ యర్జునా! నేనే వేడిమి కలుగఁజేయునది. నేనే వర్షించునది. నేనే నీరు లాగుకొనునది; అమృతము మృత్యువు, సత్తు అసత్తు, నేనే.' (౧౯)

వీని కన్నిటికి ముఖ్యార్థము చెప్పుచో పరమాత్మయే క్రత్వాది రూపముగా పరిణమించెనని చెప్పవలసి వచ్చుటవలన ప్రకృతి పరమాత్మల కేకత్వము చెప్పవలసివచ్చును. కాని గీతల మత మిదికాదు. ఇంకొకటి. ఆత్మ అవ్యయుఁడు, అవికారి. ముఖ్యార్థము చెప్పుచో ఆత్మ వికారి అనవలసివచ్చును. మఱియు ఆత్మ వేడిమి కలిగించు ననియు, నీరిని లాగుకొనుననియు, వర్షించుననియు పైని జెప్పబడెను; దీనిచే నిష్క్రియుఁడగు ఆత్మయందు కర్తృత్వ మారోపితమగును. కావున ఇచట గౌణార్థము చెప్పుటయే యుక్తియుక్తము.

ప్రకృతియే కార్యము చేయును. కాని ఆ ప్రకృతి ఆత్మాధీనము. కావున ప్రకృతి కార్యము ఆత్మ కారోపింపఁబడెను.

దశమాధ్యాయమున విభూతితత్త్వము విపులముగాఁ గలదు. ఈ విభూతి వర్ణనలో ఒక విశేషమున్నది. 'ఏ యే భావముగా భగవంతుని చింతింపవలెను?' అని అర్జునుఁ డడిగెను. దీనికే ప్రత్యుత్తరముగా భగవంతుఁడు విభూతి తత్త్వమును వివరించెను: ఇయ్యెడ భగవంతుని వాక్యములివి :

'ఓ గుడాకేశా! నేను అన్ని భూతముల అంతఃకరణమందున్న ఆత్మను, మఱియు నేనే భూతములకు మొదలు నడుమ తుద (౨౦)

'నేనాదిత్య గణములలో విష్ణువను. వెలుఁగులలో వేవెలుఁగును. మరుద్గణములలో మరీచిని. నక్షత్రములలో చంద్రుఁడను. (౨౧) ఇటుమీద ౧౮ శ్లోకములలో విభూతు లిటులనే వర్ణింపబడెను. మచ్చునకు గొన్ని—'వేదములలో నతఁడు సామము, రుద్రులలో నతఁడు

శంకరుఁడు, కొండలలో సుమేరువు, పురోహితులలో బృహస్పతి, స్థానములలో హిమాలయము, చెట్లలో రావిచెట్టు, గుఱ్ఱములలో ఉచ్చైః శ్రవము, ఏనుగులలో ఐరావతము, పాములలో వాసుకి, నాగులలో అనంతుఁడు, దైత్యులలో ప్రహ్లాదుఁడు, సమాసములలో ద్వంద్వసమాసము, ఋతువులలో వసంతము, కవులలో శుక్రాచార్యుడు'—ఈ మొ.

జగత్తులోఁగల వస్తువులను కొన్ని తరగతులుగా విభజింపవచ్చును. ఒకొక్క తరగతిలో లెక్కలేని వస్తువులుండును. ఒకొక్క తరగతిలోని మేలివస్తువుగా భగవంతుని భావన చేయవచ్చునని గీతాచార్యుఁడు చెప్పెను.

జగత్తులో నున్నదెల్లయు ఆత్మప్రభావముననే పుట్టి, ఆత్మనే ఆశ్రయించుకొని యుండుచున్నది. వస్తువులన్నియు భగవంతుని మహిమయని ఒక యర్థమున అనవచ్చును. కాని లోకదృష్టిలో ఒకటి యెక్కువ, ఇంకొకటి తక్కువ. వలఁతి వస్తువును ఊఁతగాఁగొని భగవంతుని మహిమ భావించినటులు అలఁతి వస్తువును ఊఁతఁగా గొని భగవంతుని మహిమ భావించుట అంత భావ్యముకాదు. దానఁ జేసి గీతాకారుఁడు—"జగత్రియం దేది దొడ్డదో ఆయా వస్తువునే ఈశ్వర రూపముగా చింతింపు"మని ఉపదేశించెను. ఇంతియకాక యిటులు చెప్పటతోపాటు ఈ మాటగూడ జోడించెను—'జగతిలోఁగల విభూతుల మొత్తముచేగూడ భగవంతుని సరిగా ననుభవము చేసికొనుటకు వీలులేదు. ఇదియంతయు అతని వెలుఁగులో ఒకపాలు.( ४०) భగవంతుఁ డొక పాలుచే ఈ జగత్తునంతయు తాల్చుచున్నాఁడు.

ఇదియే పదవ అధ్యాయమందలి విభూతితత్త్వము. భగవంతుఁడు నిక్కమునకు ఉచ్చైఃశ్రవము, ఐరావతము, రావిచెట్టు, ద్వంద్వసమాసము ఈ మొదలగున వేదియును కాఁడు. అలఁతి వస్తువు కన్న వలఁతి వస్తువే అతని మహిమను ఎలుగెత్తి చెప్పఁగలదు. కావున దొడ్డ వస్తువునే పరమాత్మ రూపముగా భావింప నుపదేశింపబడెను.

కావున విభూతితత్త్వము పరిణామవాదముకాదు. పరమాత్మ నుపాసించుట కిదియొక ఉపాయము మాత్రము.

పదునేనవ యధ్యాయమున విభూతిని గూర్చి భగవంతుఁ డిటులు చెప్పచున్నాఁడు. జగమునెల్ల వెలిగించు సూర్యుని తేజమును చంద్రుని తేజమును అగ్నితేజమును నాదిగా నెఱుగుము. (౧౨) నేను నేలను జొచ్చి బలముచే భూతముల ధరింతును. రసాత్మకమగు సోమమునయి ఓషధులనెల్ల పోషింతును. (౧౩) నేనే అగ్నినై ప్రాణుల దేహము చొచ్చితిని. ప్రాణాపానములఁ గలసి నలుఁదెఱఁగులగు అన్నమును పాకమునకుఁ దెత్తును. (౧४) నే నందఱ హృదయము లందుంటిని. నా వలన గుఱుతును ఎఱుకయు కలుగును. వాని లోపమును కలుగును. నేనే వేదము లన్నిటిచే నెఱుఁగఁదగువాఁడను. వేదాంతకర్తను వేదవేత్తను గూడ నేనే. (౧౫)

౭వ అధ్యాయమునందలి విభూతితత్త్వ విషయమునఁ జెప్పబడిన ముత్తోవలును ఇచటఁగూడఁ జూపవగును:

౧. గౌణార్థము చెప్పటయే లెస్స. ఆత్మప్రభావముచే ప్రకృతి కార్యము చేయుననను అర్థమును తెలుపుటకే ప్రకృతియందలి కర్తృత్వము ఆత్మయం దారోపితము.

౨. ఈ యంశము ప్రక్షిప్తము. ఇటులనుటకు ప్రబలమగు హేతువు కలదు. ఈ నాలుగు శ్లోకములతో పూర్వశ్లోకములకు సంబంధము లేదు. ఇంతియకాక విరోధముకూడఁ గలదు. 'ధ్యానాదులచే ప్రయత్నించు యోగులు ఆత్మను శరీర మధ్యమునందున్నవానిని జూతురు; యత్నము చేసియు అకృతాత్ములును అవివేకులును చూడలేరు' అను నీ పదునొకండవ శ్లోకము వెనువెంటనే 'సూర్యుని తేజ చంద్రుని తేజ అగ్నితేజ నాదియే' అను నీ పండ్రెండవ శ్లోకమునకు అర్థసంగతిలేదు.

౩. గీతలో ఆత్మవిరోధముండును. ఇయ్యెడ ఆత్మకు కర్తృత్వమును వికారమును అంగీకరింపఁబడెను. అంగీకరింపఁబడిన నేమని యందురా మఱొకచోట దీనికెదురుమతము కనఁబడును.

## ఉపసంహారము

గీతలలో నాలుగుచోటుల విభూతితత్త్వము విశేషముగాఁ జెప్పఁబడెను.వీనిలో రెండు తావులు ప్రక్షిప్తములని తోచును. కాని ౧౦వ అధ్యాయమునందలి విభూతితత్త్వముగూడ ప్రక్షిప్తమనుట కెట్టి సందియమున్నులేదు.

ముఖ్యార్థమును చెప్పచో పరిణామవాదమును ఈశ్వరునికి కర్తృత్వమును ఒప్పవలసి వచ్చును. కాని గీతల ఈశ్వరుఁ డవ్యయుఁడు నవికారియు నకర్తయును అయియున్నాఁడు కాన విభూత్యంశమున గౌణార్థము చెప్పచో విరోధములేక సమన్వితమగును.

కాని సాధకు లనేకులు ముఖ్యార్థమునే గ్రహించాలి. అర్థము చెప్పటలో తప్పు ఉండవచ్చును గాని దీనివలన చాల మేలుకలిగెను. గీతల పరమేశ్వరుఁ డవ్యక్తుఁడును, నిర్గుణుఁడును, విశ్వాతీతుఁడును. కాని మానవులుండిరే, వారెల్లపుడును కర్మశీలురుఁడును మంగళమూర్తియునగు పరమేశ్వరుని కోరుకొందురు. మానవులు అట్టివానినే ప్రియరూపముగను ప్రియతమ రూపముగను ఉపాసింపఁగలుగుదురు. అట్టివాఁడనఁగా ఎవడు ముఖ్యార్థముచే, సాక్షాద్భావముచే, తండ్రియో తల్లియో దాతయో భర్తయో నెచ్చెలియో అట్టివాడు. కాని గీతాకారుని మతమున 'పరమాత్మ అవ్యక్తము' అని నిక్కము. విభూతి గౌణము. ముఖ్యార్థమును గ్రహించుచో పరమాత్మను ప్రియతమ రూపముగా నుపాసింప వీలులేనపుడయినను మనుష్యునకు తప్పనిసరిగా గౌణార్థము గ్రహింపవలసి యుండును.



## ప్రచురణ ప్రచారయోగ్యమైన శ్లేష ప్రబంధం-రామకృష్ణోపాఖ్యానము

ఇటీవల మారేపల్లి రామచంద్రశాస్త్రిగారి రచనల కోసం అన్వేషిస్తూవుంటే వారి రచనలతోపాటు శిథిలావస్థలో వున్న ఈ ''రామకృష్ణోపాఖ్యానము'' అనే శ్లేష మహాప్రబంధం దొరికింది. రామాయణ భాగవతార్థాలతో మూడాశ్వాసాలలో. ఈ శ్లేష కావ్యం శ్రీ పాద వేంకటాచలకవిచేత వ్రాయబడింది. వేంకటాచలకవే ప్రౌఢ సుకవియైన లక్ష్మీపతి సాయంతో తన శ్లేష కావ్యానికి 'ఉభయకవి మనోరంజని' అనే వ్యాఖ్యానాన్ని స్వయంగా రాసుకున్నాడు. ఆశ్వాసాంత గద్య ఇలా వుంది—

''శ్రీ పద్మోద్భవ శంకర ప్రవిల సచ్ఛింహాద్రిరాడ్వేద్యక శ్రీ పాదాన్వయ వేంకటాచల కవి శ్రీమద్వచో గుంఫితోర్వీపాలా నిశపూజితాంధ్ర కవితా విద్యాస్ఫురద్రామ కృష్ణోపాఖ్యానమునందునాద్యమిది నా నొప్పారు నాశ్వాసమై''

అయితే వ్యాఖ్యానాశ్వాసాంతంలోని గద్య ఇలా వుంది — ''శ్రీమదశేష మనీషా విశేష మనీషి హృదయంగమ విరోధి గజసింహ సింహాద్రి వరాహ నరసింహ ప్రసాద సంలబ్ధచిత్ర స రసకవిత్వాతి పాత్ర కౌశికగోత్ర పవిత్ర శ్రీపాద లక్ష్మీపతి సూరి పౌత్ర బుచ్చ... సత్పుత్ర వేంకటాచలకవి మిత్ర ప్రణీతంబయిన రామకృష్ణోపాఖ్యానంబను శ్లేష మహాప్రబంధంబు వారణాశి సద్వంశజుండగు లక్ష్మీపతి సుకవి సహాయంబుగా తద్వేంకటాచలకవి మిత్ర విరచితంబయిన యుభయకవి మనోరంజని యను నిబంధనంబునందు ప్రథమాశ్వాసము''

ఈ లక్ష్మీపతి ప్రౌఢసుకవి అనీ, దుర్వారసరస సాహితీపూర్ణుడనీ, 'రామచరిత' అనే కావ్యాన్ని రచించాడనీ కావ్యారంభంలో తెలపబడింది. ఈ సవ్యాఖ్యాన శ్లేష ప్రబంధాన్ని పరవస్తు రంగాచార్య, భాగవతుల హరిశాస్త్రి, పోచనపెద్ది వెంకయ పండితుడు మొదలైన విద్వాంసులు పరిశీలించి నిర్దోషమని పలికినట్టు కూడా కవి రాసుకున్నాడు. కాబట్టి పరవస్తు రంగాచార్యులు, భాగవతుల హరిశాస్త్రిగార్ల ప్రస్తావనల బట్టి ఈ శ్లేష కావ్యం ఇటీవలదేననీ — అంటే వంద సంవత్సరాల లోపు కావ్యం అనీ—సుమారుగా 1880 -1930 లోపు అనీ చెప్పవచ్చునేమో !

కావ్యాంతంలో ప్రచురణ గురించి కూడా తెలుపబడింది—

''సరణి శేఖరమంత్రి దానప్ప తనయు
లప్పల నృసింహ నామకుడతనితమ్ము
డచ్చు గూర్చిరి కవితతి మౌనవనంగ
రామకృష్ణుల కథ అతి రమముగను''

''విన్నకోట కులజాడునై వెలయుచున్న
యప్పల నృసింహుడనెడి నైశ్వవరు శార
దా మకుటమనబడెడి ముద్రాక్షరాఖ్య
శాలనీ యచ్చుగూర్చిరి సరసులెన్న''

వేంకటాచలకవిమిత్రుని శైలి ఔచిత్యంతో కూడుకొని ఆలంకారిక రమణీయకతతో, రసామగుణమైన పదబంధంతో, చిత్ర కవితామార్గంలో దర్శనమిస్తుంది. వృత్తాలకంటె సీస, గీత పద్యాలు అధికంగా వాడబడ్డాయి. ఆతని కవితాశైలికి రెండు పద్యాల్ని తిలకించండి —

''ఖరచకిన్నర సముత్కర యశస్కర మహోత్కరణ
దుత్కట సముత్కల కలములు
తత జయధ్వని వదద్దశ హరిద్దవసమిద్ధ
సవోదితోద్దవోద్భవనినదము
పటు పరిస్ఫుట వియదటనటచ్చటులకే
తన పటపటత్కారములును
ప్రథితాప్సరో మిథః పృథునాట్య సమయ
మృదంగి ధిమిం ధిమిధ్వానములును

రాజియై మ్రోసె లోకవిద్రావణోగ్ర
సేన తనుజాత బలగర్వ మానితారి
పంక్తి గళనినవద్రక్త భరిత సింధు
రవ కలిత భావిసుర భేరి రణమనంగ''

''ఏల యీ రీతి ప్రేలెద విట్టి రిత్త
మాట లిటమీద ఖల్కకుమద్వర భుజ
శౌర్యలీలలు విను రణస్థలమునందు
సమయ జేయకయున్నె నిర్జర విరోధి''

కందగీత గర్భచంపకము, ద్విభాషా కందము, పుష్పమాలికా బంధము, చతుర్విధకందము మొదలైన చిత్రబంధ కవిత్వాలు వేంకటాచల కవిమిత్రుని పాండితీ పటిమకీ, ప్రతిభకీ నిదర్శనాలుగా కనబడతాయి. 'కందగీత గర్భచంపకము' పరిశీలించండి —

''సురనర పూజితా పరమశోభ రమాధవ భవ్యకాంతి భా
సుర పదనా మహామహిత సూరి జనస్తుత మంగళాత్మకా
వరగిరి ధారణా భువనవంద్య రసాధిప పుష్కరాక్ష దై
త్యరిపు హరా ఘనాఘన సమాకృతి రక్షితకాండజాతజా''

టీక కూడా పూర్వకవి ప్రయోగాలతో, లక్షణశాస్త్రాల్ని ఉదాహరిస్తూ రామాయణ భాగవతార్థాల్ని సమర్థవంతంగా బోధిస్తూ ప్రశంసాపూర్వకంగా వుంది. ఈ శ్లేష ప్రబంధాన్ని కొంత సంస్కరించి ప్రచురించటం సాహితీ తపస్యుల, అకాడెమీల కర్తవ్యం.

శ్రీ ద్వా. వా. శాస్త్రి

# శ్రీకృష్ణుడెప్పుడు జన్మించాడు ?

శ్రీకృష్ణుని జన్మతిథిని గురించి అభిప్రాయభేదాలున్నాయి. పండితులు పరిశీలింపగలరు. 'జియోసెంట్రిక్ ప్లానెటరి పొటెన్సి' అను గ్రంథంలో గోవిందు శ్రీరామమూర్తిగారు శ్రీకృష్ణుని జాతక చక్రమును వివరిస్తూ కృష్ణుడు శ్రావణ బహుళ అష్టమి రోహిణీ నక్షత్రంలో జన్మించినట్లు పేర్కొన్నారు. (డా. వింజమూరి—ఆంధ్ర జ్యోతి వారపత్రిక 12–9–1980)

### జ న్మ కు ం డ లి

కృష్ణుడు వృషభ లగ్నంలో అవతరించాడు.

| | | | |
|---|---|---|---|
| | | ల<br>చం | |
| రాహు<br>శ | రాశిచక్రం | | కు |
| | | | ర<br>బు<br>కే |
| | | గురు, శుక్ర | |

శ్రీ వి. ఏ. కె. అయ్యర్(భవన్స్ జర్నల్—27.8.1967) లో కొన్ని పురాణాలలో కృష్ణుడు ద్వాపరయుగాంతంలో భాద్రపద కృష్ణ అష్టమి (బుధవారం) రోహిణీ నక్షత్రం అర్ధరాత్రివేళ జన్మించాడని పేర్కొన్నారు. బ్రహ్మపురాణంలో "అథ భాద్రపదేమాసి కృష్ణాష్టమ్యాం కలౌయుగే, అష్టావింశతి మే జాతః కృష్ణోసౌ దేవకీ సుతః' కృష్ణుడు వైవస్వత మన్వంతరంలో కలి 647 సం॥న జన్మించాడు. రాజతరంగిణిలో "శతేషు షట్సు సార్ధేషు వ్యధికేషుచ భూతలే కలేర్గతేషు వర్షాణాం అభవన్ కురుపాండవాః" అని చెప్పబడింది.

కురు పాండవులు కలియుగారంభం తరువాత 653 సం॥న జన్మించారు. రాధాకాంతదేవుని అభిప్రాయం మేరకు కృష్ణార్జునులు ఏ మ వ య స్కు లు. కృష్ణుడు కలియుగం 657 సం॥వ జన్మించినట్లు వూహింపబడింది. క్రీ. శ. మేరకు శ్రీకృష్ణ జననము క్రీ. పూ. 2647 సం॥ అవుతుంది.

### శ్రీకృష్ణుని జాతక చక్రం




శ్రీ జానమద్ది హనుమచ్ఛాస్త్రి

# వచన కవితలో సూర్యుడు

మిత్రులు శ్రీ కొల్లూరి తెలుగు వచన కవిత్వంలో సూర్యుడు అనే విషయమ్మై ('సూర్యునిపై ధ్వజమెత్తిన కలాలు' సెప్టెంబర్ '80) వ్యాసం వ్రాసారు. ఆధునిక కవిత్వంలో సూర్యుని "వాడకం"పై శ్రీ నందిని సిధారెడ్డి కాబోలు పరిశోధిస్తున్నట్లు ఎక్కడో చదివాను.

వచన కవితలో సూర్యుణ్ణి వాడిన సందర్భాల్లో శ్రీ కొల్లూరి దృష్టిలో పడని వాటిని, నేను గమనించిన వాటిని మీముందు వుంచుతాను. ఈ విషయంలో సమగ్రత సాధించడంలో నా ప్రయత్నం కొంత సహకరిస్తుం దనుకొంటాను.

ఒక్క తెలుగు కవితలో అని ఏమిటి మొత్తం ప్రపంచ సాహిత్యంలోనే సూర్యుణ్ణి వేదననుండి, అజ్ఞానంనుండి, నిస్తబ్దతనుండి—విముక్తంచేసే అంశాలకు ప్రతీకగా వాడటం అనాదిగా ఆచారమే!

తన ఉదయంతో లోకంలో ఆవరించిన గాఢ తిమిరాన్ని సమూలంగా తుడిచిపెట్టి సమస్త జీవకోటికీ చైతన్యాన్ని ప్రసాదించే సూర్యునితో రోజూ కలిగే ప్రత్యక్షానుభవమే ప్రపంచ కవుల్ని, సూర్యుణ్ణి ఈ విధంగా వాడేట్టుచేసి వుంటుంది!... ఈ కారణంగానేగా ప్రపంచంలో అనేక జాతులు సూర్యుణ్ణి దేవుణ్ణి చేసుకున్నవి!

అఖిల జగానికీ 'చైతన్య' ప్రదాత అయిన సూర్యుడు—ప్రజా చైతన్యమే ప్రధానాశయంగా కలిగిందని చెబుతున్న ఆధునిక కవితలో, అందునా దాని ప్రధాన రూపమ్మైన వచన కవితలో ప్రబలంగా కనిపించడం సహజం!

సి. నా. రె. అసలు కవిత్వాన్నే సూర్యుడితోపోలుస్తూ రెండూ ఎప్పుడూ నిత్యనూతనమ్మైనవని అన్నారు. కవిత్వం ఉన్నంతకాలమూ

సూర్యుడు కవిత్వంలో వుంటూనే వుంటాడు...అంత మహత్తర ఉత్తేజాన్నిచ్చే సూర్యుణ్ణి స్పందనగల ఏ కవి నిర్లక్ష్యం చేయగలడు, ఏ కాలంలోనైనా!

తన బ్రతుకు బాధల్ని మధురమైన కవితలుగా లోకానికి అందించే కవిని దాశరథి ఒకచోట సూర్యుడితో పోలుస్తాడిలా-"ఉప్పు నీళ్ళ ఉదధిని తాగేసి, గొప్ప గొప్ప మేఘాల్ని సృష్టించి, అమృత జల ధారల్ని వర్షించే అర్కుడు నిజానికి అసలైన కవి."

వచన కవితకు ప్రాచుర్యం తెచ్చిన కుందుర్తి తన వచనకావ్యం "తెలంగాణా"లో సూర్యుణ్ని ఆనాటి 'సంఘం'తో పోల్చుతూ— "సంఘం సూర్యుడు సభల ఉపన్యాసాల మధ్యాహ్నాల్లో, మరీ ఎండ కాస్తున్నాడు దొరా!" అని పలికిస్తాడు.

ఉపమానాలలో గొప్ప వైచిత్రి కనబరిచే శ్రీ శేషేంద్రశర్మ ఒకచోట సూర్యుణ్ణి కాలంయొక్క హస్తంతో పోలుస్తారు యిలా— "లేస్తోంది ఉషఃకాంతుల్లోంచి, ఒక హస్తం, ఆ హస్తం కాలం అనే నిరంతర శ్రామికుడి సమస్తం." వీరికే మరోచోట సూర్యుడు "తూర్పు గుడిశెమీద, గొంతెత్తిన ఎర్రటి కోడిపుంజులా" కనిపిస్తాడు. సమాజంలోని వికృత పరిస్థితులకు కినిసి కవిత్వంలో అంద మైన వాటినిసైతం వికృతపరచడం సర్రియలిస్ట్ కవిత్వ లక్షణం. తెలుగు సాహిత్యంపై సర్రియలిజం ప్రభావం ఎప్పుడో ఆగిపోయినా, ఇంకా దాని ఛాయ ఆధునికుల్లో అప్పుడప్పుడూ కనిపిస్తూనే వుంది. శ్రీ శర్మ ఈ ధోరణిలోనే "ఇక్కడ సూర్యుడు, రోజా రాత్రుల గర్భంలోనించి, ముక్కూ మొహమూ లేని రక్తపిండంలా ఊడి పడు తూంటాడు" అంటాడు. మరోచోట శ్రీ శేషేంద్ర సూర్యుణ్ణి 'బాధ'తో పోల్చి యిలా అంటారు. "ఇవాళ ఒక బాధా సూర్యుడు అస్తమిస్తే, రేపు మరొక తీక్షణమైన బాధా సూర్యుడు ఉదయిస్తున్నాడు."

తెలుగు కవితాకాశంలోకి ఒక్కసారిగా తన "వెలుతురుపిట్ట"ల్ని ఎగరేసి అందరి దృష్టినీ ఆకట్టుకున్న శ్రీ కొత్తపల్లి సత్య శ్రీమన్నారాయణ సూర్యుణ్ణి 'సగం అరగదీసిన ఇందుపగింజ'తో పోల్చి అసాధారణమైన భావుకతని ప్రకటిస్తూ యిలా అంటారు-"సగం అరగ దీసిన ఇందుపకాయలా, సూర్యుడు పైకొస్తే, ఆకాశం తేరుకుం టుంది!" అవును మరి చీకటి బురదతొలగిపోయి...ఈ కవే మరోచోట మరో విచిత్రమైన వూహని సూర్యునిపరంగా చేశారు. "చీకటి కాకి, చుక్కల గుడ్లని రాత్రంతా పొదుగుతుంది...ఒకే ఒకటి సూర్య కోకిలం అవుతుంది." మరి మిగతా గుడ్లనుంచి వచ్చిన పిల్లలో?— అని మనం ప్రశ్నిస్తే అంటారు కదా ఈయన— "మిగిలినవన్నీ, కాకి పిల్లలై, చీకటి కాకితో ఎగిరిపోతాయి" అని.

సూర్యుణ్ణి చాలా విస్తృతంగా వాడే మరో యువకవి శ్రీ కె. శివారెడ్డి. ఈయన సూర్యోదయాన్ని— "ఈ రోజు, రాత్రి చీకటి కళ్ళకు, కాలం గోరింటాకు పెట్టింది, రేప్పొద్దుటికల్లా, సూర్యుడిగానే, పండి ఊరుకుంటాయి—ఎర్రగా" అంటారు. కవిగా వామపక్షీయుడైన శ్రీ రెడ్డి సూర్యుణ్ణి చైతన్యానికి ప్రతీకగా చెబుతూ—"శిథిలతమంచి, స్తబ్దతనుంచి, చీకటినుంచి, చచ్చిపోయిన నేను, నీలో బతికాను సూర్యుడూ" అంటారు. మరోచోట కూడా చైతన్యానికి సూర్యుణ్ణి ప్రతీకగా వాడుతూ "సూర్యుణ్ణి, భోంచేస్తే తప్ప, ఈ కళ్ళు ఉదయించేటట్టులేవు" అంటారు.

"కనపడుటలేదు" అనే కవితలో శ్రీ మానేపల్లి సూర్యుణ్ణి చమత్కారానికి వాడుకున్నారు. సూర్యుడిలోవుండే నల్లమచ్చకి వో వింత కారణం చెబుతా రీయన. కవికి రోడ్డుపక్క సూర్యుడిముక్క దొరి కిందట. దాన్ని చీకట్లో దోవ కనిపించడానికి ఉపయోగిస్తుందేమోనని చూసి, పనికి రాకపోయేసరికి పారేశాడట. తెల్లారాక ..."చూద్దును కదా, సూర్యుడిలో నల్లగా మచ్చ కనిపించింది, అప్పణ్ణించీ వెతుకు తూనే వున్నాను, ఆ ముక్క దొరికితే సూర్యుడి కిచ్చేద్దామని"—అని కవి వాపోతాడు.

కవితలో వివిధ భావాల్ని ఆవిష్కరించే దశలో కవి ఒక్కో వస్తువుని ఒక్కో దృష్టితో చూస్తాడు. శ్రీ మునిసుందరంకి "కాపాలికుని రక్తపూరిత కపాలంలా, కొండలమధ్య దిగులుగా సూర్యుడు" కనిపిస్తాడు.

ఇక, యిప్పుడు ఎక్కువగా వస్తోన్న మినీ కవితల్లో సైతం సూర్యుడు ముమ్మరంగానే ప్రకాశిస్తున్నాడు. శ్రీ సి. హెచ్. మధు "మూసివున్న నా కలం, రాత్రి లాంటిది, కలం తెరిస్తే, ఉదయ మౌతుంది, కాగితంమీద, సూర్యుళ్ళు జన్మిస్తారు" అంటారు. శ్రీ మద్దూరి లక్ష్మీనరసింహం "అసహనం ప్రజ్వరిల్లి వదనం కందిన, తూర్పుతల్లి, ప్రభాకరుని ప్రసవించింది" అని అంటున్నారు.

కాలక్రమేణా కవితలో రూపపరమైన, వస్తుపరమైన ఎన్ని మార్పులు వచ్చినప్పటికీ—కవితలో సూర్యుడు వుంటూనే వుంటాడు... కవిత్వం వున్నంతవరకూ!

**శ్రీ ఎన్. హన్మంత్రావ్**

## భారతీయ పశువైద్యశాస్త్ర పితామహుడు-శాలిహోత్రుడు

పశువైద్యమును గూర్చి మొట్టమొదట అథర్వవేదములో చెప్పబడినది. పశువులలో నులిపురుగుల నివారణకు అందు కొన్ని చికిత్సలు సూచించబడినవి.

మానవుడు చికిత్సా విధానాన్ని పశుపక్ష్యాదులనుండే గ్రహించె నని అథర్వవేదము స్పష్టపరుచుచున్నది. వేదకాలమునాటికే ప్రారంభ దశలోనున్న యీ పశువైద్యము అనంతర కాలమున విస్తరించి బృహత్ శాస్త్రమైనది. ఈ శాస్త్రగ్రంథము లన్నియు మహర్షులచేత, పేరెన్నికగన్న వైద్యులచేత రచింపబడినవి. ఈ శాస్త్రకారులలో శాలి హోత్రుడు ప్రథమగణ్యుడై భారతీయ పశువైద్య శాస్త్ర పితా మహుడైనాడు.

శాలిహోత్రుని జన్మస్థలముగాని కాలముగాని యిదమిత్థమని నిర్ణయించుటకు తగిన యాధారములు లభించలేదు. శాలిహోత్రుడు అశ్వఘోషుని కుమారుడని కొందరనిరి. ప్రముఖ వైద్య శాస్త్రకారుడగు సుశ్రుతునికి శాలిహోత్రుడు సమకాలికుడుగా కనబడుచున్నాడు. వీరిరువురికి గురుశిష్య సంబంధమును సూచించు ఈ క్రింది శ్లోక పాదము మద్రాసు ప్రభుత్వ ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములోని ఒక వైద్య గ్రంథ ప్రారంభమున గలదు.

''శాలిహోత్రం మునిశ్రేష్ఠం సుశ్రుతః పరిపృచ్ఛతి''

దీని ననుసరించి సుశ్రుతుడు శాలిహోత్రుని శిష్యుడుగా కనబడుచున్నాడు. ఇతను శాలిహోత్రుని యీ విధముగా కీర్తించెను.

''సర్వవేదాన్త విదుషం తపస్వీం వాగ్విదాం వరమ్
శాలిహోత్రమ్ ఋషిశ్రేష్ఠం............''

'సిద్ధ సంగ్రహ'మును రచించిన గణుడు శాలిహోత్రుని 'అశ్వాయుర్వేదనిధి'యని 'మహామతి'యని శ్లాఘించెను.

శాలిహోత్రుడు హిమాలయ గుహలలో నివసించెడివాడట. శాలిహోత్రుని గూర్చి యొక కథ హరిహర చతురంగమను సంస్కృత గ్రంథమున ఈ విధముగా కలదు.

''బ్రహ్మదేవుని సృష్టియాగమున శుభలక్షణ శోభితమై నాలుగు రెక్కలుగల తెల్లని ఉత్తమాశ్వము పుట్టి ఆకాశమున కెగిరినది. దానికి బ్రహ్మ 'నీవు సముద్రములో నివసింపు'మని శాపమిచ్చెను. దేవాసురులు సముద్ర మథనము జరిపినపుడు అది మరల జన్మించినది. దానిని రాక్షస చక్రవర్తియగు బలి వశపరచుకొని దేవతలనందరిని జయించెను. దేవతలు బ్రహ్మను జేరి తమకు కూడ ఒక ఉత్తమాశ్వమును ఇవ్వవలసినదిగా ప్రార్థించిరి. బ్రహ్మ వారి కిట్లనెను. 'ఓ దేవతలారా! దక్షయజ్ఞమున శుభలక్షణాన్వితములై నాలుగు రెక్కలుగల తెల్లని గుర్రములు జన్మించినవి. ఇవి దక్షాధ్వర ప్రాంతమున సంచరించుచు యజ్ఞసంభారములను నాశనము చేయుటతో దక్షుడు కోపించి రెక్కలు తెగునట్లుగా వాటికి శాపమిచ్చెను. అవి తమను అనుగ్రహించమని దక్షుని కోరినవి. దక్షుడు అశ్వమేధ యాగమువలన వాటికి పుణ్యలోక ప్రాప్తి కలుగునని అనుగ్రహించి, హిమాలయ గుహలలో నివసింపుడని చెప్పెను. అందువలన అవి ఇప్పుడు హిమాలయ గుహలలో గల శాలిహోత్ర మహర్షి ఆశ్రమ ప్రాంతమున గలవు. కనుక మీరా మహర్షి యనుగ్రహముతో వాటిని పొందు'డని చెప్పెను. దేవతలు శాలిహోత్ర మునిని ప్రార్థించగా శాలిహోత్రుడు ఆ గుర్రములను దేవతలకు, మనుష్యులకు పంచి యిచ్చెను. మానవులకిచ్చిన గుర్రముల వంశములోనివే ఇప్పుడు భూమిమీదగల గుర్రములు.''

అభినవచంద్రుడు రచించిన అశ్వశాస్త్రమను కన్నడ గ్రంథమున ఈ కథ ఇట్లున్నది.

''గుర్రములు నాలుగు విధములుగా పుట్టి తమ తమ రెక్కలతో సంచరించుచు లోకహింస చేయగా బ్రహ్మ తన యజ్ఞమున పుట్టిన శాలిహోత్రుని ఆ గుర్రములను శిక్షింపుమని కోరెను. శాలిహోత్రుడు మంత్రాక్షర బలముతో ఆ గుర్రముల రెక్కలను కత్తిరించి వాటిని దేవతల కప్పగించెను.''

అభినవచంద్రుడు శాలిహోత్రుని 'తురగ వ్యాపార కర్మకౌశలు'డని 'సకలశాస్త్ర విదు'డని, 'శాపానుగ్రహ సమర్థు'డని పేర్కొనెను.

అశ్వజాతిని శిక్షించుటకు, సంరక్షించుటకు శాలిహోత్రుడే ఆద్యుడని పై కథలు తెల్పుచున్నవి. ఈ శాలిహోత్రుడు బహుశః అనేకాశ్వమేధములు చేసి అశ్వ శరీర రచన, వికృతి విజ్ఞానము (Pathology) మొదలగువాని నధ్యయనము చేసి అశ్వశాస్త్రమును రచించియుండును. ఈతని రచన 'శాలిహోత్రీయము' ప్రపంచ ప్రసిద్ధిగన్న అశ్వశాస్త్రము. మొగలాయీ చక్రవర్తి షాజహాను చిత్తూర్ దండయాత్రలో ఈ బృహత్ గ్రంథమును సంపాదించి, దీనిని అరబీ భాషలోనికి తర్జుమా చేయించెను. 17వ శతాబ్ది పూర్వార్ధమున ఈ అరబీ గ్రంథము ఆంగ్లభాషలోనికి అనువదింపబడినది. ఈ ఆంగ్లానువాదప్రతులు ఒకటి బెర్లిన్ లైబ్రరీలోను, రెండవది లండన్ మ్యూజియములోను గలవని విద్వాంసులు వ్రాసిరి. 'అశ్వాయుర్వేదము' అనుపేర ఈ గ్రంథము టిబెట్ భాషలోనికి కూడ భాషాంతీకరించబడినది. ఈ విధముగా ప్రపంచ ఖ్యాతి నార్జించిన యీ భారతీయ శాస్త్రగ్రంథము ఇంతవరకు సమగ్రముగా ముద్రింపబడలేదు. అసలీ గ్రంథము సమగ్రముగా లభించుటలేదని విద్వాంసులు వ్రాసిరి.

మద్రాసు ప్రభుత్వ ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమునందు 'అశ్వచికిత్సాసారము' అనుపేర శాలిహోత్రుడు రచించిన ఎనిమిది అధ్యాయముల గ్రంథము తెలుగు వివరణతో గలదు. ఆ అధ్యాయ వివరణ మిది. (1) అశ్వపరీక్ష (2) వర్ణపరీక్ష (3) పుండ్ర, పుష్ప, గంధాది వర్ణనము (4) శుభాశుభవర్త విచారము (5) హయవయోజ్ఞానము (6) రేఖాయుర్జ్ఞానాది వర్ణనము (7) అశ్వపోషణవిధి (8) మర్మవిభాగము.

ఈ గ్రంథమున అధ్యాయముల చివర ఇట్లున్నది,

'ఇతి శాలిహోత్రీయే పరీక్షానామ ప్రథమోధ్యాయః'

తంజావూరు సరస్వతీ మహలులోని 'అశ్వాయుర్వేద సిద్ధయోగ సంగ్రహము', అశ్వశాన్తి విధానము; మైసూరు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములోని 'అశ్వశాస్త్రము', 'అశ్వలక్షణ శాస్త్రము'; జోధ్‌పూర్‌లోని రాజస్థాన్ ప్రాచ్య పరిశోధనాలయములో గల 'అశ్వచికిత్సాశాస్త్రము'; మద్రాసు ప్రభుత్వ ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములోని 'అశ్వచికిత్సా శాస్త్రము', 'అశ్వప్రశంస'; కాశీలోని కవీంద్రాచార్య గ్రంథాలయమున గల 'అశ్వహృదయము' శాలిహోత్రుని రచనలుగా ఉపలబ్ధమగుచున్నవి. వీటి నన్నిటిని పరిశీలించిన గాని శాలిహోత్రుని బృహద్గ్రంథము బయల్పడదు. కల్హణుడు శాలిహోత్రుని రచనను 'శాలిహోత్రసార సముచ్చయము' అనుపేర సంక్షిప్తీకరించెను.

'శాలిహోత్రీయము'ను నారయ ఆంధ్రీకరించెను గాని అది నేడు సమగ్రముగా లభించుటలేదు.

కాళిదాసుని రఘువంశములోని 5వ సర్గ 73వ శ్లోక వ్యాఖ్యానమున మల్లినాథుడు శాలిహోత్రుని 'సింధుయోగ సంగ్రహము' అను గ్రంథమును పేర్కొనెను. 'వాణీవిలాస వనమాలిక' అను తెనుగు గ్రంథమున శాలిహోత్రుడు గజశాస్త్ర రచయితగా పేర్కొనబడినాడు. ఇవికాక 'రైవత స్తోత్రము' అను గ్రంథమును కూడ శాలిహోత్రుడు రచించెనట.

'పూర్వగాథాలహరి'లో శాలిహోత్రుని గూర్చి ఇట్లు వ్రాయబడినది. "శాలిహోత్రుడుఒక ముని. ఇతఁడు తన ప్రభావముచేత నొక కొలనును, నొక చెట్టును సంపాదించెను. ఆ కొలను నీరు త్రావినచో నాఁకలియు దాహమునుండవు. ఆ చెట్టుక్రిందనుండిన వర్షమును ఎండయుఁ దగులవు. పాండవుల నీ ముని తన యాశ్రమమున గౌరవించి కొంతకాలముంచుకొని వారికి నీతి శాస్త్రముల బోధించెను."

పాండవులను గౌరవించిన యీ శాలిహోత్రుడును, శాలిహోత్రీయ రచయితయు భిన్నులైయుందురేమో.

'శాలిహోత్రము' అనగా పశువైద్య కళకు వాడుకపేరు అని వివరింపబడినది. భోజరాజు, జయదత్తుడు మొదలగువారు తాము రచించిన పశువైద్య శాస్త్రగ్రంథములకు 'శాలిహోత్రము' అని పేరిడిరి. అశోకుడు దేశమందంతటను పశువైద్యశాలలను స్థాపించి అందు పశువైద్యులను నియమించెను. వీరిని 'శాలిహోత్రు'లని పిలిచెడివారు.

ఈ విధముగా శాలిహోత్రుని పేరు భారతదేశములో పశువైద్య శాస్త్రమునకు పర్యాయపదమైనది. శాలిహోత్రుడు భారతీయ పశువైద్యశాస్త్ర పితామహుడైనాడు.

**శ్రీ సూర్యదేవర రవికుమార్**

# లేఖలు

## వచన పద్యం - భావ, పద గణాలు

నవంబరు 1980 'భారతి'లో శ్రీ వేముగంటి నరసింహాచార్యులుగారి (ఈ వ్యాసంలో ఇకమీద "వే.న. గారు") వ్రాసిన "వచన కవితకు లక్షణాలా..." అనే వ్యాసం చదివి,

శ్రీ వే. న.గారు శ్రీ కోవెల సంపత్కుమార, శ్రీచేకూరి రామారావుగార్ల జంట పాండిత్యంతో ప్రచురించిన "వచన పద్యం" గ్రంథాన్ని విమర్శించబూనడం మంచిదేకాని, శ్రీ వే. న. గారుపయోగించిన పరిభాష శిష్టం కాదు. ఉదాహరణకు: "అసందర్భం", "హాస్యాస్పదం" వంటివి. ఇంకా "ఆ పుస్తకం ('వచన పద్యం') వ్యాప్తిలోనికి రావలసిన అవసరమేముంది?", "దండగమారి రాత" వంటివి కూడా వున్నాయి వారి విమర్శలో. శ్రీ వే. న. గారికి "దండగమారి" మీద బహుప్రీతి. ఎందుకంటే వారి వ్యాసంలో "దండగమారి"ఎక్కువగా వస్తుంది. "అనుచితం", "అసందర్భం" "శోచనీయం"లు మస్తుగా వున్నాయి.

ఇంతకూ శ్రీ వే. న. గారి థీసీస్ ఏమిటి?

1. "వచన పద్యం" ప్రక్రియ లేదని.

2. భావ లేక పద గణాలు సరికాదని.

"వచన పద్యం" తప్పనీ, "వచన కవిత" సరియనీ అంటున్నారు.

"ఏలాంటి లక్షణాలకూ లోబడక, విలక్షణంగా స్వేచ్ఛగసాగుతూ ఉన్న వచన కవితకు కొందరు విమర్శకులు ఏవేవో లక్షణాలను ఆపాదించి దానిని మళ్లీ చట్రంతో బిగింపబూనడం అనవసరం, అసందర్భం, హాస్యాస్పదం" అంటారు. "స్వేచ్ఛగ" అనేది లక్షణంకాదా? "వెర్స్‌లిబర్" అంటే ఏమి? ఇదే కదా?

ఈనాడు ఆంధ్ర కవితా భాగీరథి మూడు పాయలుగ పద్య కవిత, గేయ కవిత, వచన కవితగ ప్రవహిస్తున్నదనీ, ఇది తిరుగులేని తత్వమనీ చివరన నిర్ధారించినారు శ్రీ వే. న. గారు.

కవిత్వాన్ని పద్యంలో, గేయంలో, వచనంలో చెప్పడం భగీరథుని కంటె ముందు నుండే వుండగా, ఈనాడు కొత్తగా వచ్చినట్లు చెప్పతున్నారు. ఋగ్వేదం పద్యం. యజుర్వేదం వచనం. సామ వేదం "సాంగు" (ఇంగ్లీషు పదం "సాంగ్" 'సామంగ్' నుండి వచ్చినదే.) అథర్వం ఉచ్చాటన. బసవేశ్వరుని "వచన"ములుండేది గద్యరూపంలో. చదివేది గేయ రీతిలో.

గణబద్ధం కాని రచన మూడు విధాలుగ వుంటుంది. వచనం (ప్రోస్), వచన – పద్యం (ప్రోస్ – పోయం) పద్య వచనం (పొయటిక్ – ప్రోస్). జోనాథన్ స్విఫ్ట్ ప్రోస్ వ్రాసినాడు. మాక్ఫర్సన్ మరియూ ఆస్కార్‌వైల్డ్ ప్రోస్ – పోయంలు వ్రాసినారు. సర్ థామస్ బ్రౌను, జెరిమిటేలర్, డీక్విన్సీ, వాల్టర్ పాటరు, జాన్ రస్కినులు పొయటిక్ – ప్రోస్ వ్రాసినారు. ఇంగ్లీషు బైబిలులోని "సాలమన్ పాట", "జాబ్ గ్రంథము" ప్రోస్ – పోయంలు. ఫ్రెంచి భాషలో 19వ శతాబ్దపు బాదలేర్ వచన పద్యాలు వ్రాసినాడు. ప్రకృతి వర్ణన శాస్త్రీయంగా చేసిన డార్విన్, థోరూలు పొయటిక్ ప్రోస్‌లో వ్రాసినారు. ఇక మన దేశ సాహిత్యం, బాణుని కాదంబరి, చిన్నయ సూరి నీతిచంద్రిక వచనరూప కవితలు - వచన కవితలు. సింహగిరినరహరి వచనములు, చిలుకూరి నారాయణరావు "శ్రీకృష్ణ జననం" వచన పద్యాలు ప్రతి దానినీ ఛందస్సులో చెప్పే దురభ్యాసం కల తెలుగు రచయితలు పొయటిక్ ప్రోస్ వ్రాయలేదనిపిస్తుంది. మున్నంగి...శర్మ, శివలెంక శంభుప్రసాద్, తిరుమల రామచంద్రగారల "పద చిత్రాలు" పొయటిక్ ప్రోస్‌లు. నవంబరు 1980 భారతిలోని వేగుంట మోహన ప్రసాద్ "బతికిన క్షణాలు"లో పొయటిక్ ప్రోస్ లక్షణాలున్నాయి. గిడుగు రామమూర్తి ప్రాఁదెనుఁగుకమ్మ వచన రూపంలో ఉన్న పద్యం– పద్య వచనం. రవీంద్రనాథటాగోరు మూల బెంగాలీ గీతాంజలి గేయం కాగా, ఆయనే ఆంగ్లీకరించిన ఇంగ్లీషు గీతాంజలి వచన పద్యంలో ఉంది. దీనికే (ఇంగ్లీషు కవిత్వం) నోబెల్ బహుమానం వచ్చింది. ప్రాచీన తెలుగు కవులు–ముఖ్యముగ నన్నయ

తిక్కనలు అక్కడక్కడ వ్రాసిన గద్యలలో పద్య భాగాలు ఇరుకుకొని వుంటాయని పండితు లందరికీ తెలిసిన విషయమే. డికెన్సు నవల ల్లోని వచనం హఠాత్తుగ పద్య రూపం దాల్చుతుందని విమర్శకుల పరిశీలన వలన తేలిన విషయము. వచనాన్ని పద్యంగా భాసించేటట్లు వ్రాయవలెనని వుండుట సహజాభిలాషే. కాని తిక్కన పద్యాలను వచ నాల వలె ధ్వనించేటట్లు వ్రాస్తాడు. ఒక మచ్చు :

సీ. తలపోసి చూడంగ ధర్మమయ్యె నధర్మ
మయ్యెనే ప్రాణ భయంబు కతన
నట్లు చేసితి, గృపయార స్వైరింపుము
(స్త్రీ పర్వం – ఆ. 1, ప. 157)

దీనిని గట్టిగా చదివి చూడండి. వచనం వలె వుంటుంది. తిక్కన పద్యాలలోని "ఎంజాంబ్‌మెంటు" (పూర్వ పంక్తిలోని వాక్యా క్షరములు తర్వాతి పంక్తిలోనికి చొచ్చుకొని వచ్చుట) వచన పద్యాల లోనూ వుంటుంది. పింగళి సూరన పద్యాలు గద్యం వలెనూ, గద్యం పద్యం వలెనూ వుంటాయి. భోజరాజీయములోని ఈ పద్యం చూచి వినండి :

చ॥ ధనరహితుండు, పుత్ర సముదాయ సమేతుడు, ఉపాయ శూన్య వ
ర్తనుదు, అరయంగ నా ద్విజుడు, తత్ప్రియభామయు బుద్ధిలేమి జీ
వన మొనరింపనేరదు ఇలువాడ నెఱుంగదు భాండ శుద్ధి లే
దనిశము పోరుచుండు, తదుపాత్త పురాకృత కర్మమో యనన్.

చిన్న చిన్న వాక్యాలు ఒకదాని తర్వాత ఒకటి గణబద్ధంగా అతుకబడినవి. మన ప్రాచీనకవులు వ్రాసే వచనాలకూ, వారే వ్రాయు పద్యాలకూ వాక్యవిన్యాసంలో భేదం వుంటుంది. వారి వచనం గొలుసు కట్టువలె అనంతంగా పోతూంటుంది. పద్యం చిన్న చిన్న వాక్యాలుగా వుంటుంది. ఈనాడు మనం వాడే గద్య నిర్మాణం ప్రాచీనుల పద్య నిర్మాణానికి సరిపోతుంది.

"వచన పద్యం" రూపం లేదని చెప్పడానికి వీలులేదు. అది నేడుండడమేకాక ప్రాచీన కాలం నుండీ వున్నది. ఏపంచ 19వ శతాబ్దం నుంచీ యూరోపులోనూ, గత 50 సంవత్సరముల నుండీ మనదేశంలోనూ ప్రాచుర్యానికి వచ్చింది. అందుకే కోవెలవారి వాదంలో సామంజస్యముంది. ఒక ప్రక్రియ ఉందంటే దాని స్వరూప స్వభావాలను నిర్వచింప బూనడం శాస్త్రీయ దృక్పథం. వారెంతవరకు కృతకృత్యులైనారనేది వేరేమాట.

శ్రీ వే. న. గారు ప్రశ్నించిన "తూగు", భావగణాలు, పద గణాల గురించి చెప్పతాను. తూగు అనేది అన్ని రకాలైన కవితా ప్రక్రియల్లోనూ వుంటుంది. శ్రీనాథుని "సీసాలు" ప్రసిద్ధి కావడానికి కారణం వానిలోని తూగే తూగుకు సాంప్రదాయ ఛందస్సులో వ్రాయ బడ్డ కావ్యంనుండి ఒక వుదాహరణ ఇస్తున్నాను.

ఉదా 1. రమ్మనినాడు తండ్రియని రాదనకుండగరాదు, నాదు
కర్జమ్మును మెచ్చినాడనగ రాదనకుండగరాదు, నాకు
కార్యమ్మునుఁ జూపినాడనఁగ రాదనకుండగరాదు

ఉదా 2. ఉన్నది చేత శస్త్రము అదియుం బదనైనది
లోనఁ బౌరుషంబున్నది మొక్కవోక యదియుం బదనైనది
వెంట మార్బలంబున్నది మున్నుదూక యదియుం బదనైనది
(శివ భారతము)

వేమన "అత్థవిళదు" (ఆటవెలది) లలో తూగు వుండును.

కోవెలవారి భావ గణాలూ, రావి రంగారావుగారి పద గణాలూ ఒకటే. వారు జటిలమైన లక్షణాలను చెప్పతూ సరైన లక్ష్యాలీయక విమర్శకు పాలవుతున్నారు కానీ, సకల విధ వాక్య ఛందో నిర్మాణాలలో ఈ భావ/పదగణాలే వుంటాయి. ఆ మాటకువస్తే ఈ భావ/పద గణాల ప్రాబల్యం మార్గచ్ఛందస్సులోనే ఎక్కువ అనిపిస్తుంది. ఇంతకుముందు ఉదాహరించిన 'ధన రహితుండు' పద్యమే తీసికొం దాము. ఇది చంపకమాల నజభజజజర. ఈ మాత్రా గణాలప్రకారం పద్యం చదివితే 'రామునితోక పివరుండిట్లనియె' వలె వుంటుంది. ఆ పద్యాన్ని భావ/పద గణాలబట్టియే చదువవలెను. అటులనే ఎర్రా ప్రెగడ పద్యం

"ఒండు పోదము లెండు వేగను" మత్తకోకిల ఛందస్సులో వుండే ఈ పద్యాన్ని మాత్రాగణాలబట్టి కాకుండా భావ/పదగణాల బట్టియే చదువవలెను. నేనేదో అనుకూలమైన వుదాహరణలను ఎన్ను కొనడం లేదండి. ఏ పద్యమైనా భావ/పదగణాల ప్రకారమే చదువ వలసి వుంటుంది. తిక్కన కవిత్వం అర్థం కావడం కష్టం ఎందు కంటే ఆయన రచన భావ/పదగణ భరితము. ఆయన పద్యాలలో మాత్రాగణాలు రూపు మాసిపోతాయి. పదముల విరుపులతో చదివితే కాని అర్థంకావు. అట్లు చదివితే ఛందస్సు ఉందా అనిపించేటట్లవు తుంది. నన్నయభట్టు ఉత్పలమాలల్లో పాదం తర్వాతి భాగాల్లో కరమ్ము నిజమ్ము భయమ్ము అని జగణాలే వస్తూంటాయి. ఇవి భావ/ పద గణాలే. ఉత్పలమాలలో జగణాలు లేవు. తిక్కన కందానికీ, శ్రీనాథుడు సీసానికీ ప్రసిద్ధికావడం వా రాయా ఛందస్సులలో చూపే భావ/పద గణాల పనితనమే. దీనివలన వారి ఆ ఛందస్సులలోని పద్యా లలో తూగు, లయ, వైవిధ్యమూ ఉంటాయి. "దించు లంగరు దీర్ఘయుద్ధము", "గుత్తునా ముత్యాల సరములు" ఒకే మాత్రా గణాల్లో వున్నా వాటి భావ/పదగణాలు వేర్వేరు. మాత్రాగణాలు పద్య స్వరూపాన్ని స్థాపిస్తాయి. భావ/పదగణాలు పద్య స్వభావాన్నీ, అర్థ వత్తనూ నిర్ణయిస్తాయి.

తి.

# 'భగ్వాన్'కు ఉత్తరం

1980 నవంబరు, భారతి కలగూరగంపలో శ్రీ భగ్వాన్‌గారి అభిప్రాయాలు చదివాను.

"భారతిలోని కవితలు కవులకు, పండితులకు అర్థంగావచ్చును. కాని సామాన్యులకు అర్థం గావడంలో ఆవగింజంతైనా అతిశయోక్తి లేదు" అన్నారు భగ్వాన్‌గారు. ఇంకా వారు సమాజానికి ఉపయోగ

పడేవి, ఉపయోగపడనివి అని పట్టికలిచ్చారు. దీనివలన ఈ క్రింది సందేహాలు ఉత్పన్నమౌతాయి.

1. భారతిలోని కవితలు అర్థం కావా ?

2. సామాన్యులంటే ఎవరు? కవిత్వం సామాన్యులకోసమేనా?

3. కవిత్వ ప్రయోజన మేమిటి ?

ప్రస్తుతం పై మూడంశాల్ని చర్చిద్దాము.

## అర్థం కావు

అన్న భగ్వాన్‌గారి అభిప్రాయంతో నేను కూడ ఏకీభవిస్తున్నాను. అయితే వారు కేవలం శాబ్దికంగానే పరిశీలించినట్లుంది. అర్థం రీతిగా కూడ అవి సమన్వయం కావు. అట్టివి కొన్ని ఉదాహరణలుగా నిస్తాను.

నాటి ప్రబంధాలను కనీసము నిఘంటు సాయముతోనైన అర్థం చేసుకోవచ్చును. కాని నేటి వచన కవితలలో అర్థం కాని పదమంటూ ఏమీ ఉండకపోయినను అర్థంకావు. ఇదేమి వైపరీత్యమో. అయితే అందరి వచన కవితలు అర్థంకావని కాదు. కొందరి కవితలు అర్థంకాని కోవకు చెందుతాయి.

''ఏమిటి చేతిలో
కనబడడం లేదా ? కాలం కుంచె
అయితే ప్రమాదమే.
వచ్చేయి నాతో ఆ రేవుదాక.''

అని పునర్జన్మ కవితా ఖండిక (మే '80 భారతి)లో శ్రీ చంద్రగారు వ్రాశారు. ఇందు చీకటి తుఫాను, కాలం కుంచె ఏమిటో, చేతిలోనిది కాలం కుంచె అయితే వచ్చే ప్రమాదమేమిటో అగమ్యగోచరం.

ఈ కాగితాలు — సిరాతో నిండిపోయాయి.
నా మనసులో — ఒక్క గీతకూడ లేదు.
ఆకాశాన్ని అంటుకోవాలనుకొంటున్న
సరుగుడు చెట్లను చూస్తే
ఈ గాలి కెందుకింత కోసమో ?

అని అదే భారతిలో ఖాసిం యూసుఫీ వాపోయారు. ఇందు సిరాతో నిండిన కాగితాలకు, ఆకాశాన్నంటే సరుగుడు చెట్లకు గల సంబంధ సామ్యమేదో, ఈ కవితకు (లక్ష్యార్థమో, వ్యంగ్యార్థమో) అర్థమేమిటో విజ్ఞులే పరిశీలించాలి.

సెప్టెంబర్ '80 భారతిలోని సాంధ్యశ్రీగారి 'బంధ విముక్తి' కవిత ఇలా ఉంది.

కల—కల్పవృక్షంలా ఎదిగి
పుప్పొడి చినుకుల దుప్పటిలో
పూలను దాచుకున్నచోట
నేనూ ఒక పూవునై……

శిల — శిల్పబుుక్షంగా ఒదిగి
ఉరి తాకని ఎదలోతుల లోయలలో
తళుకు పరుచుకొన్నచోట
నేనూ ఒక తళుకునై……

ఏం చేయాలనుకున్నాడు కవి ? ఈ కవితా ఖండికలోని పుప్పొడి చినుకులు, శిల్పబుుక్షము రచయితకే తెలుసు కాని పాఠకుడి ఊహకందవు. అసంపూర్ణ వాక్యనిర్మాణంతో రచిస్తే కవి ఉద్దేశము పాఠకులకెలా అందుతుంది ? అసలు కవి ఉద్దేశానికి భిన్నంగా కూడ భావించడానికి పై కవిత తావిస్తుంది. కీ॥ శే॥ కృష్ణశాస్త్రిగారి ''ఆకులలో ఆకునై, పూవులో పూవునై'' అనేదానికి దేహాంతర తుల్య సంవాదంగా నున్నప్పటికి అందలి భావస్ఫూర్తి, వాక్య నిర్మాణ స్పష్టత ఇందు లోపించినవి.

## సామాన్యు డెవడు ?

''సామాన్యు'' లంటే వీరి దృష్టిలో ఎవరు ? రచనలు చేయలేకపోయినను రచనను చదివి రసాస్వాదన చేయగల్గిన అదృష్టవంతులా ? లేక S. S. C. ఫేలయి జీవితంలో స్థిరపడినవారా ? లేక అక్షరమ్ముక్క రాక మందిచేత ఉత్తరాలు వ్రాయించి, చదివించుకునే కూలీలా ? ఎవరు సామాన్యులు? ఈ సామాన్యులంటే ఎవరో ? వారి స్థాయి ఏమిటో సుస్పష్టంగా, గీత గీసినటుల నిర్వచనమిస్తే బాగుంటుందని భావిస్తున్నాను. దీనికి భగ్వాన్‌గారుగాని, మరే విమర్శకుడైన పూనుకొన వలసిందిగా కోరుతున్నాను.

అసలు కవిత్వం సామాన్యుల కోసమేనా ? అంటే సామాన్యుల చిత్రించాలనా? లేక సామాన్యులు మాత్రమే పఠించాలనా? నాదృష్టిలో కవిత్వమనేదెప్పుడు ''సామాన్యుల కోసం'' కాదు. సామాన్యుల కోసమే అయితే వాని జీవితంలో కవిత్వమును చదవడానికి వినియోగింపబడు కాలమెంత ? విలాసాలు, అలంకారాలు సామాన్యులకక్కరలేదా ? ఫ్యాన్సీ సరుకులు, పాలిస్టర్ బట్టల ధరలు దింపరేమిటి ? బంగారు ధర మండిపోవలసిందేనా ? కవిత్వం చదివినా చదవకపోయినా సామాన్యులకు (అసామాన్యులకు కూడ) కొంపలంటుకపోవు. కాని చక్కెర ధర మాటేమిటి ? తెలుగు పుస్తకాల ధరలు ఎంతమంది సామాన్యుల కందుబాటులో నున్నాయి ? ప్రచురింపబడిన పరిశోధనా గ్రంథములను కనీసం మనం తేరిపార చూడడానికైనా వీలు కల్పిస్తున్నాయా ? వాటి మూల్యములు ?

ఇవేవీ సామాన్యులకు పట్టనివి. కేవలం కవిత్వమొక్కటే సామాన్యులకు కావలసివచ్చింది. మీరెంత ''సామాన్యుల కోసం కవిత'' అని లాక్షణిక సూత్రాల నిర్దేశించినా, దాని ప్రకారం కవితలు వ్రాసినా చివరికి నాటిని చదవాల్సింది, చదివి ప్రయోజనం పొందాల్సింది విద్యావంతులేనన్న నిజాన్ని నిర్భయంగా మనం అంగీకరించక తప్పదు.

## కవిత్వ ప్రయోజన మేమిటి ?

''కవిత్వాన్ని సమాజం కోసం వ్రాసినవి, సమాజానికి ప్రయోజనం చేకూర్చేవి'' అని రెండు రకాలుగా విభజించి వీరు భారతిలో పడిన కొన్ని కవితలను నిరసించారు.

అసలు సామాజిక ప్రయోజన మేమిటో ? అది పూర్వ లాక్షణికులు చెప్పిన ప్రయోజనమో, లేక ఆధునికులు వాంఛించే ప్రయోజనమో తెల్సుకోవలసియుంది మనం. విశ్వశ్రేయః కావ్య మన్నారు. సంఘంలోని ఏకొందరినో ఉద్ధరించడం విశ్వశ్రేయ మెలా అవుతుంది ? క్రాంతి అవుతుంది తప్ప. ఇంతకు కవిత్వాన్ని సామాజికాభివృద్ధికి పనిముట్టుగా వాడక తప్పదా? ''పట్టండి తుపాకీ'' అని పేదలను ప్రబోధిస్తూ, పేదలపై జాలిచూపండని ధనికుల నర్థిస్తూ రెండు రకాలుగా కవితలు సృజిస్తే ఎలా ఉంటుంది ? ఒకేవైపు నుండి ఫోర్స్ రావాలి కాని.

కావ్యం యశసేఽర్థకృతే
వ్యవహార విదే శివేతరక్షతయే ।
సద్యః పర నిర్వృతయే
కాంతా సమ్మితతయోపదేశయుజే''

అని మమ్మటుడు కావ్యప్రయోజనాన్ని పేర్కొన్నాడు. కావ్యరచన (అది పద్యం కానీండి, గద్యం కానీండి) వలన కవికి యశస్సు కల్గాలి. మరి చదివిన పాఠకుడికి లోకవ్యవహారజ్ఞానం, అమంగళ పరిహారం, సద్యః పర నిర్వృతి కల్గాలి. కాంతా సమ్మితమైన ఉపదేశముండాలి. మరి నేటి కవితలు కాని నాటి కవితలు కాని పైన పేర్కొన్నవన్నింటినీ సాధిస్తవని భావంకాదు. పైవన్ని సాధించడానికి కవి తన చేతనైనంత చేయాలి. అప్పుడు అందులో కొన్నైనా సాధించగలడు.

వ్రాసిన ప్రతి పుస్తకం సమాజానికి వీరాశించే ప్రయోజనం చేకూరుస్తుందని భావించడం పొరపాటు. ఒకనాటి సమాజానికి రామాయణ భారతాలు స్ఫూర్తినిచ్చాయి. బంకిం వందేమాతరం భారత స్వాతంత్ర్య సమర జ్వాలల్ని జ్వాజ్వల్యమానం చేసింది. సమాజం కోసమనే పిచ్చిభ్రమలో అభ్యుదయ, విప్లవ కవిత్వం సాధించిందేమిటి? మనిషిలోని బలహీనతలను రెచ్చగొట్టి ఉద్రేకపరిచే కంప్లీట్ సెక్స్ బుక్స్ ఎలాంటివో; బీదల అనభివృద్ధికి ధనికుల వృద్ధే కారణమని రెచ్చగొడ్తే మానసిక అశాంతి, ఆందోళన తప్పితే కల్గే ప్రయోజన మేమిటి ? ఒక రామణీయక దృశ్యానికి మురిసిపోయి దాన్ని తమ కవితలలో బంధిస్తే నేరమా? పొద్దస్తమానం కష్టించి రాత్రి ఇంటికి వచ్చి ఏ ఓపికో కాస్త ఉంటే అందునా కవిత్వం చదివే ఆసక్తి ఉంటే భావకవిత హృదయాన్ని ఆహ్లాదపరచి మమ్మటుడు చెప్పిన ''సద్యః పరనిర్వృతి'' అందిస్తుంది.

రాచెలీ !
జీవితాన్ని రసరమ్యమైన ప్రణయ కావ్యంగా
రచించు కుందామురా
పరవశించి పాడుకుందామురా ?

అని ఆహ్వానించిన తిరునగరి కవితను భగ్వాన్‌గారు ఉల్లేఖించి సమాజానికి పనికిరాదని తేల్చారు. సమాజానికి కార్ల్‌మార్క్స్ (క్రాంతి) పనికొస్తాడు గాని మమ్మటుడు (సద్యః పరనిర్వృతి) పనికి రాడంటే ఎలా? దీనిని హర్షించని శ్రీ భగ్వాన్‌గారు తమ జీవితంలోని రసరమ్యతను గాంచలేక ఎక్కడా , కనబడని మరో ప్రపంచపు ఊహలలో శాంతి సౌఖ్యం పొందజూస్తున్నారా ?

నేను అభ్యుదయ కవిత్వ వ్యతిరేకినని భావిస్తే నన్నర్థం చేసుకోనట్లే. అభ్యుదయ కవిత్వ ప్రయోజన మొకటి, ఈ కవిత్వ ప్రయోజనం మరొకటి. కవిత్వంద్వారా సామాన్యుని సామాజికాభివృద్ధిని, అస్తిత్వాన్ని మెరుగు పర్చేందుకు కవి కృషిచేయవచ్చు. చేయడం ధర్మం కూడ. బీదల పాట్లకు చలించని వాస్తవాన్ని గుర్తించలేని కవి హృదయవనం మోడువారిన శిశిర ఋతువు వంటిది. నిస్సారమైన ఎడారి లాంటిది. అయితే అభ్యుదయ కవిత్వమే తప్ప ఇతర ప్రాకృతిక కవిత్వం, భక్తికవిత్వం మున్నగునవేవి కూడ రచించరాదని నిర్బంధించడం కవుల స్వేచ్ఛను హరించడమే అవుతుంది.

మీ అభిప్రాయాలను నిర్మొహమాటంగా వ్రాయవచ్చు. మంచి ఎక్కడున్న స్వీకరించాల్సిందేకదా.

**శ్రీ వెలుదండ నిత్యానందరావు**
మంగునూరు

## గణిత మినీకవిత

సెప్టెంబరు '80 భారతి కలగూరగంపలో జింబోగారు మినీ కవితలపై వ్రాసిన వ్యాసం చదివాను. ఆ వ్యాసంలో జింబోగారు వ్రాసిన చిన్న పొరపాటును గుర్తుచేస్తూ నవంబరు '80 సంచికలో టి. చంద్రశేఖరరెడ్డిగారు మరో వ్యాసం వ్రాసి, వీరూ మరో చిన్న పొరపాటు చేశారు. 15–3–74 ఆంధ్రజ్యోతి వారపత్రికలో అంకిత కేశవులుగారు వ్రాసిన శుద్ధ మినీకవితను క్రింద పొందుపరుస్తున్నాను.

**డబ్బు**

నువ్వు+డబ్బు=హీరో
నువ్వు—డబ్బు=జీరో
పరమాత్ముడికన్న
పైసాయే మిన్న
దేర్‌ఫోర్ మేరే యారో
దేవుడికి గోలీ మారో

వీరిద్దరి పొరపాట్లను గుర్తుచేస్తూ, నేను వ్రాస్తున్న మరో ''మినీ పొరపాటు.''

ఒక్క పొరపాటు
వంద పొరపాట్లను చేయిస్తుంది

ఒక్క తెరచాటు
కోటి కోరికలను పూయిస్తుంది.

'పాణి'

సామర్లకోట

## 'గీత'ని గురించి....

డిశంబరు 1980 భారతిలో ప్రచురించబడిన "గీత" కథ చదివి ఈ లేఖ వ్రాస్తున్నాను.

శ్రీ పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వాములవారి కీర్తనలు ఆ కథలో వాడుకోవటం జరిగింది వాటిని క్రింది విధంగా వ్రాసినారు.

"పస నేదుర యీ సంసారపు నోపల యిసుర్గుగ తిరగకురోరన్నా
పసిటకాయలో పురుగు సందవున పుసుక్కుమనురోరన్న"
"అటు యిటు పాటులు యీ సంసారం ఆసెలు నమ్మకురోరన్నా
ఘటము పుచ్చిన కుక్క సందమున లొటలొట తిరగకురోరన్నా"
"యెంతోకాలవు బతికేనంటవు యెపుడు పోతందోరన్నా
సంతకోట సంసారమిదియని 'సతతవు' అని నమ్మకురోరన్నా
ఆనందవుగ అమురుతవుండే అత్తవ యెరుగర వోరన్నా
సాదులతో సంగతి సేసీ సంది యెరుగుర వోరన్నా"

పై కీర్తనను శ్రీ స్వామివారు వ్రాసిన కీర్తన క్రింద వ్రాస్తున్నాను. పదాల మార్పు గమనించవలెను. పై కీర్తన వరుసక్రమంలో లేదు. క్రింద రెండు పాదాలు ఈ కీర్తనలో లేవు.

శ్రీ పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామి వారిది.

"యెంతో కాలము బతికేనంటవు ఎప్పుడు పోతుందోరన్నా
సంతకూట సంసారమిది యది సత్యమని నమ్మకురోరన్నా॥
ఆలు పిల్లలు ఈ సంసారము ఆశలు నమ్మకురోరన్నా
గాలము మింగిన చేప చందమునా పాలిమి పొందంటురోరన్నా
ఆటు యిటు మాటలు ఈ సంసారము ఆశలు నమ్మకురోరన్నా
గట పుచ్చి నాకుక్క చందిన లొట లొట తిరుగకురోరన్నా॥
పసలోపల యీ సంసారము లోపల యిసురుగా తిరుగకురోరన్నా
మేడికాయలో పురుగు చందముచ కుసుర్కు మనియేవు రోరన్నా॥
తుదమొదలెరుగని తొమ్మిది కంతలు పదుకుల పదకురోరన్నా
నీ మదికి వచ్చిన సిద్ధగురు నీవద్దయుండగా వోరన్నా"

జానపదులు పాడటంలో ఎన్నో తప్పులు ఉండటం సహజమే. ఎలా ఉందో అలాగే పాడకపోయిన మొత్తానికి కీర్తననే మార్చి సొంత పదాలు చేర్చి పాడటం అరుదనే చెప్పాలి. జానపదులైనంత మాత్రాన వారి నోట వినపడే కీర్తన భావం ఎవరికి అర్థం కాకపోదు. శ్రీ స్వామి వారి కీర్తనలను పాడటంలో జానపదులు భక్తితో ఎంతో చక్కగా పాడతారు. అక్కడో పాదం అక్కడో పాదం కలిపి పాడరు. రచయిత గమనించ మనవి.

శ్రీ గిద్ది వెంకటరమణ

చెయ్యేరు

## వర్గీకరణ

నవంబర్ '80 భారతి సంచికలోని శ్రీ భగ్వాన్‌గారి లేఖ ద్వారా వారి ఆవేదన అర్థం చేసుకున్నాను. వారి కవిత్వ వర్గీకరణ, లేఖ సమంజసంగానే ఉన్నాయి. వారన్నట్లు, సామాజిక ప్రయోజనం కలిగించే కవిత్వం రావాల్సిందే. అయితే, ఈ సామాజిక ప్రయోజనాన్ని వారు ఏ కోణం నుంచి అభిలషిస్తున్నారో స్పష్టీకరించలేదు. రాజకీయంగానా, ఆర్థికంగానా, మానసికంగానా — ఏ విధంగా అన్న విషయం వారి లేఖలో అస్పష్టం. కేవలం, రాజకీయ ప్రగతినో, ఆర్థిక ప్రగతినో దృష్టిలో ఉంచుకుని వ్రాసేవే సామాజిక ప్రయోజన కారకములైన రచనలుగా పరిగణించి, మిగతావి అప్రయోజక రచనలు అనటం పద్ధతి కాదు. మనసును మార్దవం చేసేదీ, ఆర్ద్రం చేసేదీ అయిన అనుభూతి ప్రధాన కవిత్వం కూడా సమాజంలో మానసిక అభ్యున్నతికి కారణమవుతోంది. అనుభూతి ప్రధానమైన కవిత్వము అప్రయోజనకారి ఏ మాత్రమూ కాదు. 'ఏ విధంగానూ సమాజానికి ప్రయోజనం చేకూర్చని కవితలు' అని పేర్కొంటూ కొన్నింటిని ఉదాహరించారు శ్రీ భగ్వాన్‌గారు. వీరొక్క విషయం గమనించాలి. 'చుక్కలన్ని కొండమీద సోకు చేసుకునే వేళ చల్లగాలి తోటకంత చక్కిలిగిలి పెట్టువేళ...' (బంగారిమామ పాటలు; కొనకళ్ళ వెంకటరత్నం) లాంటి పాటలు ఇప్పటికీ జనం నాల్కలపై వున్నవంటే దానిక్కారణం అందులోని సౌందర్యానుభూతి. కాదనగలరా ? ఈ పాటలు మననం చేసుకుంటూ చేలలో శ్రమను మరచి పనిచేసే కూలీలను చూడలేదా ? అనుభూతి కవిత్వం అప్రయోజనకారి అనీ, అట్టే నిలువనిదనీ అనుకుంటే, తరాలు మారినా కాళిదాస 'మేఘసందేశం', తిలక్ 'అమృతం కురిసిన రాత్రి', కృష్ణశాస్త్రి 'కృష్ణపక్షం' మొదలగునవి నిలువగలిగేవా? చివరగా ఒక్కమాట—రవీంద్రుని 'గీతాంజలి' అందరూ ఎందుకు చదువుతున్నారు ? వీటిలో అనశ్వరమైన అనుభూతి వుంది కాబట్టే ఇంకా మనగలుగుతున్నాయి.

బయటికి 'ఏ విధంగానూ' ప్రయోజనం కలిగించనివే అనిపించినా హృదయ సౌకుమార్యం కలిగించే అనుభూతి ప్రధాన కవిత్వం సామాజిక ప్రయోజనంలో అంతర్భాగమై వుందని శ్రీ భగ్వాన్‌గారు గమనించాలి.

శ్రీ పవని ఆర్. హరినాథ్

కడప.

## ఎవరు "కవి" - ఎవరు "మహాకవి"

సాహితి వందనములు తెలుపుతూ 'భారతి' పత్రికలో ప్రచురించిన "కవి—మహాకవి" అనే అంశం గూర్చి ప్రచురించిన విమర్శలు చదివాను, పలువురి సాహితి మిత్రుల అభిప్రాయాలు తెలుసుకొన్నాను. ఈ అంశంపై నా అభిప్రాయం తెలియజేస్తున్నాను.

"నానృషికురు తే కావ్యం" అని ఆర్యోక్తి. ఇదే నిజమయితే ఈనాడు మన కవులందరు ఋషులు కారే! అలాంటప్పుడు మనం "వీరు కవి — వీరు మహాకవి" అని వాళ్ళలో వారికి భేదాభిప్రాయాలు కల్పించి మనలో మనం వాదోపవాదాలు సృష్టించుకోవడం అనవసరం. నేటి సమాజ పరిస్థితుల దృష్ట్యా శ్రీయుతులు శ్రీశ్రీ గారు, శ్రీ దేవులపల్లిగారు, మిగతా కవితా పిపాసులందరు కేవలం "కవి"గా ఒక యున్నత స్థానం పొందగలిగారు. అంతమాత్రంచేత వారందరు "మహాకవులు" కారే! వారిని మనం "మహాకవులు"గా (పిలిస్తే) స్వీకరిస్తే వారిపై మనకు గల పూజ్యభావం తెలుపుతుంది. ఈ విషయంపై ఒక ఉదాహరణ తెలియచేస్తున్నాను.

సాధారణంగా ఒక మనిషి మనకుకాని, సంఘానికి కాని ఏదైన మేలుచేస్తే "మహానుభావుడు" అంటాము. అది సహజం. సభ్యత కోసమో, లేక మనలోని సంస్కారమో మనచేత అలానిపిస్తుంది. అంతమాత్రంచేత అతను మహానుభావుడని మన సంఘం ఒప్పుకోదు. సమకాలీన జీవితాలకు దర్పణం పట్టి సాగించే రచనలు, కవితలు ఆ కాలంలోనే నిలుస్తాయి. వీటికి ఆదరణ భావితరాలలో అంతంత మాత్రంగానే యుంటుంది.

సర్వకాల సర్వావస్థలందు మనోరంజితంజేసి ఆత్మపరిపక్వతకు దోహదం చేసే రచనలు, కావ్యాలు కలకాలం నిలిచి వాటిని కూర్చిన కవులను మాత్రమే "మహాకవులు"గా గుర్తింపచేస్తాయి. దీనినిబట్టి "కవులెవరో—మహాకవులెవరో" పాఠకులే గుర్తిస్తారని ఆశిస్తాను.

**శ్రీ దేగల వీరభద్రరావు**

**కాకినాడ**

## గండికోట-పెమ్మసానివారు

నవంబరు (1980) నెల భారతిలో శ్రీ రమణగారి 'గండికోట—పెమ్మసానివారు' వ్యాసం చదివేను. శ్రీ రమణగారు నేడు ఆంధ్రవిశ్వవిద్యాలయంలో చరిత్ర పురాతత్త్వ శాఖాధిపతులుగా ఉన్న డా॥ వై. శ్రీరామ్మూర్తిగారు గతంలో 'పెమ్మసానివారి వంశం' గురించి ఆంధ్రా హిస్టారికల్ రీసెర్చి సొసైటీ (రాజమండ్రి)వారి [వాల్యూమ్ XXX (I-IV భాగాలు) 1964-65, పుటలు 89-104] పత్రికలో వ్రాసిన ఆంగ్లవ్యాసాన్ని చూసినట్లుగాలేదు. రమణగారి వ్యాసంలో పతంగ చాటుపద్య మణిమంజరిలో రామలింగ నాయని గూర్చి చెప్పబడినదని పేర్కొన్న చాటువుకూ, శ్రీ శ్రీరామమూర్తిగారి వ్యాసములో ఉటంకించబడిన చాటువుకు రవంత 'పాఠ్య విషయక తేడాలు ఉండడం మాత్రమేకాక అసలు ఆ చాటువు పెమ్మసాని వంశములోని చినతిమ్మయ్యకు చెందినదిగా భావించడానికి వీలుంది.

ఫ్రెంచి వజ్రాల వర్తకుడు టవార్నియర్ గండికోట గురించి వివరంగా వ్రాసిన సమాచారాన్ని శ్రీ రమణగారు తమ వ్యాసములో పేర్కొనకపోవడం శోచనీయము. ఈ వివరణ శ్రీ శ్రీరామమూర్తి గారి వ్యాసంలో ఉంది.

**విజయాదత్**

**విజయనగరం**

## ఉ ప యో గ ం

సమాజానికి ఉపయోగపడే కవితలు, ఉపయోగపడని కవితలు అంటూ శ్రీ భగ్వాన్‌గారు శ్రమకోర్చి, భారతిలోని కవితలను పరిశీలించి వాటి వివరాలను నవంబరునెల భారతిలో ఒక పట్టికరూపంలో యిచ్చారు. వారి విమర్శనాత్మక పరిశీలనా దృష్టికి నా ధన్యవాదాలు.

అయితే, శ్రీ భగ్వాన్‌గారు సమాజ ప్రయోజనమైనవి, కానివి, అని కవితలను నిర్ధారించేముందు, సమాజ సహజ లక్షణాలను మరిచిపోయారు. శరీరంలోని కొన్ని అవయవాలకు కొన్నిరకాల ఆహార పదార్థాలు బలాన్ని, శక్తిని సమకూరుస్తాయన్న విషయాన్ని గ్రహించిన మనం, రకరకాల విటమినులున్న పౌష్టికాహారాన్ని తీసుకుంటున్న విషయం నిత్య సత్యం. శరీరానికి పనిచేయడానికి కావలసిన శక్తినిచ్చేది పిండిపదార్థమేగదా అని, మనం ఒక్క పిండి పదార్థాన్ని మాత్రమే భుజించడంలేదుగదా! అలాగే సమాజంలో విభిన్న దృక్పథాలు, మనస్తత్వాలుగల వ్యక్తులున్నప్పుడు వారి అభిరుచులకు, ఆలోచనలకు తగినటువంటి కవితలకు అవకాశమివ్వడం పక్షపాతవైఖరిలేని పత్రిక లక్షణం—అదే నిజమైన సామాజిక ప్రయోజనాన్ని గుర్తెరిగిన పత్రిక.

సామాజిక ప్రయోజనమన్న పదానికి నిర్దిష్టమైన కొలబద్దలు ఏర్పరుచుకున్నప్పుడు, విరహగీతాలు, ప్రణయగేయాలు కొందరికి ప్రయోజన రహితమైనవిగాను, వాటివల్ల మానసికోల్లాసాన్ని పొందేవారికి సమాజ ప్రయోజనమైనవిగాను కన్పడటం సహజం. అలానే, సమాజాన్ని సర్వోత్కృష్ట స్థానానికి చేర్చడానికి, సామ్యవాదం రావాలని, అది తుపాకీ గొట్టంద్వారా మాత్రమే సాధ్యమౌతుందని విశ్వసించేవారికి, కర్మసూత్రాన్ని, శ్రమైక జీవనాన్ని, ఆధ్యాత్మిక దృష్టితో సాధించగల సామ్యవాద ప్రపంచాన్ని, వివరించే కవితలు, సమాజ ప్రయోజనరహితమైనవిగానూ, తిరోగమనసూత్రాలుగానూ కన్పడవచ్చు. ఎవరికైనా కళాత్మకమైనదేదైనా ప్రయోజన రహితంగా కన్పడితే అది వారి హ్రస్వదృష్టికి తార్కాణంమాత్రమే.

**శ్రీ అవ్వాప్రగడ శివరామ ప్రసాద్**

**నందిగామ**

## సాహిత్య లేఖ

'వొత్తాసు' అన్నానని దినకర్‌గారు చాలా కోప్పడ్డారు నన్ను.

పత్రికల్లో మనం రాసుతునే లేఖలు, చేసుకునే వ్యాఖ్యలూ నిజంగా సామాన్య ప్రజలవరకూవెళ్లి వాళ్ల బుర్ర (బండి ర?) కెక్కుతాయనుకుంటున్నారా దినకర్‌గారు! సామాన్య ప్రజల్ని చైతన్య వంతుల్ని చెయ్యాలంటే పాట వొక్కటే సరైన సాహిత్య ప్రక్రియ! 'సాహిత్యప్రియుడు'గా మీకు 'భారతి' కవితలలోవున్న అర్థం తెలియాలంటే యీ సంచికలోనే వున్న భగ్వాన్‌గారి లేఖ చూడండి.

నా 'సాహిత్యలేఖ'లో నేనెక్కడా 'భారతి'లో పడుతున్న కవితలన్నీ అర్థవంతమయిన వనలేదు. అటువంటి అభిప్రాయం అర్థం లేనిదన్నానుకూడా. 'భారతి'లో సమాజానికి పనికొచ్చే కవితలు కొన్నయినా వున్నాయి — వాటిసంఖ్య స్వల్పమే కావొచ్చు. వాటిల్లో కొందరికయినా సమాజంపట్ల బాధ్యత, జనాన్ని జాగృతం చెయ్యాలనే తపనా వున్నాయి. వాళ్లని ప్రోత్సహిస్తే ప్రజలలోకి వెళ్లి ప్రజా చైతన్యంలో భాగంగా నిగ్గుతేరతారనే నా వుద్దేశం. అందుకే అన్ని కవితల్నీ యేకమొత్తంగా కొట్టిపారేసి వాళ్లని నిరుత్సాహపర్చకుండా మంచిచెడ్డల్ని తేల్చిచెప్పమని "కవిత్వమంటే—కవి—అంటేయేమో సాహిత్య ప్రయోజనమేమో" తెలిసికున్న "సద్విమర్శకులూ—నిజమైన రచయితలూ" అయిన మీలాంటివారికి 'మనవి' చేసేను.

ఇక "బలహీనులు బలహీనుల పక్షంచే"రే విషయం "బలవంతుల్ని కలుపుకోడానికి యిష్టపడ"క పోడంమాట యెలావున్నా బలహీనుడు అనవసరక్రోధం ప్రదర్శిస్తాడనేది రుజువయిన నిజం !

దినకర్‌గారు నా "సాహిత్యలేఖ"ని మెచ్చలేదు.

అంచేత—

గురజాడవారి "కొయ్యబొమ్మల" చరణం కొందరికయినా వర్తించింది.

**మోహనమిత్ర**

కాకినాడ

## సాహిత్యంలో సూర్యుడు

1980 సెప్టెంబర్ కలగూరగంపలో, 'సూర్యుడిపై ధ్వజమెత్తిన కలాలు' అనే అంశాన్ని శ్రీ కొల్లూరిగారు రాయగా చదివాను. పిమ్మట కొన్ని విషయాలు 'భారతి' పత్రికా ముఖంగానే వెల్లడించదలిచాను.

భావ కవితా విప్లవానంతరం అసంఖ్యాకంగా వెలువడిన అభ్యుదయ, విప్లవ రచయితల రచనల్లో సూర్యుడు నాయకుడైనమాట వాస్తవమే ఐనప్పటికీ, కేవలం ఆ కారణంచేతనే దాన్ని ఒక ఉద్యమంగా అభివర్ణింపవలసినఅవసరంవున్నదా ? పెద్దలైనవారు యోచించాల్సిన విషయం ఇది.

సూర్యుడు పేరును శీర్షికలో యిముడ్చుకొని వెలువడిన ప్రముఖ కవుల రచనలు 'మండేసూర్యుడు', 'రక్తం సూర్యుడు'ల ప్రస్తావన ఈ వ్యాసంలో ఎక్కడా లేకపోవడం నిజంగా పెద్దలోపమే.

ఎల్లప్పుడూ అనుభూతుల అంచుల్లో ప్రయాణంచేసే శుద్ధ కవితావాది శేషేంద్రకవి, 'మండేసూర్యుడు' ప్రస్తావన లేకపోతే లేకపోవచ్చునుగాని, సంపూర్ణ అభ్యుదయాంశ కలిగిన శివారెడ్డి కవిత 'రక్తంసూర్యుడు' ప్రస్తావన కూడా లేకపోవడంతో శ్రీ కొల్లూరిగారి వ్యాసం అసమగ్రమై కూర్చుంది.

**శ్రీ వెంపలి వెంకట శివప్రసాద్**

అనకాపల్లి

## స వ ర ణ

ఫిబ్రవరి, 1981 'భారతి'లో నా వ్యాసమున (20వ పేజి, 3వ పేరా) 'మేడవ మహాదేవి' అనుటకు బదులు 'యేడవ మహాదేవి' అని అచ్చుతప్పు పడినది. సర్తింప ప్రార్థన.

**శ్రీ కొల్లూరు సూర్యనారాయణ**



# గ్రంథ విమర్శలు

## ఏడు ఆస్తిక గ్రంథాలు

### మత చర్చ

[రచయిత: శ్రీ చావలి లక్ష్మీనారాయణ, విద్వాన్, బి. ఏ., బి. ఇడి. డెమ్మీ 64 పేజీలు. వెల: తెలియదు. ప్రాప్తిస్థానం: రచయిత, బ్రాహ్మణ వీధి, పొన్నూరు – 522 134, గుంటూరు జిల్లా.]

మానవ జీవితానికి ప్రయోజనం లౌకిక సుఖానుభవంమాత్రమే కాదు. ఆధ్యాత్మికానికి కూడా ప్రయత్నించడం అవసరం. దానికి మతాన్ని గురించి తెలుసుకోవడం ముఖ్యం. ఆ మతాన్ని గురించిన విషయాలు ఈ చిన్న పుస్తకంలో ఉన్నాయి.

మతాన్ని గురించిన ఉపన్యాసాలు వినడం, వ్యాసాలు చదవడం వల్ల ప్రయోజనం తక్కువ. జన సామాన్యానికి దానిపై ఆసక్తి ఉండదు. ప్రశ్నోత్తరాల రూపంగా ఉన్న ఏ విషయమైనా సులభంగా బోధపడుతుంది. ఈ అభిప్రాయంతోనే యీ గ్రంథం ప్రశ్న సమాధానాల రూపంలో కూర్చబడింది. సుందరం, శంకరం అనే యిద్దరు వ్యక్తుల ప్రశ్నోత్తరాలలో అనేక విషయాలు చర్చింపబడినవి.

దేవుడున్నాడా? మత మెందుకు? మత సేవ జరుగుచున్నదా? పౌరోహిత్యము, జాబాలి నాస్తికుడా? కర్తవ్యము – అనే యిందలి శీర్షికల ననుసరించియే ఇందులో చర్చించబడిన విషయాలేమో తెలుసుకోవచ్చును.

'కర్తవ్య' మనే చివరి శీర్షికలో – ముఖ్యంగా తీర్థయాత్రలు సాగించాలని, అప్పుడు తమతో ఏకాభిప్రాయం గలవారితో పరిచయం ఏర్పడుతుందనీ, తరచు ఇంటికి దూరంగా ఉండి, బంధాలను వదిలించుకొనుటకు ప్రయత్నించాలనీ, అప్పుడు ముక్తిమార్గం గోచరిస్తుందనీ రచయిత తమ అభిప్రాయాన్ని వెల్లడించారు. మత ప్రయోజనాన్ని గురించి తెలుసుకొనుటకు ఈ గ్రంథం ఉపయోగపడుతుంది. దీని ముద్రణకు శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానం వారు ద్రవ్య సహాయం చేయడం సముచితంగా ఉన్నది.

### గీతా సుధాలహరి

[శ్రీ మద్భగవద్గీతకు ఆంధ్ర పద్యాను కృతి. అనువక్త: శ్రీ అగస్త్యరెడ్డి వెంకురెడ్డి, ఎం. ఏ., ఎల్. ఎల్. బి., వరకవిపూడి, నెల్లూరు జిల్లా. డెమ్మీ 36+270 పేజీలు. వెల: 20 రూ.లు. ప్రతులకు: (1) శ్రీ ఎ. వెంకురెడ్డి, 16/1252, గాంధీనగర్, నెల్లూరు–524 001. (2) శ్రీ ఎ.రామచంద్రారెడ్డి, ఈదూరు, నెల్లూరు తాలూకా.]

భారతీయుల పవిత్ర గ్రంథాలలో ప్రధానమైనది భగవద్గీత. దానికి తెలుగులో ఇదివరకే వివిధ రీతుల్లో గద్యానువాదాలు, పద్యానువాదాలూ వచ్చాయి. వస్తున్నవి. నూతనంగా వెలువడిన పద్యానువాదాలలో ఈ "గీతా సుధాలహరి" ఒకటి.

పద్యానువాదకులు వెంకురెడ్డిగారు భగవద్గీతా తత్త్వాగతికి ప్రగాఢ కృషిచేసి దీనిని రచించి, ప్రముఖులగు విద్వాంసులకు వినిపించి వారి ప్రశంసలందుకొన్నారు, వారిలో కొత్త సచ్చిదానందమూర్తిగారు దివాకర్లవారు, మిన్నికంటి గురునాథ శర్మగారు, డాక్టర్ నారాయణ రెడ్డిగారు, పుట్టపర్తివారు, నెల్లూరు సంస్కృత కళాశాల ప్రిన్సిపలు రామానుజాచార్యులుగారు, గుంటూరు సంస్కృత కళాశాల ప్రిన్సిపలు అనంతరామయ్యగారు, డాక్టర్ ఇలపావులూరి పాండురంగారావుగారు, శివారెడ్డిగారు, కరుణశ్రీగారు, మరుపూరి వారూ ఉన్నారు.

ఇట్టి విద్వాంసుల ప్రశంస పొందిన యీ కృతి ఉత్తమంగా ఉంటుందని వేరే చెప్పనక్కరలేదు. దీని 'మదింపు' లో మరుపూరి వారు "మన భూరి (వేదాంత) విద్య మొదట క్షత్రియుల సొమ్మయినా, బ్రాహ్మణాధీనమై, మంత్రంతోపాటు భాషకూడా వారి గుప్తధనమైనది. కాబట్టే ఐదువేల సంవత్సరాలనాటి హిందూమతం వర్ణభిత్తికల్లో నడుమ కృశించిపోతుండగా, కొత్త మతాలు ప్రపంచవ్యాప్తి పొందినవి." అని వ్రాయడం వింతగా ఉన్నది. దీన్ని ఆర్ష వాఙ్మయ చరిత్రవిమర్శకులే నిర్ణయించాలి. బ్రాహ్మణుల మూలంగానే హిందూమతం వర్ణ భిత్తికలలోపడి క్షీణించి, మతాంతర వ్యాప్తికి కారణమైనట్లు ఒకజాతిని నిందించడం సమంజసంగా ఉన్నట్లు కానరాదు. గీతను గురించి చెప్పేటప్పుడు మతప్రసక్తి అనవసరం.

అనువాదం చాలా సరళంగా సాగింది. ఒక్క ఉదాహృతి –

"యానిశా సర్వ భూతానాం, తస్యాం జాగర్తి సంయమీ,
యస్యాం జాగ్రతి భూతాని, సా నిశా పశ్యతో మునేః.

[అధ్యా. 2, శ్లోకం 69]

అనువాదం –

ఎల్ల భూతములకు రాత్రి యేది యగునో?
అదియె సంయమి మేల్కొనునట్టి వేళ;
సకల భూతముల్ మేల్కొను సమయ మరయ
బ్రహ్మవేత్తకు నెప్పుడు రాత్రి యగును."

ఇందులో ఎదురెదురుగా మూలానువాదాలు అచ్చువేయబడినవి. దీని ముద్రణకున్నూ శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానం వారి ఆర్థిక సహాయం లభించడం హర్షింపదగినది. దీనికి మంచి ప్రచారం లభించ గలదని ఆశిస్తున్నాను.

## రామాయణంలోని రత్నాలు

[ఆంధ్ర టీకా తాత్పర్యములు. వ్యాఖ్యాత్రి: డాక్టర్ (శ్రీమతి) వడలి అనసూయాదేవి, ఎం.ఏ., పిహెచ్.డి. డెమ్మీ 124 పేజీలు. వెల: 6-50. ప్రతులకు: సురభారతీసమితి, ఉస్మానియా యూనివర్సిటీ కాంపస్, హైదరాబాదు - 500 007. సంపాదకులు: డాక్టర్ పుల్లెల శ్రీరామచంద్రుడుగారు.]

ఇది సురభారతీ సాంస్కృతిక గ్రంథమాల. ద్వితీయ కుసుమం. సంస్కృత భాషా ప్రచారం ప్రధానోద్దేశంగా స్థాపించబడిన సురభారతీసమితి, సంస్కృత భాషలోని విలువైన విషయాలు సంస్కృతం తెలియని తెలుగువారందరికీ తెలియుటకున్నూ, తన్మూలంగా తద్భాషా ప్రచారానికిన్నీ ఎంతో కృషి చేస్తున్నారు. టీకా తాత్పర్యాలతో సంస్కృత గ్రంథాలలోని విలువైన శ్లోకాలను గ్రంథరూపంగా ప్రచురించడం సమితి ప్రణాళికలలో ఒక ముఖ్య భాగం. అట్టి ప్రచురణలలో ఈ "రామాయణంలోని రత్నాలు" ఒకటి. శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానం వారి భూరి విరాళం సహాయంతో ఇట్టి గ్రంథాలు సమర్థులైన విద్వాంసుల పర్యవేక్షణలో ప్రచురించబడుతూ ఉన్నవి. సమితి అధ్యక్షులు ఆంధ్రప్రదేశ్ హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి శ్రీ ఆల్లాడి కుప్పుస్వామిగారూ, కార్యదర్శి బహుభాషావేత్తలు డాక్టర్ పుల్లెల రామచంద్రుడుగారున్నూ తగినవారిచే గ్రంథాలు రచింపజేసి ప్రకటిస్తున్నారు. ఇందులో శ్రీమద్రామాయణంలోని అమూల్యమైన శ్లోకాలు టీకా తాత్పర్యాలతో 319 ఈయబడినవి. అన్నీ గొప్ప నీతులను బోధించునవే! టీకా తాత్పర్యాలు చాలా సరళంగా సర్వజన సులభమైనవిగా ఉన్నవి. ఉదాహృతి —

శ్లో. నాగ్ని ర్నాన్యాని శస్త్రాణి న నఃపాశా భయావహాః,
ఘోరాః స్వార్థ ప్రయుక్తాస్తు జ్ఞాతయో నో భయావహాః. 235.

అర్థం:— అగ్నిః = అగ్ని, న = కాదు, అన్యాని=ఇతరములైన, శస్త్రాణి=శస్త్రములున్ను, న=కావు, పాశాః=పాశములున్ను, నః = మనకు, భయావహాః=భయమును కల్గించునవి, న=కాదు, స్వార్థ ప్రయుక్తాః=స్వార్థముతో ప్రేరేపింపబడి, ఘోరాః=ఘోర స్వభావులైన, జ్ఞాతయః=జ్ఞాతులు, నః=మనకు, భయావహాః=భయమును కల్గించువారు.

తాత్పర్యము:— అగ్నిగాని, ఏ ఇతరములైన శస్త్రములుగాని భయమును గొల్పునవి కావు. స్వార్థ ప్రయోజనముతో కార్యముల నొనరించు కొందరు ఘోర స్వభాగు జ్ఞాతులు మాత్రమే భయావహులు.

## సామాన్య ధర్మములు

[సురభారతీ సాంస్కృతిక గ్రంథమాల—తృతీయ కుసుమము. రచయిత: శ్రీ కేశవపంతుల నరసింహశాస్త్రి. డెమ్మీ సైజు 19 పుటలు. వెల: 6 రూ. ప్రతులకు: కార్యదర్శి, సురభారతీ సమితి, ఉస్మానియా యూనివర్శిటీ కాంపస్, హైదరాబాదు-500 007.]

ఇది కూడా "రామాయణంలోని రత్నా"ల వలె సంస్కృత భాషా ప్రచారానికి ఉద్దేశింపబడినదే! మన ప్రాచీనులు తెల్పిన ధర్మాలలో ప్రధానమైన ధర్మాలు, మేలైన నీతులు ఇందు పొందుపరుపబడి యున్నవి. అవి — ధర్మము, దైనిక చర్య, బ్రహ్మచర్యము (విద్యార్థి దశ), సాధారణ ధర్మములు— అనే శీర్షికలలో ఉన్నవి. ప్రాచీన కాలంలోని సాంఘిక ధర్మాలను తెలుసుకొనుటకు ఈ గ్రంథం బాగా ఉపయోగ పడుతుంది. ధర్మాలు సంస్కృత శ్లోకాలలోను, దానికి తెలుగులో వివరణమున్నూ ఉన్నది. ఒక్క ఉదాహరణ —

శ్లో. క్షణశః కణశశ్చైవ విద్యా మర్థం చ సాధయేత్,
క్షణత్యాగేకుతో విద్యా, కణత్యాగేకుతో ధనమ్ ?

అని ఆర్యోక్తి. ఒక క్షణకాలమును సైతము వృథాగాపోనీయక విద్యను సంపాదించవలెను. ఒక్క కణము — అనగా ఒక గింజ — లేక ఒక పైసను విడువక ధనమును సంపాదించవలెను. క్షణకాలమే కదాయని అశ్రద్ధ చేయువానికి విద్యయు, ఒక్క పైసాయే గదాయని తృణీకరించు వానికి ధనమును రాశిగా చేరవు అని భావము. (చదువు బాగారాదు — ధనము గొప్పగా చేరదు.) (పుట 38).

అందరికీ మిక్కిలి ఉపయోగకరమైన యీ పుస్తకం కూడా శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానంవారి భూరి విరాళంవల్లనే ప్రచురించబడింది. దీని సంపాదకులున్నూ డాక్టర్ పుల్లెల శ్రీరామచంద్రుడుగారే!

## సాధన

[మూలం: శ్రీ ఎం. పి. పండిట్, అనువాదం: శ్రీమానాప్రగడ శ్రీరాములు. క్రౌన్ సైజు 12+64 పేజీలు. వెల: 3 రూ. ప్రచురణ: శ్రీ అరవింద సొసైటీ, తెనాలి. ప్రాప్తిస్థానములు: (1) శ్రీ అరవింద సొసైటీ, తెనాలి. (2) శబ్ద మరియు తెలుగు శాఖ, శ్రీఅరవిందాశ్రమం, పాండిచేరి. (3) ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ హ్యూమన్ స్టడీ, యూనివర్శిటీ రోడ్, హైదరాబాదు.]

"ఎన్ని విద్యలు నేర్చినా, ఏది లోపించినచో జీవితము ధన్యత జెందదో, యా విషయము గూర్చిన వివరణల నందించుచున్నదీ చిన్న గ్రంథము. చిన్నదయ్యును ఉద్గ్రంథ మియ్యది. జీవిత లక్ష్యమును సిద్ధింపజేసికొన నాకాంక్షించు వారందరికీ, ఈ గ్రంథము ఉపయుక్తము. పూర్ణయోగ సాధకులకే కాదు, సర్వులకున్నిది యుద్దిష్టము." అని దీని ప్రకాశకులు శ్రీ అరవింద సొసైటీవారు తమ మాటలో అంటున్నారు. వారంటున్నది అక్షరాలా నిజం.

శ్రీ అరవింద మహర్షులు తెలిపిన యోగసాధన యిందులో చాలా సంగ్రహంగా సులభ పద్ధతిలో తెలుపబడినది. "సాధన నారంభించుటెట్లు? అర్పణము, శుద్ధి, నిద్ర, సామూహిక సాధన, ఆధ్య

యనము, మనః ప్రవృత్తులు, అనుభవములు.'' అనే శీర్షికలతోపాటు రెండు అనుబంధాలలో కొన్నిపదాలకు నిర్వచనం, ఇతర పాశ్చ్యగ్రంథాలు తెలుపబడినవి. అరవిందుల ఆధ్యాత్మిక యోగ సాధనను గురించి తెలుసుకొనుటకు ఈ గ్రంథం బాగా ఉపయోగిస్తుంది. ఆయా శీర్షికలకు సంబంధించిన విషయాలన్నీ సులభగ్రాహ్యమైన భాషలో వివరించబడినవి.

## దివ్య ప్రబంధ మాధురి

(వ్యాస సంకలనము)

[రచయిత : శ్రీ కె. టి. నరసింహాచార్యులు. క్రౌన్ సైజు 68 పేజీలు. వెల : 4 రూ. ప్రకాశకులు : శ్రీ గోదా గ్రంథమాల, ముసునూరు, కృష్ణాజిల్లా.]

ద్రావిడ భాషలో విశిష్టాద్వైత మతానికి సంబంధించిన దివ్య ప్రబంధాలు ప్రఖ్యాతమై ఉన్నవి. ద్రావిడ వేదాన్ని సమగ్రంగా పరిశీలించి అందలి దివ్య ప్రబంధాల తత్త్వాన్ని సంపూర్ణంగా గ్రహించిన నరసింహాచార్యులుగారు ఆ ప్రబంధాల మాధుర్యం సులభంగా అవగాహన చేసుకొనుటకు అనుకూలమైన వ్యాసాలు రచించి యీ పుస్తకంగా ప్రకటించారు. ఇందులో ''దివ్య ప్రబంధ మాధురి, ఆళ్వారులు — నాలాయిర ప్రబంధము, ద్రావిడ వేదావతరణము, మహర్షి కవితా మాధురి, వకుళ భూషణ నాయకి, సహస్రగీతి సందేశము, కణ్ణినుణ్ శిఱుత్తాంబు'' అను వ్యాసాలు ఉన్నవి. అన్నీ ఆయా శీర్షికలకు సంబంధించిన విషయాలను చక్కగా వివరిస్తూ ఉన్నవి. విశిష్టాద్వైతులు మాత్రమే కాకుండా వాఙ్మయాభిమానులందరూ చదివి ఆమోదించవలసిన గ్రంథం. ఇది వ్యాసకర్త విశిష్ట మత విజ్ఞానానికి మచ్చుతునక.

## తిరువాయ్ మొళి అను శ్రీ శఠకోప వాక్సుధ

[చతుర్థ శతకము. సుధా మాధురి వ్యాఖ్యా సహితము. వ్యాఖ్యాత : శ్రీ కె. టి. నరసింహాచార్యులు. క్రౌన్‌సైజు 18 + 136 పేజీలు. వెల : 10 రూ. ప్రకాశకులు : శ్రీ గోదా గ్రంథమాల, ముసునూరు—521 207, కృష్ణాజిల్లా.]

ద్రావిడ దివ్య ప్రబంధాలలో మిక్కిలి వ్యాప్తి గణించి, ప్రతి శ్రీవైష్ణవునికీ కొంత భాగమైనా కంఠస్థంగా ఉండే తిరువాయ్ మొళి తెలుగువారికి బాగుగా అర్థమయే రీతిని శ్రీ నరసింహాచార్యులుగారు టీకా తాత్పర్య విశేషార్థాలతో వ్యాఖ్యను రచించి తమ గోదా గ్రంథమాల మూలంగా ప్రకటిస్తున్నారు. నూరేసి పాశురములు ఒక శతకంగా వెలువడుతున్నవి. ఇదివరకు మూడు శతకాలు వెలువడి, బహుళ వ్యాప్తిని, వాఙ్మయాభిమానుల ఆదరాన్నీ పొందాయి. ఇది నాల్గవ శతకం. శ్రీ రామానుజ పత్రికలో ప్రకటితపూర్వములైన 'భగవద్విషయ మాధురి, అర్చావతార విశిష్టత' అనే వ్యాసాలు కూడా ఇందులో చేర్చబడినవి. ఇది శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానముల వారి సహకారంతో ప్రకటింపబడినది. అందరూ ఆదరించవలసిన ఉత్తమ గ్రంథం యిది. మిగిలిన శతకములు (మిగిలిన ఆరు) కూడా త్వరలోనే ప్రకటింపబడగలవని ఆశిస్తున్నాను.

''ఆంగీరస''

## ప్రసన్న భారతి

(శతకం)

[మద్దిరాల లక్ష్మీకాంత ప్రసన్నకుమార్. వెల: రు.2—00లు. ప్రతులకు : రచయిత, కొండపాటూరు, పొన్నూరు తాలూకా, గుంటూరు జిల్లా.]

ఇది నూటొక్క ఆటవెలది పద్యముల శతకం. కవిగారు పద్య రచనలో ఇది తొలి ప్రయత్నమని చెప్పుకొన్నారు. సరళమైన భాషలో ప్రసన్న కుమార్‌గారు పిన్నలకు, పెద్దలకు పనికొచ్చే అనేకమైన నీతులు, సూక్తులు చెప్పారు. ఇది వారి మొదటి ప్రయత్నంగనుక అక్కడక్కడా భావ వైరుధ్యాలు కనబడక తప్పదు. ''చచ్చు, పిచ్చి మొద్దు, సంస్కారహీనుండు, శుంఠ, చవట, నాప, సుద్దపప్పు— చదువులేనివాని సహజనామము లివ్వి—సూక్తి వినగదన్న! సుప్రసన్న!'' అంటారు ప్రసన్నకుమార్. 'చదువు చదవగానే సంస్కారి కాడురా' అంటున్నారు. అట్లాగే 'నవతలేనివాడు కలియు నెట్లు?' అంటూనే 'కర్మఫలము బట్టి కలిమి లేములు గల్గు' అని చెప్పుతున్నారు. 'మరీ నవ్యతకు అర్థమేమిటి?' ప్రసన్నకుమార్‌గార్కి ఒక ధార శైలిలో ఉంది. అంతర్జాతీయ బాలల సంవత్సరంలో రాసిన శతకం గనుక వారి శైలి బాలలకు సుబోధకంగాఉంది. సాధనవల్ల ముందుముందు ఇంతకంటె ఉత్తమమైన కావ్యాలు రాస్తారని ఆశ.

## బతుకు పోరు

(జనం పాటలు—కొన్ని కవితలు)

[ఎన్నార్ బోధనం. వెల : రూపాయిన్నర. ప్రతులకు : బి. నర్సిరెడ్డి, కేరాఫ్ ఉదయా ప్రింటర్సు, ఇందిరా రోడ్, నల్లగొండ.]

ప్రజల కొరకు రాసిన నవ్య కవిత్వం ప్రజలదాకా వెళ్ళలేదన్నది ఈనాటి యథార్థం. ప్రజలంటే ఎవరన్నది ప్రశ్న. ఏ ప్రజల కోసం కవిత్వం రాశారో ఆ ప్రజలేనన్నది సమాధానం. ఈ సంకలనంలో కవిత్వంతోపాటు కొన్ని జనం పాడుకొనే పాటలున్నాయి. వచనకవిత్వం కంటె ఈ పాటలే ప్రజల వద్దకు చేరతాయని ఇటీవల ప్రజాకవిత్వం రాస్తున్న కవులు గ్రహించారు. వారికి అర్థమయ్యే భాషలో, వారు పాడుకొనే విధంగా పాటలు రాస్తే కవులు ఆశించే ప్రయోజనం కొంతవరకైనా నెరవేరుతుందనే విశ్వాసం ఈ పాటల పుట్టుకకు కారణం. ఎన్నార్ బోధనంగారు అట్లాంటి కొన్ని పాటల్ని రాశారు. ఉదాహరణకు —

నిదురించే
వేళకాదు సోదరా
మౌనముద్ర వీడి
జై అంటు సాగిరా

రాజులు జన్మించిరి దేశంలో
రాజ్యాల నేలిరిరా గతంలో ...
రాజులు మారినా ... రాజ్యాలు మారినా
మారలేదు మన బతుకులు సుంతైనా...
అంతులేని మోసాలకు బలియై పోయామురా ...
దీనంతుజూడ సమయమిదే లేవరా "నిదు"

ఈ కవి ఇంకా శ్రామిక జనం యాసని, భాషని (మాండలిక భేదాలుంటాయి. తప్పదు) పరిశీలించగలగాలి. వచన కవిత్వం రాసేటప్పుడు బోధనంగారు మంచి రూపకాలను ఉపయోగించారు.

రేపు కనబోయే
క్రాంతి శిశువు రూపాన్ని
కలల కళ్ళల్లో వీక్షింప వెంచి
మంచంపై విశ్రమిస్తే
ఈ వ్యవస్థ మంచంకోళ్ళ
సందుల జేరిన నల్లులు నీ ఆశల
రక్తాన్ని పీల్చడం ప్రారంభించి
నిన్ను
నిద్ర కుపక్రమింప కుండాజేస్తే
విప్లవం వేన్నీళ్లను కాచి
మంచంకోళ్ళ సందుల్లో గుమ్మరించు

ఇట్లాంటి వచన గేయాలు ఈ సంకలనంలో బాగా ఉన్నాయి. ఇట్లాంటి కవిత్వమంతా నినాద కవిత్వమని భావించేవారు శ్రద్ధగా చదవతగ్గ సంకలన మిది.

# దృష్టి

(నవ్య కవిత్వం)

[తమిళ మూలం : కొ. స. బలరామన్. తెనిగింపు : కె. ఆర్. వేలాయుధరాజా. మూల్యం : రు. 2-00 లు. ప్రతులకు : దక్షిణాంధ్ర భాషా సమితి, గూడలూరు పి. ఒ., 627 758, వయా వాసుదేవ నల్లూరు, తిరునెల్వేలి జిల్లా, తమిళనాడు.]

ఇది అనువాద కవిత్వం. వచన కవితా ప్రక్రియకు చెందిన కావ్యమని అనువాదకులు ఆరంభంలోనే చెప్పుకొన్నారు. వెక్కిరింత లేక హేళన కవిత్వంగా ఈ సంకలనాన్ని భావించవచ్చు. అనువాదంలో కవిత్వ పటుత్వం కనబడటం లేదు. (మూలం నాకు తెలియదు) కావ్య దృక్పథం అభ్యుదయకరమైనది. 'ఏమిటి వ్రాస్తున్నావు ?' అనే గేయంలో ఈనాడు కవి గ్రహించవలసిన సామాజిక ఇతివృత్తం చెప్పబడింది. 'అంటు' అనే గేయంలో ఆచారం (మడి) పై వెక్కిరింతే కాకుండా దాని తాలూకు మూర్ఖత్వం కూడా వెల్లడైంది. అయితే గేయంలో ఎక్కడా కవిత్వ స్పృహ కనబడదు.

వేసవికాలం వర్షం
గుడి గుమ్మంలో
తలదాచుకొంటానని కెళ్ళాను
పూజారి నన్ను చూసి
'మడి చెడి పోతుంది
ముట్టుకోగలవు అవతల కెళ్ళురా'
అన్నాడు.

ఆ గుడి
స్వర్గద్వారానికి
పునాది గొయ్యి
త్రవ్వినవాని
మనుమడు నేను

ఈ పాదాలను వచనంగా రాస్తే నష్టం ఏమీలేదు. హేళనకు, వెక్కిరింతకు ఉదాహరణగా 'బాల్య విధవ' మినీ కవితను తీసుకోవచ్చు.

''పుప్పలావిక పూర్ణమ్మ
పుష్పించుటకు ముందుగానే
బొట్టు చెడింది
పొలుపు చెడింది
పూవూ చెడింది''

ఇట్లాగే ఈ సంకలనంలోని గేయాలు రాజకీయంమీద, ఆచారాల మీద వెక్కిరింతలుగా కనబడతాయి.

# ఉషస్సు

(కవితా సంకలనం)

[వెల : రు.2-00 లు. డి.వి.డి.యస్.ప్రసాద్, ప్రతులకు : డి. వి. డి. యస్. ప్రసాద్, 7/2, హెచ్. నెం: 6-7-56, అరండల్‌పేట, గుంటూరు-522 002.]

ప్రసాద్‌గారి మినీ కవితా సంకలన మిది. ఈ సంకలనంలోని గేయాల్లో రచయిత దృక్పథం స్పష్టంగా కనబడదు. అయితే కర్మ సిద్ధాంతంమీద, సంప్రదాయం పేరుతో చెలామణీ అవుతున్న జడ సిద్ధాంతాలమీద రచయితకు ప్రగాఢమైన విశ్వాసమున్నట్లు కవితల్లో అక్కడక్కడా, రచయిత చివర చెప్పుకున్న వచనంలోనూ వెల్లడవుతుంది. 'తప్పదు విధి వ్రాసిన నుదుట, కష్ట సుఖముల కన్నీటి పాట, కర్మనుబట్టి మనిషి, మనిషినిబట్టి మనసు, మనసునుబట్టి మాట, మాటనుబట్టి మన్నన' మొదలైన పాదాల్లో ఈ ధోరణి వ్యక్తమవుతోంది. 'యుగయుగాలుగా ప్రపంచంలో సంపూర్ణత్వంతో ప్రతిష్ఠితమైన సాంప్రదాయక తత్వాలు అల్పుల వితండ వాదాలతో మారతాయనుకోవడం వట్టి భ్రమ మాత్రమే. అంతఃకరణ శుద్ధితో వేద

వేత్త లుపదేశించిన ఉపదేశాల్ని మనం ప్రగతి నిరోధకా లనుకుంటు న్నామే కాని నిగూఢమైన మానవజీవిత తత్వాన్ని శోధించి పరిశీలించి భవిష్యద్దృష్టితో చెప్పిన సత్యాల్ని మనం మొండితనంతో పెడసరపు మనస్తత్వంతో అర్థం చేసుకోలేక పోతున్నామని అనుకోవటంలేదు. అవిశ్వసనీయంగానే కాక పునరుచ్చరించడానికి పనికిరాని అనేకమైన నూతన సిద్ధాంతాల్ని చెప్పేవారందరూ చివరి దశలో సాంప్రదాయక వ్యవస్థలోనే తమజీవితాల్ని ముగించడం మనంచూస్తూనే ఉంటాము' అని రచయిత ప్రగతినిరోధక భావాలనుచూస్తే ఆయన కవితాతత్త్వం పూర్తిగా అర్థమవుతుంది. చలంలాంటి రచయితని ఒకణ్ణి మనస్సులో పెట్టుకుని సంప్రదాయక మార్గంలో జీవితాల్ని చాలిస్తున్నారని చెప్ప టం చాలామందికి పరిపాటి అయింది. ఇట్లాంటి వారందరికీ ఒకటే సమాధానం. చలం జీవితం, సాహిత్యం వీళ్ళకిఅసలు అర్థమయ్యాయా? అని. సమాజాలు మారుతున్నప్పుడల్లా వాటి విలువలు కూడా మార తాయని గ్రహించలేని వాళ్ళందరూ నవ్య సిద్ధాంతాలను ఉచ్చరించడా నికి వీలులేని భావాలుగా మాత్రమే పరిగణిస్తారు. ఏమైనా ప్రసాద్ గారి కవిత్వం కంటె వారి వచనం తీవ్రమైంది. వారు కవిత్వంలో కంటె,సినిమాల్లోనే (ముందు పరిచయ వాక్యాల్లో చెప్పినట్లుగా) స్థిరపడాలని నా ఆశ.

## చైతన్య కిరణాలు

(చేతన సాహితీ సంకలనమ్)

[వెల: రు. 2–50 లు. ప్రతులకు: వి. రాజేశ్వర ప్రసాద్, డోర్ నెం: 6/134, పార్కు స్ట్రీట్, స్టోన్ హౌస్ పేట, నెల్లూరు-2, ఆంధ్రప్రదేశ్.]

ఇది వివిధ కవుల వచన గేయ కవితా సంకలనం. ఇందులో పేరులో ఉన్నవారూ, పేరులోకి రావలసినవారూ కూడా ఉన్నారు. అట్లాగే పాశ్చాద్గమన వాదులూ, పురోగమన వాదులూ ఉన్నారు. సంకలనం మొదట్లో నెల్లూరులో చేతన సాహితి స్థాపితం దగ్గర నుంచి, ఈనాటిదాకా ఏతత్ సంస్థ సాధించిన ప్రగతిని పాఠకలోకానికి పరిచయం చేశారు. సంకలనంలోని గేయాల సంఖ్య అధికంగా లేకపో యినా గుణం మాత్రం అధికంగానే కనబడుతోంది. కొంత మంది కవుల పేర్లు పాఠకలోకానికి కొత్తనైనా వారి కవితాశిల్ప నైపుణ్యం చేయి తిరిగిన కవులకు ఏమాత్రమూ తీసిపోనట్లు ఈ సంకలనం చది వితే మనకర్థమవుతుంది. సంకలనం మొదట్లో మినీకవితలు మూడు ప్రచురించారు. (అవి వారు నిర్వహించిన పోటీల్లో వరుసగా బహు మతులు పొందినవి.) రాజేంద్ర పమిడిపాటి 'పతిత' గేయంలో

'పాలు లేవని ఏడ్చే బిడ్డని గదమాయిస్తోంది
పూలు లేవని గునిసే విటుని సముదాయిస్తోంది
తీరని ఆకలిని
పరుల ఆకలిని తీర్చి తార్చుకుంటోంది
బ్రతుకును తెరువు కోసం తార్చుకుంటోంది'

అనే పాదాలు కవితా హృదయం ఉన్న ఏ పాఠకుణ్ణయినా కదలించక పోవు. ఒకళ్ళని, ఇద్దరిని మినహాయిస్తే ఈ కవులందరూ రేపటిమీద ఆశ ఉన్నవారే. ఆగామి వ్యవస్థను సామ్యవాద వ్యవస్థగా భావిస్తున్న వాళ్ళే.

'కాలే కడుపుల్లో రగిలే మంటల్ని
కర్మ సిద్ధాంత కడలిలో ముంచేస్తున్న
పుండాకోరు గ్రద్దల గుండెల్లో
తూటానై పేలాలని ఉంది'

అంటున్నారు ఇసనాక మురళీధర్‌గారు.

'ఎన్ని కలాలు నిన్ను గూర్చి
గళాలెత్తి గర్జిస్తున్నాయో చూడు
అడుగు కదిపి ఐక్యతగా చేయి కలిపి
నీతికై నిలబడే జాతికై పోరాడు'

అంటున్నారు కస్తూరి వేణుగోపాల్‌గారు. ఇంకా ఈ సంకలనంలో అనేకమంది కవుల మంచి కవితలు, ఒక కథానిక, ఒక కార్టూన్ వున్నాయి. ఊరుబండి వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు వారి కవితలో సింబాలిజం, సర్రియలిజం, డాడాయిజాలను వెక్కిరిస్తూ దేవుడులేడ నటమే ఈనాటి అశాంతికి కారణమని తీర్పు చెప్పడం వారి గత కాల దృక్పథానికి తార్కాణం. పోతే వచన గేయానికి 'దారిద్ర్య సాగరావ గణిత జీవన పరివేష్టిత, నిరాశా దావానలదగ్ధ మానస నికృష్ట జీవ చ్ఛవాల' లాంటి శైలి ఎంతవరకు అతుకుతుందో అవధానం నాగేశ్వర రావుగారు ఆలోచించాలి. నెల్లూరు చేతన సాహితి సాహిత్య పరంగా సాధించిన అభ్యుదయానికి ఈ సంకలనం మంచి ఉదాహరణ. భవిష్య త్తులో ఈ సంస్థ ఇంకా అభివృద్ధిని సాధించాలని ఆకాంక్షిద్దాం.

## ఆ శా కి ర ణ ం

[తుంగతుర్తి విశ్వనాథశాస్త్రి. వెల: రు. 5–00లు. ప్రతు లకు: శ్రీనివాస సాహితీ సమితి, 1-1-336/58, వివేకనగరం, హైదరాబాదు–20]

విశ్వనాథశాస్త్రిగారి అనేక భావాల సంగమంగా రూపొందిన కవితా సంకలన మిది. ఈ సంకలనానికి ఎల్లోరాగారు, డా॥ దాశరథి, డా॥ నారాయణరెడ్డి మొదలైనవారు పరిచయాలు రాశారు. పూర్వ ప్రబంధాల్లో కృతి పలు వంశ చరిత్రల్లాగా ఈనాటి సంకలనాలకు 'ముందు మాటలు' సంప్రదాయం అయి కూర్చున్నాయి. ఎల్లోరాగారు వచన కవితకు సామాజిక స్పృహ అవసరమని, సాహిత్యం వ్యక్తికాదని, కవి తానేదో రాసుకుని తానే ఆనందిస్తాననే రోజులు పోయాయని 'సమాజం కోసం' అనే వారి ముందుమాటలో చెప్పారు. విశ్వనాథ శాస్త్రిగారు 'నా మాట'లో 'వచన కవితకు వస్తువేదైనా కావచ్చును. సమాజ సమస్యలు మాత్రమే వచన కవితలో చోటు చేసుకోవాలనటం సరియైన భావన కాదని నా అభిప్రాయం. వచన కవిత్వ పరిధి పెరి గింది. ఈనాడు అది సామాజిక స్పృహకే పరిమితమైలేదు. ఇది

వాస్తవిక పరిస్థితి' అని చెబుతున్నారు. విశ్వనాథశాస్త్రిగారి మాట లనుబట్టి అర్థమయ్యేది ఈనాటి కవితకు సామాజిక స్పృహ ఒక్కటే లక్షణం కాదని. సామాజిక స్పృహతోపాటు కవిత్వంలో వైయక్తిక భావాలుకూడా ప్రవేశించవచ్చునని శాస్త్రిగారి తీర్మానం. అందుచేతనే 'ఆశా కిరణం' అనే గేయంలో పాంథుడు 'భగవత్స్వరూపులైన అర్చ కుల' ఆదేశాన్ని విని 'భగవద్గీత విన్న అర్జునునిలా' లేచి— 'భావి సరో వరంలో పూవులు పూయించటానికి, జీవన శరద్రాత్రులలో దివ్వెలు వెలిగించడానికి' నిశ్చయించాడు. ఈ సంకలనంలో చాలా గేయాలు పండుగలకు, స్వాతంత్ర్య దినోత్సవానికి, బంగ్లాదేశ్ యుద్ధానికి, పాక్ యుద్ధానికి సంబంధించినవి. అంటే వీటిని అకేషనల్ పొయిట్రీ అనొచ్చు. శాస్త్రిగారికి దేవతలపట్ల ఎంత విశ్వాసం ఉందో, సమాజ దౌర్భాగ్యంపట్ల అంత వేదన వున్నది. ఈ సమాజం సత్వరం మారా లనే వారి ఆకాంక్ష. అయితే దానికి మార్గం మాత్రం శాస్త్రిగారికి దృశ్యమానం కావటంలేదు. కనుకనే

'ఓ అంబా! జగదంబా!
ఒక్కసారి నీ కత్తిని
అవనిపై వెలసిన
అపర దానవులపై ఎత్తాలి'

అని మహిషాసుర మర్దనిని ప్రార్థిస్తూనే —

'మేలుకో మేధావీ
నిదుర మేలుకోవోయీ
నీ దేశం రుద్ర భూమి కాకముందే
నిద్ర మేలుకోవోయీ'

అంటూ మేధావులకు మేలుకొలుపు పాడుతున్నారు. మళ్ళీ వారే—జనత మేల్కొన్నది, జవనాశ్వంలో పరుగెడుతున్నది అంటున్నారు. 'మొన్నటి దాకా దేశంలో, విలయతాండవం చేసిన పెద్దక్క, ప్రగతిచూసి విస్తు పోయింది, పత్తాలేకుండా పారిపోయింది అంటున్నారు శాస్త్రిగారు. 'పెద్దక్క' అంటే దరిద్రం. దరిద్రం పత్తాలేకుండా పారి పోయిందంటే పాఠకుడు నమ్ముతాడా? దేశం సాధించిన ప్రగతి ప్రతి ఫలం అనుభవిస్తున్న దెవరు? ఇది శాస్త్రిగారికి తెలియని ప్రశ్నకాదు; ఆయన లబ్ధ ప్రతిష్టుడైన కవి. భావ వైరుధ్యాలవల్ల గమ్యం అగ మ్యంగా వున్నప్పటికీ సారళ్యాన్ని సాధించిన శైలిలో వచన గేయాన్ని నడపడంలో సిద్ధహస్తులని ఈ సంకలనం ద్వారా ఋజువు చేసు కున్నారు తుంగతుర్తి విశ్వనాథశాస్త్రిగారు.

## చిలకలు వాలిన చెట్టు

[ఇస్మాయిల్. వెల: రు. 10–00లు. ప్రతులకు: ఇస్మాయిల్, లచ్చిరాజు వీధి, కాకినాడ–1.]

కవిత్వాన్ని గురించి, దాని తత్వాన్ని గురించి అనేక చర్చలు జరుగుతున్నాయి. కవిత్వానికి సమాజపరమైన బాధ్యత వున్నది అని అంగీకరించేవారు అధిక సంఖ్యాకులైనా, అట్టిబాధ్యత కవిత్వానికి ఏమీ లేదు; కవియొక్క స్వీయానుభూతి అభివ్యక్తీకరణ కవిత్వ దృక్పథంగా భావించే కవులు కొంతమంది వున్నారు. ఇట్లా కవి తనదైన ఒకానొక అనుభూతిని కవిత్వంగా రూపు కట్టించేటప్పుడు తనదైన ఒక ప్రత్యేక అభివ్యక్తీకరణ పద్ధతిని అవలంబిస్తాడు. ఈ మార్గంలో కవిత్వం కొంతమందికి అస్పష్టంగా కనపడవచ్చు. అది అస్పష్టమా? లేక కవిత్వంలోని సంక్లిష్టతా? అన్నది తేల్చుకొనవలసిన బాధ్యత సంస్కా రంగల పాఠకునిపై ఆధారపడి వుంటుంది. ఇస్మాయిల్‌గారి 'చిలకలు వాలిన చెట్టు' కవితాసంకలనం ఆయనదైన అనుభూతి వ్యక్తీకరణకు తార్కాణం. సామాజిక అవగాహనకు అతీతంగా కవిత్వం రాస్తున్న వారిలో ఇస్మాయిల్‌గారు సుప్రసిద్ధులు. 'చిలకలు వాలిన చెట్టు' ఇప్పటివరకూ ఆయన రాసిన కవితలన్నిటి సమాహారం.

నడక వచ్చీ రాని పాప వేసే అడుగులు ఇస్మాయిల్‌గారి భావుకతలో ఎట్లా రూపు కట్టినాయో ట్వింకిల్ అన్న ఖండిక సూచిస్తుంది.

"ఈ పాపకు రెండేళ్ళు
ఎగిరే సీతాకోక చిలకలు
ఊగుతో నడిచే
దీని పాదాలు
పియానోపై
తప్పతాగి అడుగులేసే
వేళ్ళు."

'వైరు' గేయం నగ్నమునిగారి కోసం రాసినది. ఈ గేయంలో నగ్నమునిగారికి, ఇస్మాయిల్‌గారికి వున్న అనుబంధం వెల్లడయింది. నగ్నమునిగారి పతనానికి ఎవరో చూస్తున్నట్లు, లేక వారు కవిత్వంలో సాధించిన విజయానికి వేరెవరో అసూయాగ్రస్తమానసులు వారి పత నాన్ని కోరుతున్నట్లు, దానిని జయించి నగ్నమునిగారిని ఇంకా జ్వలించ మని ఇస్మాయిల్‌గారు చెబుతున్నారు. కవిత్వపరంగా, దాని ప్రయోజన పరంగా నగ్నమునిగారికి, ఇస్మాయిల్‌గారికి అనంత వ్యత్యాసం వుంది.

'... ... ... మీ
పతనం కోసం వీళ్ళు
పొంచి చూస్తున్నారు
... ... ... ... ... ...
జలపాతమై తలకిందులుగా మొలిచి
సంధ్యాకాశంలోకి వేర్లు తన్ని
ఆకాశపు రక్తాన్ని పీల్చండి
చీకటి లోకంలో జ్వలించండి.'

అని చెబుతున్నారు నగ్నమునికి.

అనంతపురంలో గాడిదలుగేయం బహుశా రచయితల సంఘా లను దృష్టిలో వుంచుకొని రాసినదనుకుంటాను. ఆ గేయం చదవ గానే ఎవరికైనా అర్థం అయ్యేది ఇదే భావం. అక్కడ రెండు గాడిద లున్నాయి వాటి వివరణ ఇది.

''నువు తూర్పుకేసి చూడు
నేను పశ్చిమానికి చూస్తుంటా,
ఎట్నుంచి జ్ఞానోదయమౌతుందో
ఎవరు చెప్పగలరు ?
ఉన్నట్టుండి
ఓండ్ర పెడుతూ ఓ గాడిద
గుండ్రంగా పరుగులెత్తి
ఒకటి రెండు చుట్లు తిరిగి
మొదటిచోటికే చేరుతుంది
రెండో గాడిద చలించదు
ఏమైందని కూడా అడగదు
తూర్పున తప్ప జ్ఞానోదయం కాదని
దానికి తెలుసు.''

ఈ పాదాల్లో వ్యంగ్యం రచయితల సంఘాలపైన అన్నది స్పష్టం.

దేశ రాజకీయ వ్యవస్థపైన ఒక సెటైరు చాలా శక్తివంతమైన నేర్పుతో రాశారు ఇస్మాయిల్‌గారు.

''చిన్నప్పుడు —
తన్నెంతో ప్రేమించిన బొమ్మని
దేశభక్తి కోసం
మంటలో తగలేసిందట
పెద్దయాక —
స్వార్థం కోసం
దేశాన్నే తగలేసిందంటే
ఆశ్చర్యమేముంది ?

ఇస్మాయిల్‌గారు తన కవిత్వం సమాజంకోసమని ఎక్కడా చెప్పిన దాఖలాలు లేవు. ఆయన కవిత్వం చెప్పే విధానం, ఆయన భావుకతనచ్చితే 'చిలకలు వాలిన చెట్టు' చదువరి చదువుతాడు. నచ్చటం అంటే భావమైక్యత అని మాత్రమే భావించాలి. ఎవరి కవిత్వం వారికోసమే అయితే అసలు పేచీయే ఉండదు.

## ఆమ్రపాలి

[కరటూరి సత్యనారాయణ. మూల్యం : రు. 10–00 లు. ప్రాప్తిస్థానం : కరటూరి సత్యనారాయణ, బి. ఎ., 'పద్మ ప్రభాస' వేలూరివారి వీధి, జయకృష్ణపురం, రాజమండ్రి–533 104.]

ఆమ్రపాలి కథను ఇప్పటికే నవల రూపంలోను, కావ్యరూపంలోను కొంతమంది చిత్రించారు. కళాప్రపూర్ణ డా॥ ఎస్. టి. జ్ఞానానంద కవి ఆమ్రపాలి కావ్యం రాశారు. బౌద్ధ కథలమీద మక్కువతో 'తిష్యరక్షిత' కావ్యం రాసిన కరటూరి సత్యనారాయణగారు ఆమ్రపాలి కావ్యాన్ని కరుణరసభరితంగా రాశారు. సప్తసర్గల కావ్యం ఇది.

వైశాలి, మగధ రాజ్యములు ప్రక్క ప్రక్క నున్నవి. మగధ రాజ్యాన్ని బింబిసారుడు పాలిస్తున్నాడు. వైశాలిలో ప్రజాస్వామ్యము నెలకొన్నది. వైశాలి గణ పరిషత్తునకు మహానాముడు అధ్యక్షుడు. ఆతనికి దొరికిన బిడ్డ ఆమ్రపాలి. ఆమ్రపాలి సౌందర్యానికి లిచ్ఛవులు దాసులవుతారు. అభయుడు తనకు దక్కని ఆమ్రపాలి సౌందర్యము వేరొకరికి దక్కకూడదనే దుష్ట తలంపుతో ఆమ్రపాలిని పౌరవేశ్యగా చేయగలిగెను. బింబిసారునితో సంపర్కమువలన ఆమ్రపాలికి కుమారుడు పుడతాడు. చేతకుని కుమార్తె చాలనను బింబిసారుడు వివాహమాడతాడు. మహానాముని అనంతరం ఆతని కుమారుడు ఆనందుడు శ్రమణకుడు అవుతాడు. ఆమ్రపాలి కుమారుడైన విమలునకు భిక్షుకత్వ మిప్పిస్తాడు ఆనందుడు. చిట్టచివరకు ఆమ్రపాలికూడా భిక్షుకత్వాన్ని స్వీకరిస్తుంది. ఈ కథను రసరామణీయకంగా తీర్చిదిద్దారు కరటూరివారు. సమీక్షా పరిధి వలన ఆయన కవితా వైశిష్ట్యానికి, వైదుష్యానికి ఒకటి రెండు ఉదాహరణ లిచ్చి సరిపెడతాను.

మహానాముని పాత్ర లక్షణాలను వివరిస్తూ

''ధర్మదేవత యవ రావతారమతఁడు
క్షాత్ర తేజము మూర్తియై క్రాలు నతఁడు
ప్రథిత క్రమశిక్షణకు నాలవాలమతఁడు
శాంతమే రూపుగొన్న సజ్జనుం డతండు''

అంటారు సత్యనారాయణగారు మహానామునిపై లక్షణమే తన కుమార్తెను పౌర వేశ్యగా నియమించునపుడు గణపరిషత్తు అభిప్రాయాన్ని అంగీకరించేటట్లు చేస్తుంది. ఆమ్రపాలి సౌందర్యాన్ని వర్ణించేటప్పుడు కవిగారు ప్రబంధ సంప్రదాయాన్ని అనుసరించలేదు. ఉదాహరణకు—

భువికిన్ డిగ్గిన యప్సరోంగన కళా
ముగ్ధావతారమ్ము న
వ్యావి తోద్యాన వనీ వికస్వర సుధా
తారుణ్య పుష్పమ్ము శ్రీ
లవతీ లోక శిరో విభూష విలస
ల్లావణ్య మధ్వీ మహా
సవ పూర్ణామల హేమకుంభము రమా
సర్వస్వ సౌందర్యమై.''

అట్లనే కుమారుడు భిక్షుకత్వాన్ని స్వీకరించాడనే బాధతో సిద్ధార్థుణ్ణి రక్తసంబంధాలకు అతీతుడని నిందేటప్పుడు సత్యనారాయణగారి శైలి సందర్భాన్ని ఇనుమడింపచేసేదిగా ఉంది.

''తల్లినిఁ జంపి పుట్టితివి
తల్లియొడిన్ శయనింపలేదు, నీ
యుల్లమునందు నక్కటిక
మున్నదె ? నీవు ప్రయాంగనన్, సుతున్ గ
మెల్లగ వీడి వచ్చితివి
మిన్నక, నీకిపుడర్థమౌనె యా
తల్లి యెడంద ? చెప్పెదవు
ధర్మము లోకము నుద్ధరింపగా.''

ఆమ్రపాలియొక్క దయనీయమైన, కరుణార్ద్రమైన మాన సిక స్థితికి, ఆస్థితిలో తథాగతునితో ఆమె సంభాషణకు, ఏతత్ సన్ని వేశానికి సరిపోయిన శైలి పై పద్యంలో కనబడుతుంది.

"ఈ యవిజ్ఞాత హేతువు నెఱిఁగినపుడు
పరిమళించును సుమ్ము నీ బ్రదుకుబాట
వెలుగు కిరణమ్ము చీకటి వెడలజేయు
పడయుదువు తల్లి నిర్వాణపదము భక్తి"

అన్న బుద్ధుని బోధతో ఆమ్రపాలికి జ్ఞానోదయం, కావ్యం ముగింపు జరుగుతాయి. కరటూరి వారి కవితా వైదగ్ధ్యానికి ఈ కావ్యం చక్కని ఉదాహరణ.

**శ్రీ టి. ఎల్. కాంతారావు**

# బాలల ఆరోగ్య పరిరక్షణ

[రచన: డా. దమ్మలపాటి బ్రహ్మానందం. యం. డి. పేజీలు: 63. వెల: రూ. 3—00. ప్రచురణ: డా. దమ్మలపాటి బ్రహ్మానందం, పోలిక్లినిక్, తణుకు, పశ్చిమగోదావరి].

వర్ధమానదేశాల్లో ప్రతిఏటా 13కోట్లమంది బిడ్డలు పుడుతూంటే, వారిలో 13మిలియన్లమంది పట్టుమని పది,పన్నెండు నెలలు నిండకుండానే కన్నుమూస్తున్నారు. మనదేశంలో సుమారు 25 కోట్లకుపైగా పిల్లలున్నారు. అంటే భారత బాల జనాభా—మొత్తం అమెరికా జనాభాకంటే అధికమన్నమాట. ఆ దేశంలో నున్న పిల్లల ఆరోగ్య సంపదను—ఆ జాతి సాధించిన ప్రగతికి, అభివృద్ధికి సంకేతంగా పరిగణించవచ్చు.

అందుకే ప్రపంచ ఆరోగ్యసంస్థవారు, 1979వ సంవత్సరాన్ని—అంతర్జాతీయ బాలల సంవత్సరంగా పేర్కొని "ఆరోగ్యమైన బిడ్డ-భద్రతున్న భవిష్యత్తు"—అనే నినాదాన్ని ప్రపంచానికందించింది.

కుటుంబనియంత్రణ ప్రాముఖ్యత పెరిగిన కొలదీ — పిల్లల ఆరోగ్యాన్ని పదిలపర్చడంలో కూడా ప్రాధాన్యత హెచ్చింది. దానితో వివిధ బాలారిష్టాల నధిగమించ వలసిన అవసరం, అధికమైనది. గర్భధారణలోనున్న తల్లి తీసుకొనవలసిన జాగ్రత్తలేమిటి? పుట్టిన బిడ్డ బరువెంతుండాలి? పెరుగుదల ఎలా వుండాలి? వ్యాధి నిరోధానికి తీసుకోవలసిన జాగ్రత్త లేమిటి? వైద్యుని వద్దకు వెళ్ల వలసిన సందర్భం ఏమిటి? యివన్నీ సమస్యలే.

పసిబిడ్డలకు 3,4 సార్లు విరేచనాలయితే చాలు — వంటిలోని నీరు, లవణాలు వంటివన్నీ బయటికి పోతాయి. అసలే వీరికి శరీర పరిమాణం తక్కువ — దానితో వారి పనయిపోతుంది. కానీ వెంటనే ఓ సలైన్ సీసా ఎక్కిస్తే మంత్రం వేసినట్లు కోలుకొంటారు.

అదేమాదిరి పసిపిల్లలకి పాలు పట్టేప్పుడు—నీరెంత కలపాలి? ఎప్పటినుండి అన్నంపెట్టాలి? పిల్లలు ఏడవడానికి సాధారణమైన కారణాలు ఏమిటి? యివన్నీ సమస్యలే. ఈ సందేహా లన్నింటికీ సమాధానాలు యింటిలోని పెద్దలు తమ అనుభవాలను రంగరించి—పరిష్కారమార్గాలు చెబుతారు.

కానీ వీటన్నింటికీ శాస్త్రీయమైన సలహాలు చెప్పారు, శిశు వైద్యంలో అనుభవం పండిన డాక్టర్ బ్రహ్మానందంగారు.

అందమైన ముఖచిత్రంతో ప్రచురించిన, ఈ చిన్న పొత్తం వెల కాస్త తక్కువగా వుంటే, మరింత హెచ్చు ప్రచారం జరగడాని కవకాశం వుండేది.

**డాక్టర్ శివాజీ**

# ఋగ్వేదము

[ఏకదేవతా ప్రతిపాదకముగు ఆంధ్రవివృతి. ఆనందతీర్థ భాష్యము, దాని వ్యాఖ్యలపై ఆధారపడిన ప్రథమాంధ్ర వివృతి. రచయిత: డాక్టర్ ఎస్. బి. రఘునాథాచార్యులు, ఎమ్.ఎ., పిహెచ్.డి. ప్రచురణ: శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాచ్య పరిశోధనాలయము, తిరుపతి. 317 పుటలు గ్రంథము. 20 పుటలు ఆచార్య కొత్త సచ్చిదానందమూర్తి, శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం, ఉపకులపతి వ్రాసిన ఉపోద్ఘాతము, 1978. వెల రూ. 54—00]

క్రీ. శ. 13వ శతాబ్దిలో వర్ధిల్లిన శ్రీ ఆనందతీర్థులు (మధ్వాచార్యులు) ఋగ్వేదములో రెండున్నర అధ్యాయములలోని నలుబది సూక్తములపై విష్ణు ప్రతిపాదకముగ వ్యాఖ్యానము చేసిరి. దానిపై జయతీర్థులు, రాఘవేంద్రులు టీకను, మంత్రార్థమంజరి యను వ్యాఖ్యను రచించిరి. వీటినాధారముగ ప్రస్తుత గ్రంథము రచింపబడెను. మధ్వాచార్యులు, వారి అనుయాయులు కేవలం విష్ణు దేవుని యందలి భక్త్యావేశముతో వేదసూక్తములను విష్ణుపరముగ నభివర్ణించిరని సాహసించి చెప్పజాలము. వేదములందే మేకదేవతా వాదము కంఠోక్తిగా ప్రతిపాదించబడియున్నది. సౌరసూక్తములలో "ఇంద్రం మిత్రం వరుణ మగ్నిమాహు రథోదివ్యఃససుపర్ణోగరుత్మాన్। ఏకం సద్విప్రాబహుధా వదన్త్యగ్నింయమం మాతరిశ్వాన మాహుః॥ కృష్ణం నియానం హరయస్సుపర్ణా అపోవసానా దివముత్పతన్తి." ఐశ్వర్యగుణమునుబట్టి యింద్రుడని, రక్షణ గుణమునుబట్టి మిత్రుడని, పాపమునుండి కాపాడు గుణమునుబట్టి వరుణుడని, అట్లే గుణభేద ములబట్టి అగ్నిఅని, యముడని, సుపర్ణ గరుత్మంతుడని, అన్తరిక్ష వాయువని, నల్లని వర్ణముగలిగి ఉదకములు మోయు మేఘముగను బుధులు ఒకే దైవమగు అన్తరిక్షగామియైన సూర్యుణ్ణే చెప్పు చుందురు (స్తుతించెదరు) అని చెప్పబడెను. ప్రకృతియందు గావవచ్చు శక్తుల కన్నిటికి మూలముగ నొక పరదైవమున్నదను సిద్ధాంతము వేదములందే ప్రతిపాదింపబడియున్నది. ఆ యంశమును దిగ్దర్శముగా శ్రీ మధ్వాచార్యులు (ఆనందతీర్థులు) కొన్ని సూక్తములకు భాష్యము రచించి చూపిరి. దానిపై వారి అనుయాయులు రాఘవేంద్రులు మంత్రార్థమంజరియను విపుల వ్యాఖ్యానము గావించిరి. మూల భాష్యమునకు విపులటీకను రచించుచు శ్రీ జయతీర్థులు వారిప్రయత్న తాత్పర్యమును ఈ విధముగ జెప్పిరి.

"ఋగర్థశ్చత్రివిధో భవతి. ఏకస్తావత్ ప్రసిద్ధాగ్న్యాదిరూపః. అపరస్తదన్తర్గతేశ్వర లక్షణః, అన్యోఽధ్యాత్మరూపః, తత్త్రితయ పరంచేదంభాష్యం"

అంటే ఋగర్థము ప్రసిద్ధమైన అగ్నిపరముగను, రెండవది తదన్తర్గత ఈశ్వరునిపరముగను, మూడవది అధ్యాత్మరూపముగను ఉండునని చెప్పిరి. ప్రస్తుత గ్రంథకర్త శ్రీ రఘునాథాచార్యులుగారు విశదీకరించిరి. ఆ వ్యాఖ్యానముల ననుసరించుచు వీరు ఆనందతీర్థుల వారి భాష్యమునకు తాత్పర్యమును, సూక్తముల ప్రతిపదార్థమును తెలుగులో వ్రాసిరి.

గ్రంథాదిలో వెంకటేశ్వర విశ్వవిద్యాలయ ఉపకులపతి శ్రీ కొత్త సచ్చిదానందమూర్తిగారి విపుల ఉపోద్ఘాతముగలదు. అందువేదములు, వేదభాష్యాలు, ప్రస్తుత గ్రంథవిశిష్టత వివరించబడెను. గ్రంథాంతమున అనేక విశేషాంశములు నోట్సులో నొసగబడెను. ఇందు వేదపరిభాషలో సామాన్యులందరికి తెలియని పనేకము విశదీకరించబడెను. ఈ సూక్తములందున్న ముఖ్యపదసూచి, మంత్రసూచి, దేవతాసూచి, ఋషిసూచి, ఛన్దస్సూచి, అనుబంధముగ నొసగబడెను.

ఋగ్వేదముయొక్క స్వరూపమును దిఙ్మాత్రముగ తెలిసికొనుటకీ గ్రంథముపకరించును. కాని కాలాను గుణంగా గ్రంథము వెల యెక్కువని చెప్పవలెను. విద్యాప్రచారమే ప్రధానాశయంగా పనిచేయు విశ్వవిద్యాలయం వంటి సంస్థలు, విశేషించి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం వారు హైందవ ధర్మానికి మూలకందములనదగిన ఇట్టి వైదికవాఙ్మయమును అందరికి అందుబాటులో నుండునట్టి వెలలతో పుస్తకముల ప్రచురించుచో బాగుండును.

## ఐదు గ్రంథములు

శ్రీ చర్లగణపతి శాస్త్రిగారిచే రచింపబడిన ఈయనువాద సహిత వివరణగ్రంథములు వెలువడెను.

### కణాదమహర్షి ప్రణీతమైన– వైశేషిక మీమాంసా దర్శనము

[1978. వెల : రూ. 3–00]

### గౌతమమహర్షి ప్రణీతమైన – న్యాయ మీమాంసా దర్శనము

[1977. వెల : రూ.3–00]

### వ్యాస మహర్షిప్రణీతమైన– బ్రహ్మమీమాంసా దర్శనము

[1976. వెల: రూ. 10–00]

### ఉపనిషత్సుధ, రెండవభాగము

(ముండ, మాండూక్య, తైత్తరీయ, ఇతరేయోపనిషత్తులు)

[1977. వెల : రూ. 2–00]

### బుద్ధభగవానుని చరిత్ర.

(బుద్ధఘోషుని పద్యచూడామణికి, అశ్వఘోషుని బుద్ధచరిత్రకు అనువాద రూపము. ఆంధ్రపద్యకావ్యము.)

[1977 వెల రూ. 4–00]

వీటిలో మొదటి మూడు సూత్రరూపములగు ఆర్షమూల గ్రంథముల కనువాదములు. ఈ సూత్రములపై సంప్రదాయ సిద్ధములగు వ్యాఖ్యానములు రచింపబడి ప్రత్యేక శాస్త్రములుగ ప్రసిద్ధములై యున్నవి. అతిక్లిష్టముగ నుండుటచే గురుకులములో దీర్ఘకాల మభ్యసించినగాని స్వాధీనము కావు. కాణాదము (వైశేషిక దర్శనము), పాణినీయము (వ్యాకరణము) సర్వశాస్త్రములకు ఉపకారకములని చెపుతారు. ఆ రెండు శాస్త్రాల్లోను తగినంత కృషి చేస్తేనేగాని యితర శాస్త్రాలేవి సరిగా బోధపడవని అర్థము. అదే విధంగా తర్కశాస్త్రంలో మొదట చదివే అన్నంభట్టు రచించిన తర్కసంగ్రహములో ప్రార్థన శ్లోకంలో 'బాలానాం సుఖబోధాయ క్రియతే తర్కసంగ్రహః' అనుచోట 'బాల' పదాన్ని నిర్వచిస్తూ 'అధీత వ్యాకరణ కావ్యకోశో నాధీతన్యాయో బాలః' అని చల్లగా వ్యాఖ్యానిస్తారు. అంటే వ్యాకరణం, కావ్యాలు, నిఘంటువులు చదివి వల్లించి న్యాయశాస్త్రాన్ని అభ్యసించ గోరువాడు బాలుడని చెప్పారు. తర్కశాస్త్రం చదువగోరు విద్యార్థికి ఆనాడు ప్రవేశార్హత అట్లాంటిది బ్రహ్మమీమాంసా దర్శనానికి కూడ నిట్లే శాస్త్రాంతర పరిజ్ఞానము వసరము.

శ్రీ చర్లగణపతిశాస్త్రిగారు సంస్కృతాంధ్రములలో సుప్రసిద్ధ విద్వాంసులు. వారి యీ శాస్త్ర గ్రంథానువాదములు ప్రామాణికములనుటలో సందియములేదు. అనువాదముతోబాటు సూత్రములను సంక్షిప్తముగా వివరించిరి. అంతమటుకు వీరికృషి ప్రశంసార్హమే. కాని పైజెప్పిన 'బాల' శబ్ద నిర్వచనాను సారముగ నితర శాస్త్రములందు ప్రవేశమున్నవారికిగాని వీరి రచనలైనను సరిగా అర్థముకావు.

ఆ శాస్త్రములందలి విషయమే అట్టిది. సామాన్య జిజ్ఞాసువులకు వీరియనువాదములు వివరములు సులభముగ బోధపడవు. అయినను శాస్త్రాంతర పరిచయమేమాత్రమైనను గడించి విశేషజిజ్ఞాసతో నీ దర్శనముల సారాంశము తెలియగోరువారికి ఈ గ్రంథములు అత్యంతోపయుక్తములు. గురుముఖమున నాటినభ్యసించుట కవకాశములేని వారికీ గ్రంథములు తెలుగులో కొంత తోడ్పడగలవు. ఆయాదర్శన మర్యాదలను వీరి గ్రంథములు సుబోధ మొనర్చుచున్నవి.

బ్రహ్మమీమాంసా దర్శనమందు బ్రహ్మసూత్రములకు విశేషించి తెలుగులో ప్రతిపదార్థముగూడ నిచ్చిరి. ప్రౌఢవ్యాఖ్యానములతోగాని బోధపడని వేదాంత దర్శనమును అతిసులభమగు శైలిలో నుపనిషద్వాక్యముల నుదహరించుచు శాస్త్రజటిలత్వము లేకుండ

వివరించిరి. ఇది సామాన్యులకు కూడ నర్థమగునట్లు రచింపబడెను. వేదాంత దర్శనమును స్వయముగ నభ్యసించ గోరువారికీ గ్రంథము విశేషించి తోడ్పడగలదు. కొన్ని సాంకేతిక (పరిభాషా) పదములకు తెలుగులో వివరణముగూడ విశేషించి చెప్పబడెను.

ఉపనిషత్సుధ—రెండవభాగము. దీనిలో ముండ, మాండూక్య, తైత్తిరీయ, ఐతరేయోపనిషత్తులకు ఆంధ్రానువాదమేగాక తెలుగు పద్యములు కూడ రచింపబడెను. సాధారణముగ నుపనిషత్తులు పారాయణ చేయుచు ఆధ్యాత్మికచింతనజేయు తెలుగువారికందరికి ఈయనువాద గ్రంథము మిక్కిలి యుపయోగపడును. పైజెప్పిన బ్రహ్మమీమాంసా దర్శనమందును, ఈయుపనిషత్సుధ యందును అద్వైతాది మతభేదములతో బ్రసక్తిలేకుండ శ్రీ గణపతి శాస్త్రిగారు తేటతెల్లమగు తెలుగు అనువాదమును కొద్ది వివరణమును వ్రాసిరి. కనుక వేదాంత దర్శనము యొక్క సాధారణ జ్ఞానమునకై పాటుబడు వారికందరికి ఈ రెండు గ్రంథములు మిక్కిలి తోడ్పడగలవు.

శ్రీ గణపతి శాస్త్రిగారి యైదవగ్రంథము బుద్ధభగవానుని చరిత్ర. ఇయ్యది బుద్ధఘోషుని పద్యచూడామణికిని, అశ్వఘోషుని బుద్ధచరిత్రకును అనువాదరూపమైనది. రెండు గ్రంథములకేక కృతిలో సంపూర్ణానువాదము కష్టసాధ్యమైనను వీరు కొంతమటుకు ఆ ప్రయత్నములో కృతకృత్యులైరి. గ్రంథాదిలో మూలగ్రంథకర్తలైన బుద్ధఘోషుని యొక్క, అశ్వఘోషుని యొక్క వైదుష్యమును, కాలమునుగూర్చి సంక్షిప్తముగనైన చెప్పియున్నచో పాఠకులకు మిక్కిలి మార్గదర్శకముగ నుండి యుండెడిది. వీరి యనువాదము గద్యపద్యాత్మకమగు కావ్యము. శిష్టవ్యావహారికమగు తెలుగునువాడిరి. అచ్చుతప్పులు బహుళముగ నుండుటవలన ఈ రచనలో రమణీయత కొంత కుంటుపడినట్లు కన్పడును. కపిలవస్తు నగరవర్ణన, మహాభి నిష్క్రమణము, సిద్ధార్థుని బింబిసారుడుగాంచుట, పూర్వజన్మ పరంపరాస్మరణ, మున్నగు భాగములుకొన్ని అతి రమణీయముగ సాగినవి. అనువాదము, అందులో నిద్దరు ప్రసిద్ధ కవులననుసరించి చేయు రచనయగుట వలనకూడ సర్వతో ముఖపుష్టి నొందలేదని తోచును. సంస్కృతములోని మూలగ్రంథములు జదువలేని వారికీ యనువాదగ్రంథము కొంత కథాంశమును సమకూర్చుచున్నది.

ఈ పై గ్రంథములు దొరుకుచోటు.

శ్రీ చర్ల గణపతిశాస్త్రి,
33, కిర్లంపూడి క్వార్టర్సు,
ఆంధ్రయూనివర్సిటి, వాల్తేరు.

శ్రీ పరబ్రహ్మశాస్త్రి

## నవయుగకవి చక్రవర్తి

(జాషువా కవితపై పద్యాలు, వ్యాసాలు—మూడవ సంపుటి)

[ప్రకాశకులు : మహాకవి జాషువాజయంతి సమితి, మిషన్ హైస్కూలు రోడ్డు, నర్సాపురం, పశ్చిమ గోదావరి జిల్లా—534 275. సంకలనం: బి. థియడోర్. మూల్యం రు. 6–50.]

భారతీయులు కులమతాలకంటే ప్రతిభకే ప్రాధాన్య మిస్తారన డానికి మహాకవి జాషువా ప్రముఖోదాహరణ. ఈ నవయుగ కవి చక్ర వర్తిని గౌరవించని వారుండరు. నర్సాపుర సాహిత్యాభిమానులు మహా కవి జాషువా జయంతి సమితిని 1973లో స్థాపించారు. ఇది వారి మూడవ ప్రచురణ. ఈ సంస్థవారి కృషి ప్రశంసనీయంగా ఉంది. ఇందులో అనేక వ్యాసాలూ, కవితలూ, జాషువా పద్యాలకు ఆంగ్లాను వాదాలూ, జాషువా పద్యాలూ ఉన్నాయి.

వ్యాసాల్లో చెప్పుకోదగ్గవి డా॥ చావలి ముక్తేశ్వరరావుగారి 'మహాకవి జాషువాతో నాకుగల పరిచయం' అనేదీ, మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారి 'చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారి అభిమానము' అనేదీ. ముక్తేశ్వరరావుగారు జాషువాతోగల పరిచయాన్ని పురస్క రించుకొని జాషువా రచించిన రుక్మిణీ కళ్యాణ నాటకాన్ని గూర్చి ముచ్చటించారు. దాన్ని ఎవరైనా తిరిగి అచ్చువేయాలని ముక్తేశ్వర రావుగారు ఆశపడుతున్నారు. వారి ఆశను ఈ జాషువా జయంతి సమితే నెరవేరుస్తుందని ఆశించవచ్చు. శ్రీ మధునాపంతులవారు జాషువా ప్రయోగించిన 'యావనుడు' అనే శబ్దాన్ని సమర్థిస్తూ చెళ్లపిళ్లవారు ఒక పత్రికలో వ్రాసిన విషయాన్ని స్మరించారు. ఇటు వంటి పెద్దల జ్ఞాపకాలవలన మనం జాషువావంటి మహాకవులను గూర్చి అనేక సత్యాలను ఇప్పుడు తెలుసుకో గలుగుతున్నాం.

ఈ పుస్తకంలో వ్యాసాలూ, పద్యాలూ కలగా పులగంగా ఉండ కుండా ఉంటే బాగుండేది. ఇందులో జాషువా పద్యాల ఆంగ్లాను వాదాలు అనవసరం. జాషువా గొప్పతనం ఆంధ్రేతరులకు తెలియా లంటే ఆంగ్లానువాదాలను కలిపి ఒక సంపుటిగా ప్రచురించవచ్చు. అంతకంటే ముఖ్యం జాషువా కావ్యాలు అందమైన అచ్చుపుస్తకాలుగా అందరికీ అందుబాటులోఉండే ధరలకు లభించే ప్రయత్నాన్ని ఈసమితి చేయాలి. అదే జాషువాకి ఆంధ్రులర్పించుకునే కృతజ్ఞతాంజలి.

## శ్రీనాథుని కవితా సౌందర్యం

[రచన : డా. ముదిగంటి సుజాతారెడ్డి, ఎం. ఏ., పిహెచ్.డి. ప్రతులకు: 2 2–1105/21, రోహిణావ్, తిలక్‌నగర్, హైదరా బాదు—500 044. వెల : పదిహేను రూపాయలు].

ఇందులో శ్రీనాథుని జీవితం–రచనలు—వ్యక్తిత్వం, రూప చిత్రణ, కళాసౌందర్యం, శైలీ సౌందర్యం, నిరలంకార శబ్దార్థ సౌందర్యం, అలంకార సౌందర్యం, శయ్యా సౌందర్యం, భక్తిశృంగార భావశబలతా సౌందర్యం, వంటకాల ప్రీతి అనే వ్యాసాలున్నాయి.

ఈ పుస్తకానికి జి. వి. సుబ్రహ్మణ్యంగారు 'లావణ్యరేఖ' రచించారు. ప్రమాణాల నాశ్రయించి కవితాతత్త్వం నిరూపించబడ వలసి ఉన్నదనీ ప్రమాణాల నాశ్రయించకుండా పరిశీలనం సాగదనీ వారు నొక్కి చెప్పారు.

శ్రీనాథుని గురించి అనేక పుస్తకాలు వచ్చాయి. వస్తున్నాయి. వస్తాయి. రావలసిందే! ప్రాచీన సాహిత్యాన్ని చదివేవాళ్ల సంఖ్య తగ్గు తున్నట్లు కనిపిస్తోంది. ప్రాచీన సాహిత్యాన్ని చదవడం అనవసరమనీ,

సమకాలీన సమాజాన్ని ప్రతిబింబించే 'తమ' ఆధునిక సాహిత్యాన్ని చదవటం ఆరోగ్యకరమనే, అనేకులు ఇప్పుడు ప్రవచిస్తున్నారు. ప్రాచీన సాహిత్యాలలోని అందచందాలు, అందులో నిక్షిప్తమైన శిల్పరహస్యాలూ, సార్వకాలీన సత్యాలూ అనేకం వెలుగులోనికి రావలసిన అవసరం ఎంతైనా ఉంది. అందుకు ఇటువంటి పుస్తకాలు ఎంతైనా దోహదకారులు.

అయితే ఈ పుస్తకంలోని అనేక విషయాలను గూర్చి ఇంతకు ముందే పెద్దలు వ్రాసి ఉన్నారు. దానికేమి? మహాకవులను గూర్చి ఎంతమందైనా వ్రాయవచ్చు. కానీ క్రొత్త విషయాలుంటే ఆకర్షణీయంగా ఉంటుంది.

ఇది ఆంధ్రసాహిత్య విద్యార్థులకు అత్యంతోపయుక్తమైన గ్రంథం. కానీ వ్యావహారిక భాషలో ప్రాచీన సాహిత్యాన్ని గూర్చి వ్రాయడం ఎంత ఎబ్బెట్టుగా ఉంటుందో ఈ పుస్తకం చూస్తే స్పష్టమవుతుంది.

శ్రీనాథుని పద్యరత్నాల సంకలనంగా కూడా ఈ పుస్తకం కొందరికి కనపడవచ్చు.

''అలంకారాలను ఆదరించకుండానే అతని శైలి దర్పోద్ధతితో దివ్యక రేణువువలే చరిస్తుంటుంది.'' (పుట 114)

''కుండానే'', ''స్తుంటుంది'' అనే మాటలు పెట్టి వ్రాయగానే వ్యావహారికం అవుతుందా? ''దివ్యకరేణువులు'' మనం అనుకునే ఈనాటి సామాన్యుని తలబద్దలు కొడతాయి. ఈరకమైన వ్యావహారికంకంటే గ్రాంథికమే వేయిరెట్లు సహజసుందరంగా ఉంటుంది.

## మీరామాధురి

[రచయిత : డా॥ఇలపావులూరి పాండురంగారావు, ప్రకాశకులు: శ్రీ గోదా గ్రంథమాల, ముసునూరు (521 207), కృష్ణాజిల్లా. వెల : ఆరురూపాయలు (88 పుటలు)]

ఇది శ్రీగోదాగ్రంథమాలవారి 'బాలసాహితి' ఇరవైరెండవరత్నం.

అవతారికలో మీరా జీవితచరిత్ర, ఆమె పాటలోని ఆంతర్యం సంక్షిప్తంగా ఉంది.

మీరాబాయి రచించినట్లుగా చెప్పబడుతున్న పాటలు సుమారు నాలుగువందలున్నాయి. అందులో ముత్యాల్లాంటి ముప్ఫయి పాటలను సేకరించి ఈ పుస్తకంలో వ్యాఖ్యాన సహితంగా అచ్చువేశారు. ఇందులో అందానికి చెందినవి నాలుగు, అనురాగానికి అనుబంధించి అయిదు, ఆవేదనా సంబంధమైనవి ఆరు, ఆత్మీయతాత్మకమైనవి ఏడు, ఆనందాన్ని అందుకున్నవి ఎనిమిది పాటలున్నాయి. వ్యాఖ్యానంలో అవసరమైనచోట ఉపనిషత్ సూక్తులను, సంస్కృత శ్లోకాలను ఉదహరించారు.

''భజ్ మన్ చరణ కమల అబినాసీ...'' అనే పాటకు పాండురంగారావుగారి వ్యాఖ్యానం చూడండి.

''ఎంత కూర్చినా, ఎంత నేర్చినా, ఎంతవారికయినా శ్రీకాంతుని చరణములే శరణములని మీరాబాయి తీర్పు. భువికీ, దివికీ మధ్య కనిపించే పదార్థాలు సమస్తం నశించిపోతాయి. చివరకు మిగిలేది శ్రీకాంతుని చరణకాంతి ఒక్కటే. కాబట్టి అనినశ్వరాలయిన ఆ దివ్య చరణారవిందాలను మనసారా భజించుమని మీరాబాయి తన మనస్సుకు బోధిస్తున్నది.''

''ఎన్ని తీర్థయాత్రలుచేసినా, ఎంత కఠోరమైన వ్రతచర్య సలిపినా, కాశీవెళ్లి పడరాని పాట్లుపడి, శరీరాన్ని కృశింపజేసి ఘోర తపస్సు చేసినా యీ శరీరం ఒకానొకరోజు నశించిపోవలసిందే. ప్రపంచంలో ప్రతి జీవీ మరణించవలసిందే. మట్టికుండలా ఈ శరీరం చివరకు మట్టిలోనే కలసిపోతుంది. పగటి వేషాలవలె యీ బ్రతుకు ప్రొద్దుకుంకగానే మాయమైపోతుంది. కాషాయ వస్త్రాలు ధరించినంత మాత్రాన సన్న్యాసికాడు. ఇల్లు వదలిపెట్టిన ప్రతివ్యక్తీ బైరాగి కాడు. యోగంలోని రహస్యం తెలియనివాడు యోగికాడు. భగవదనుగ్రహం లేకుంటే జనన మరణ సంసరణం తప్పదు. కాబట్టే మీరా శ్రీ చరణదాస్యం చేసి తరించాలని పని కల్పించింది. తాను కేవలం అబల. కాని తనకు గోపాలుడే బలం. భవబంధవిముక్తిని ప్రసాదించి తనలో తనను లీనం చేసుకొనే గిరిధర గోపాలుడే మీరాకు శరణ్యం.''

మంచి పుస్తకం ఇది.

## రత్నకుండలిక

[రచన : దినమణి. ప్రాప్తిస్థానములు : 1. శ్రీ ఎ. దినమణి, కొత్తపేట, నూజివీడు. 2. సాహితీసమితి, నూజివీడు, 521 201 వెల : మూడు రూపాయలు.]

భారతంలోని సర్పయాగివృత్తాంతం ఆధారంగా ఈ ఎనిమిది రంగాల నాటిక రచింపబడింది. మూలకథకు అవసరమనుకున్న చోట్ల చిన్నమార్పులు చేసి ఈ నాటికను మనోజ్ఞంగా తీర్చిదిద్దారు.

మన ఇతిహాసాల్లో కనిపించే వానరాదులు నిజానికి జంతు జాతులవారు కాదనీ, ఆయా జంతువుల బొమ్మలను జెండాలపై చిత్రించుకొన్న కొన్ని మానవ జాతులని ఆధునికుల్లో కొందరు కనిపెట్టారు. ఈ నాటిక గూడా ఆ పంథానే అనుసరించింది. ఇందులోని సర్పులను మానవులుగానే రచయిత చిత్రించారు.

సందర్భాన్ని అనుసరించి నన్నయ్యగారి పద్యాలను ఈ రచయిత ఉపయోగించుకున్నారు.

''భారతీయుల పురాణేతిహాసాల్లో బోలెడంత చరిత్ర ఉంది. అంతేకాదు, ఆచరిత్రను మ్రింగివేసేంత కల్పనకూడా చోటు చేసుకున్నది. అయితే, వచ్చిన చిక్కల్లా చరిత్రను కల్పనను విడదీసేందుకు తగిన ఆధారాలు కాలగర్భంలోని అజ్ఞానంలో కలసిపోవడమే.'' ఇలాంటి ఊహలు ఉన్నవాళ్లలో రచయిత ఒకరని మనవి మాటలనుబట్టి తెలుస్తోంది.

మన పురాణేతిహాసాల్లోంచి యథార్థ చరిత్రను లాగుదామని ప్రయత్నించడం అప్పుడప్పుడూ కొందరిలో కనబడుతూంది. ఈ

రచయితా అలాంటి ప్రయత్నం చేసినట్లు అనుకోవచ్చు. ఇది చరిత్ర విద్యార్థులకూ, పరిశోధకులకూ ఆనందం కలిగిస్తుందనడంలో సందేహంలేదు. నాటకం అనేది రసానందాన్ని కలిగించే ఒక సాహిత్య ప్రక్రియ అని భావిస్తే, దానికి యథార్థచారిత్రికాంశాలతో పెద్దపని ఉండదేమో అనిపిస్తుంది. లేదు — సంఘానికి ఉపయోగపడేదే నిజమైన సాహిత్యం అంటే, నేటి సమస్యలతో మంచివిప్లవ సాంఘిక నాటకం వ్రాయవచ్చు.

చారిత్రికాంశాలను వదిలివేస్తే — ఈ నాటక రచనలో రచయిత చూపిననేర్పు ప్రశంసనీయంగా ఉంది. ఒక ప్రాచీన సంస్కృత నాటకానువాదాన్ని చదువుచున్నామనే భ్రాంతి పలుపర్యాయాలు కలుగుతుంది. పాత్ర చిత్రణలో ఈ రచయిత అందె వేసిన చేయి. ఉదంకుని పాత్ర ఇందుకు నిదర్శనం. సుమనపాత్రను కొద్ది రేఖలతో మనోహరంగా చిత్రించారు. ఈ ఐతిహాసిక నాటకంలో గ్రాంథికభాష ఉపయోగింపబడిఉంటే ఇంకా మనోహరంగా ఉండి ఉండేది!

## శ్రీ అరవింద యోగి సాంకేతిక మహా ప్రబంధం - సావిత్రి

(మొదటి పుస్తకం — మహోదయం)

[రచన: శార్వరి. ప్రతులకు: మాధురి పబ్లికేషన్సు, 1-1-592/గాంధీనగర్, హైదరాబాదు — 500 380 వెల: పదిరూపాయలు]

ఈ రచన ఎందుకు చేశారో, ఎలాచేశారో రచయిత "ఎందరో మహానుభావులు..."లో ఇలాచెబుతారు.

"రెండు సంవత్సరాలక్రితం, 1978 ఆగష్టు 4న అది మా గురుదేవులు మాష్టరు సి. వి. వి. గారి జన్మదినం — ధ్యానంలో శ్రీ అరవిందయోగి సావిత్రిని అనువదించమని ఆదేశం వచ్చింది. అయితే నేను ఒక మార్గంలో యోగసాధన చేస్తున్నవాణ్ణి. మరొక మహాయోగి రాసిన మహాగ్రంథాన్ని అనువదించడంలో న్యాయం చేయగలనా? అన్న అనుమానం కలిగింది. ఆగష్టు 15న, అది శ్రీ అరవిందయోగి జయంతి. శ్రీ అరవిందులే నా ధ్యానంలో కనిపించి ఆదేశం ఇచ్చారు. ఆ రోజునే, ఆ సుముహూర్తంలోనే సావిత్రి రచన ప్రారంభించాను."

రచయిత పలు పర్యాయాలు 'సావిత్రి'ని చదివినట్లు, అనువదించేటప్పుడు నాలుగుసార్లు త్రిప్పి రాయవలసివచ్చినట్లుగా తెలుస్తోంది.

సావిత్రిని ఎన్నిసార్లు చదివినా పూర్తిగా అర్థంకాదనీ. కానీప్రతిసారీ అనిర్వచనీయానుభూతి కలుగుతుందనీ ఎందరో అంటుంటారు.

ఈ అనువాదమూ అంతే!

'శ్రీమాత ప్రవచనం'లో 'సావిత్రి'ని పఠించే పద్ధతులున్నాయి. "సావిత్రితో పోల్చదగిన గ్రంథం ఈ ప్రపంచంలోనే మరొకటి లేదని త్రికరణశుద్ధిగా చెప్పగలను" అని 'మదర్' అంటారు.

యమునితో పోరాడి భర్తను బ్రతికించుకొన్న సావిత్రి కథ పురాణ ప్రసిద్ధం. 'ఒక్కమాట'లో సావిత్రి సారాంశం ఇలా ఉంది.

శ్రీ అరవిందులు సృష్టించిన సావిత్రి జగన్మాత. సావిత్రి అంటే తేజస్సు, జ్యోతి, జ్ఞానం. మనిషి తనలో వెలిగిన జ్యోతి తేజస్సుతో సత్యాన్ని అన్వేషించాలి. కథలో సావిత్రి తానుగా సత్యవంతుని అన్వేషిస్తుంది. అది వరాన్వేషణ. ఇది పరాన్వేషణ. సత్యాన్ని తెలుసుకున్న వ్యక్తి మృత్యువును జయిస్తాడు. శాశ్వతమైన అమరత్వాన్ని చేరుకుంటాడు. ఏ లక్ష్యంతో అయితే పరమాత్మనుండి ఆత్మ వేరై అణువుగా భూమిపైన అవతరించి, శరీరాన్నిపొంది, ఒక జీవిత కాలం శ్రమిస్తుందో, ఆ జీవితకాలంలోనే జీవుడు ఆ పరమలక్ష్యాన్ని, గమ్యాన్ని చేరుకోగలగాలి.

ఈ అనువాదం ఒక మహాప్రవాహంలా సాగింది. అయితే ఎంత వ్యావహారిక భాష అయినా 'మేధస్సు' మొదలైన ప్రయోగాల్ని విజ్ఞులు మెచ్చరు. "ప్రస్థావన" మొదలైన శబ్దాల్లో ఉన్న ఒత్తు తప్పులను కూడా దిద్దించుకొని అచ్చువేసి ఉంటే బాగుండేది.

అనువాదానికి ఒక మచ్చు తునక—

అపుడు రహస్యభావ సీమలలోకి నిర్గమించిన
ఆమె మనసు బహురూప గతంలో కదలాడింది
తాను మళ్లీ జన్మించి అంతాన్ని చేరుతున్నట్లు గుర్తించింది
చనిపోతూ అది ఆమెలో అనశ్వరంగా జీవించింది
కనిపిస్తూ చూడగల నేత్రాలకు కనిపించక అదృశ్యమైంది.

**శ్రీ పులిచెర్ల సాంబశివరావు**

## రగులుకొనే రాక్షసిబొగ్గు

[ఈశాన్య భారత్ రాజకీయార్థిక పరిచయం. సురా. యుగ ప్రచురణలు, హైదరాబాద్. మూల్యం ఐదు రూపాయలు]

దేశంలోనూ సమాజంలోనూ ఈశాన్య భారత్ ప్రజలను గురించి వారి భాష, సంప్రదాయాలు, ఆర్థిక చరిత్ర, రాజకీయ సంఘర్షణ గురించి మిగతా ప్రజలకు తెలిసింది చాలా తక్కువ.

గత సంవత్సరంగా విజాతీయుల సమస్యపై ఉధృత స్థాయిలో కొనసాగుతున్న ప్రజాఉద్యమాలు ఈశాన్య భారత్‌ను వెలుగులోకి తెచ్చాయి. ఈశాన్య భారత్ భౌగోళిక, ఆర్థిక, రాజకీయ, సాంఘిక సాంస్కృతిక పరిస్థితులను విశ్లేషించి వాటి సమస్యలను మనముందుకు తీసుకు రావటానికి జరిగిన ప్రయత్నమే ఈ గ్రంథము.

ప్రాంతీయ అసమానతల ప్రాతిపదికగా ఏర్పడ్డ రాష్ట్రాల నిర్మాణం వివిధ భాషా ప్రజలమధ్య వైరుధ్యాలను సృష్టించింది. గత కొన్ని సంవత్సరాలుగా ఈ వైరుధ్యాలు వివిధ రూపాలలో దేశ రాజకీయ జీవితంలో నిత్యభాగమైపోయాయి.

ఈశాన్య భారత్ అస్పష్టమైన విభిన్నజాతుల కలయిక. ప్రతి ప్రాంతంలోనూ జాతులలో తిరిగి ఉపజాతులు అనేకం ఉన్నాయి.

ఆయా ఉపజాతులకు వాటి భాష, మాండలికాలున్నాయి. ప్రజా సమూహాన్ని జాతిగా గుర్తించటానికి ఉపయోగపడే ప్రధాన సాధనం భాష అయితే ఒక భాషాకుటుంబానికి చెందిన కొండజాతి భాషలలో ప్రత్యేకతను గుర్తించటం కష్టం. ఈశాన్య భారత్‌లో ఈ భాషల పరిస్థితి మరింత క్లిష్టంగా ఉన్నది.

ఈశాన్య భారత్‌లోని—అస్సాం, మిజోరం, మణిపూర్, మేఘాలయా, నాగాలాండ్, త్రిపుర, అరుణాచల్‌ప్రదేశ్—జాతులలో (పెట్టుబడిదారీ విధానంతోపాటే) జాతీయతా భావాలు ప్రవేశించాయి. అయితే ఈశాన్య భారత్‌లోని మైదాన ప్రాంతాలకు కొండ ప్రాంతాలకు కొన్ని మౌలికమైన భేదాలున్నాయి— ఈ తేడాలు భూ సంబంధంలోనూ, వలస పారిశ్రామికాభివృద్ధిలోనూ, విజాతీయుల ప్రాబల్యంలోనూ. మధ్యతరగతి పెరుగుదలలోనూ స్పష్టంగా కనిపిస్తాయి. మైదాన ప్రాంతాలలో ఉద్యమాలు భారత జాతీయ స్వాతంత్ర్య పోరాటంలో భాగమైనాయి. అయినప్పటికీ విజాతీయుల ప్రాబల్యాన్ని నిరసిస్తూ (ముఖ్యంగా బెంగాలీ) తమ ప్రత్యేక జాతీయ భేదాన్ని పెంపొందించుకుంటూ వచ్చాయి.

1947 దేశ విభజన సమయంలో నాగాలాండ్, మిజోరం, త్రిపుర, మణిపూర్‌లాంటి ప్రాంతాలలో "సర్వ స్వతంత్ర" అనేభావం బీజాలు వేసుకొంది. నాగాలాండ్‌లో అది మరింత బలపడింది.

బ్రహ్మపుత్ర లోయలో (అస్సాం) ఒకవైపు పాకిస్థాన్ (తూర్పు బెంగాల్) ఆధిపత్యాన్ని నిరాకరిస్తూ ప్రజలు ముందుకు వచ్చి ఇండియన్ యూనియన్‌లో కలిసారు. అయితే ఏదోఒకరూపంలో ఈ కలయిక అసంతృప్తిని పెంపొందించింది. ఈ అసంతృప్తి జ్వాలలే తరవాత కాలంలో పెరిగి విజాతీయుల ఏరివేతకై ప్రస్తుతం జరుగుతున్న బలమైన ఉద్యమాలకు జీవాన్నిచ్చాయి.

ఈశాన్య భారత్‌పై ప్రస్తుత గ్రంథం మార్క్సిస్ట్—లెనినిస్ట్ దృక్పథంతో వ్రాయబడింది. ఈ ప్రాంతాలకు సంబంధించిన అనేక అంశాలు (సమాచారం) కూలంకషంగా చర్చించటానికి ప్రయత్నించింది. సాధారణ చదువరులకు ముఖ్యంగా రాజనీతి విద్యార్థులకు చాలా ఉపయోగపడుతుంది.

శ్రీ వి. కృష్ణారావు

## మొరాదాబాద్ కల్లోలాలు

[రచన: యన్. యన్. వెల: రు. 1. ప్రతులకు: సాహిత్య నికేతన్, ఏలూరురోడ్డు, విజయవాడ–520 002.]

ఉత్తర హిందూస్థానంలో కల్లోలాలు తరచుగా జరుగుతూండడం చరిత్రలో ఒక భాగమైనది. ఈ కల్లోలాలను తాత్కాలికంగా అప్పటికప్పుడు సర్దుబాటు చేయడమే తప్ప శాశ్వత పరిష్కారం ఇంతవరకూ రూపొందలేదు. రాజకీయాలు కారణం అని ఒకప్పుడు వాదించారు. మతం కారణమని మరొకప్పుడు వాదించారు. ఆర్థిక వ్యత్యాసాలు కారణమని మరొకప్పుడు సంజాయిషీ చెప్పారు. కారణాలేమైనా ఇలాంటి సంఘర్షణలు జరగకుండా నిరోధించేందుకు విభిన్నవర్గాల వారిమధ్య సామరస్యాన్ని రూపొందించే యేర్పాట్లు ఇంతవరకూ జరగలేదు. అద్యతన భావిలో జరుగుతాయన్న ఆశలయినా కనిపించవు.

ఇలాంటి సంఘర్షణలలో 1980 ఆగస్టు 13న జరిగిన సంఘర్షణలు ప్రధానమైనవి. ఆ సంఘర్షణల పూర్వగాథనూ, వాటికి దారితీసిన పరిస్థితులనూ, వాటిని ప్రోత్సహించిన శక్తులను గురించిన విశ్లేషణ 21 పుటల యీ చిన్న కరపత్రంలో చాలా బాగా జరిగినది. నిష్పాక్షికంగా, వస్తునిష్ఠంగా జరిగినది. స్థానిక శాసన సభ్యుడు శ్రీ హాఫీజ్ మహమ్మద్ సిద్దిక్ ఆందోళన కారులను ప్రోత్సహించారుట. కొన్ని విదేశ వాహనాలలో ఆయుధాలను ఆందోళనకారులకు అందజేశారుట. ఇంతకూ ఆ కల్లోలాలకు కారణం ముస్లిమ్‌ల ఈద్ ప్రార్థనా స్థలివద్ద సూకరం ఒకటి కనిపించడమట. ఇది కేవలం నెపమే గానీ, నిజం కాదని యీ చిన్న కరపత్రంలో చక్కగా రుజువు చేశారు. మతతత్వవాదులలో కొందరి పైశాచిక ప్రవృత్తిని యీ కరపత్రం విశదం చేస్తున్నది. మొరాదాబాద్ కల్లోలాల వెనుక పెద్ద కుట్ర వున్నదని చాలామంది విజ్ఞులంటున్నారు. రాజకీయవాదులు కూడా యీ వాదనను సమర్థిస్తున్నారు. 1978లో మొరాదాబాద్‌లో 12 ఇస్లాం దేశాల సమావేశం జరిగింది. ఆ సమావేశం చేసిన నిర్ణయాలకూ యీ కల్లోలాలకూ సంబంధం ఎంతవున్నదో, కేంద్ర ప్రభుత్వం ఎందుకని ఇంతవరకూ దర్యాప్తు జరిపించలేదు. ఇక తైలాయుధుల ధన ప్రవాహం మొరాదాబాద్ కల్లోలాలకు ఎంతబలం ఇచ్చిందో, అక్కడి పోలీసు స్టేషన్‌లపై జరిగిన దాడులవంటి వాటివల్ల విశదం కాలేదో, చట్టవిరుద్ధంగా ఉత్తర ప్రదేశ్‌లో సంఘవిద్రోహులవద్ద పెద్దయెత్తున ఆయుధాలుండడం ఎన్నటికైనా దేశానికి ముప్పుగా పరిణమించదా? తన్నివారణకు కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు ఇంతవరకూ ఏమి చేసినవి?

పలు మతాలున్న యీ దేశంలో యేదోఒక వర్గాన్ని ఎప్పుడూ సంతృప్తిపరచే విధానాన్ని కేంద్రప్రభుత్వం అనుసరించడం వాంఛనీయమా? ఇలాంటి కల్లోలాలలో ఆర్. యస్. యస్. జనసంఘం వంటి సంస్థలను ఇరికించడం కేవలం రాజకీయ మవుతుందేమోకానీ, రాజకీయ విజ్ఞతమాత్రం కాజాలదు.

మొరాదాబాద్ కల్లోలాలు దేశంలోని విజ్ఞులకు ఒక గుణపాఠం. ఆ కల్లోలాల పుట్టుపూర్వోత్తరాలను, అలాంటివి ఇకముందు జరుగకుండా నిరోధించడానికి గైకొనవలసిన చర్యలను గురించి తెలుసుకొనదగిన వారందరూ విధిగా చదవవలసిన కరపత్రం ఇది.

శ్రీ వి. ఎస్. అవధాని

## తొలినాటి తెలుగు కథలు

[సంకలనకర్త: శ్రీ మధురాంతకం రాజారాం. ప్రచురణ: ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, పేజీలు: 438, వెల: 8 రూపాయలు. ప్రాప్తిస్థానము: ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, సైఫాబదు. హైదరాబాదు.]

సహజంగానే పుట్టినప్పటినుంచీ తెలుగుకథ, కాలానుగుణ్యంగా అనేకమయిన మార్పులకి లోనవుతూ వస్తున్నది—ముందు ముందే

ఇంకా ఎన్నిమార్పులకో గురయ్యే అవకాశమూ వుంది. సమకాలికమయిన ఇతర భాషల కథాప్రభావం తెలుగు కథమీద పడటమూ కాలమాన పరిస్థితులనుబట్టి తెనుగుకథ తానుగా సంతరించుకున్న కొత్తందనాలూ అందుకు కారణమనవచ్చును.

పరిమాణంలో, భాషలో, శిల్పంలో, శైలిలో, వస్తువులో, ప్రయోజనంలో- ఈనాటి తెలుగుకథ ఒకనాటి ప్రాథమికదశని దాటి చాలా ముందుకు పోయిందనవచ్చును. అంతమాత్రాన తెలుగుకథ సమగ్రమయిన పరిణామము పొందినదన్న శ్రీ దేవులపల్లి రామానుజరావు మాటని అవుననటానికి వీలులేదు.

జీవితాన్ని ప్రతిబింబించవలసింది సాహిత్యం. జీవితానికి సమగ్రమయిన పరిణామమంటూ వుండటానికి వీలులేదు. అలాగే సాహిత్యానికీ, దానియొక్క ఒక శక్తిమంతమయిన ప్రక్రియ అయిన కథకూ సమగ్రమయిన పరిణామము వొనగూడిన దనటానికి అవకాశం వుండరాదు. వొకవేళ అలాగజరిగిననాడు స్తబ్దతలో అది లయమయినట్లే. సమాజాన్ని వుద్దేశించిన ఏ కళాసాధనమూ అటువంటి పరిస్థితికి లోనుగావటం అనభిలషణీయమైనది. పోతే—

ఒకనాటి పరిశుద్ధ గ్రాంథికాన్నీ, ఆ తరువాతి శిష్టవ్యావహారికాన్నీ, దాటిన తెలుగుకథ ఈనాటికి పూర్తిగా వ్యావహారికాన్ని ఆశ్రయించుకున్నది.

ఆనాటి పండితులు, రచయితలు తమ భావుకతతో వైయక్తికమయిన విషయాల్ని విశ్లేషించి కథలను తయారించగా ఈనాటి కథకులు సమాజాన్నీ, వాస్తవికతనీ ప్రతిబింబించే బదుగు ప్రజల కథల్ని అందిస్తున్నారు.

చమత్కారాలతో, భాషాభేషజాలతో ఆనాటి కథ నడువగా ఏ అలంకరణలూలేని నిరాడంబరతని ఎన్నుకున్నది ఇప్పటి తెలుగు కథ.

కేవలం తర్కము, భావనైశిత్యము ఒకనాటి కథయొక్క శైలి కాగా పాఠకుణ్ని పట్టుకుని నడిపించగలిగిన ఉత్కంఠ గలిగిన శైలిని ఈనాటి కథ ఎన్నుకున్నది.

ప్రభువులు, రాజాశ్రితులు వారి భేషజాలు, బలహీనతలు, అప్పటి ఆచార వ్యవహారాలు, నమ్మకాలు ఆ 'కథ'కి వస్తువులు కాగా, అట్టడుగు ప్రజల బ్రతుకులు, దోపిడీ, తిరుగుబాటు, ఆకలి, కన్నీళ్ళు నేటి తెలుగు కథకి ప్రధానమైన వస్తువులయ్యాయి.

కొండవీటి చాంతాడుల్లాగ సాగిన ఒకనాటి కథాస్వరూపం ఈనాటికి క్లుప్తతని అమరిక చేసుకుంది. పొందికని తెచ్చుకొనగలిగినది.

ఆలోచన, ఆనందం, అనుభూతి పాఠకునికి అందించటాన్ని ఆనాటి కథ ధ్యేయంగా పెట్టుకోగా, సామాజిక చైతన్యం ఇప్పటి తెలుగు కథకి ప్రాథమిక ప్రయోజనమయింది.

ఎత్తుగడలోను, శైలిలోను కొత్త కొత్త పోకడలని సంతరించుకొని; భాషలోను, భావనలోను అభ్యుదయకరమయిన మార్పుల్ని తెచ్చిపెట్టుకుని, వాస్తవికతనీ, నిజాయితీని కలిగివుండి, వ్యవస్థలో, పద్ధతులలో, విప్లవాత్మకమయిన మార్పుల్ని అభిలషిస్తూ, సమాజాన్ని అద్భుతంగా ప్రభావితం చేయగలిగిన శక్తిమంతమయిన ప్రక్రియగా రూపొందింది ఈనాటి తెలుగు కథ.

అయితే, ఒకప్పుడు తెలుగు సాహిత్యంలో అగ్రాసనాన్ని అధివసించిన తెలుగు కథ, ఈనాటికి నవలా ప్రాబల్యానికి తలవొగ్గి రెండవ స్థానానికి జారినా, అది ఇంకా నీరస స్థితికి దిగిజారలేదనవచ్చును.

సాహిత్యంలో వ్యాపార దృక్పథం ప్రవేశించి, సాహితీ బేహారుల ఇనుప కౌగిలిలో నలిగిన తెలుగుకథ, వెలుగును చూడలేకపోతున్నది. తెలుగు కథాసంపుటాలు రావటం అరుదయినది. పబ్లిషర్లు నవలా నవలల వ్యామోహంలోపడి కథా కన్యలపయిన శీతకన్ను వెయ్యటం ప్రారంభించి చాలా సంవత్సరాలయింది. కేవలం పత్రికలు మాత్రమే తెలుగు కథని ఆదుకోవలసిన విచిత్రమయిన పరిస్థితి ఏర్పడింది.

అందువలన—

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు తొలినాటి తెలుగుకథలు అన్న పేరు గలిగిన ఈ పుస్తకాన్ని వేయించటం అభినందించదగిన విషయము అనాలి. కాగా—ఈ పుస్తకంలోనివి, చాలవరకు ఒకప్పటి ప్రసిద్ధ కథకుల కథలు. మొదటి తరము కాలమునకు సాధ్యమయినంత వరకు ప్రాతినిధ్య ప్రాయమయిన రచనలను నేటి పాఠకులకు అందించే ముఖ్యోద్దేశ్యముతో ఇందులో కథలను ఏరి కూరి (?!) ఈ పుస్తకాన్ని తెచ్చామన్నారు కార్యదర్శి. తెలుగు కథకు మొదటితరంగా 1936 నుండి 1945 వరకూ కాలాన్ని నిర్ణయించటం జరిగింది. ఈ కాల ప్రమాణానికి ఆధారాన్ని గాని, ప్రాతినిధ్యానికిగాను తాను ఎన్నుకున్న ప్రమాణాల్నిగాని సంకలనకర్త వివరించలేదు.

ఈ పుస్తకంలో ఇరవయినాలుగు కథలున్నాయి. కొన్నిటికి ప్రచురణ కాల వివరణ వున్నది. కొన్నిటికి లేదు. కారణం తెలియదు.

వీటిల్లో, ప్రతిభ దృష్ట్యా — ఆ కాలానికే గాక ఈ కాలానికయినా ఎత్తున నిలిచి, తెలుగు కథా పటిమని తెలియజెప్పేవి, సురవరం ప్రతాపరెడ్డిగారి సంఘం పంతులు, బుచ్చిబాబుగారి ఆ వాడిన ఆకులు, పాలగుమ్మి పద్మరాజుగారి పడవ ప్రయాణం, జమదగ్నిగారి అన్నదమ్ములు, మాధవపెద్ది గోపాలకృష్ణగోఖలేగారి స్మరణ అన్న పేరుగల కథలు.

మునిమాణిక్యం నరసింహారావుగారి 'బద్‌నసీహత్', సున్నితమయిన హాస్యాన్ని విరజిమ్మితే, భమిడిపాటి కామేశ్వరరావుగారి 'మడత పేచీ' రాటుదేలిన తర్కాన్నీ, మొరటు హాస్యాన్నీ అందిస్తుంది.

ఒక స్వార్థపరుడి మానసిక వ్యభిచారాన్ని చిత్రించిన కొడవటిగంటి 'అపనమ్మకం' కథ ప్రయోజనం దృష్ట్యా, ప్రాతినిధ్యం దృష్ట్యా అనర్హమయినదనాలి. చాగంటి సోమయాజులుగారి ఊహా పూర్వశి ఈ కోవకే చెంది వెర్రిమొర్రిగా నడిచిన కథే.

గోపీచంద్, చిలుకూరి నారాయణరావు, చింతా దీక్షితులు, విశ్వనాథ సత్యనారాయణ, వేలూరి శివరామశాస్త్రి, అడవి బాపిరాజు, చలంగారల, ఈ పుస్తకంలోపడ్డ కథలన్నీ కేవలం చమత్కారమే కలిగివుండిన ప్రయోజన శూన్యమయిన రచనలనక తప్పదు. వీటి నిండా అసహజత్వం, సార్వజనీనతారాహిత్యం వున్నాయి.

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి గులాబీ అత్తరు సువాసన మనోహరంగా అన్పిస్తుంది. కాని ఫ్యూడల్ వ్యవస్థలో వొలికిన ఈ అత్తరు యొక్క అవసరం సామాన్యుడి కేమిటి? నాడూ—నేటికిన్నీ.

మునలి మరదితో కడుపు చేయించుకుని చివరికి పిరికిదానివలె ఆత్మహత్యకి పాలుపడిన నల్లాది రామకృష్ణశాస్త్రిగారి, 'సర్వమంగళ' ఇటువంటి పుస్తకంలో చేరి ఆయనమీద బురద చల్లిందిగదా అన్నటు వంటి బాధ కలుగకమానదు.

శేకుమళ్ళ కామేశ్వరరావు 'పళ్ళపండగ', కవికొండల వెంకట రావు 'లిగాడు', కరుణకుమార 'అంటుజాడ్యం', 'బాలింతరాలు' ఎ. సీ. అంజనేయశాస్త్రి రచన, 'తీర్పు' క్రొవ్విడి లింగరాజు రచన, 'పొరపాటు అన్నయ' వెంచాశా రచన—తొలినాటి తెలుగుకథకి ప్రతి భావంతమయిన ప్రాతినిధ్యం వహించగల రచనలు అన్పించవు. పేలవ మయిన వస్తువులు, మవులిక లక్షణాల కొఱత, ప్రయోజన శూన్యత కలిగిన ఈ రచనల్ను సంకలనకర్త ఏరికూరి (!) అందించటానికి పూనుకోకుండా వుండాలిసింది.

అన్నింటిలోకీ ఆశ్చర్యాన్ని కలిగించేది — 'పొరపాటు—అన్నయ'. దాని ప్రచురణకాలం ఇవ్వలేదు. అటువంటి రచనలు 'తెలుగుకథ'కి ప్రాతినిధ్యం వహించవలసిరావటం — 'దాని' దురదృష్టమనాలి.

ఈ సంకలనం యొక్క వుద్దేశ్యం వుత్కృష్టమయిందే—యినా సంకలనలోపం కొట్టవచ్చినట్లు కనపడుతున్నది. ఒకప్పుడు తెలుగుసాహిత్యంలో ప్రముఖులయిన, ఎన్నోకథలు అందించిన ఆయా కుల యొక్క ఈ కథల ఎన్నిక సరిగా జరగలేదనాలి. ఇందువలన గా రచయితలమీద ఈనాటి పాఠకుడు ఏర్పరచుకొన్న అభిప్రాయం గల వీలువున్నది. అందువలన అకాడెమీవారు ముందు ముందు గ్రమయిన కృషిగలిగిన సంకలనాల్ని అందించి, తెలుగుకథకి స్పష్టమయిన సేవచేయవలసిందిగా మనవి చేయాల్సిన అవసరాన్ని పుస్తకం తోపింపచేస్తున్నది.

ఇంత పెద్ద పుస్తకంలో ఎక్కడా అచ్చుతప్పులు లేకుండా డటానికి కృషిచేసిన ప్రచురణకర్తలు, విషయసూచికలో గోఖలే మాదవరెడ్డి గోపాలకృష్ణగోఖలే అని అచ్చువేయించారు!

అందమయిన అచ్చులూ, చక్కటి ముద్రణా ఈ పుస్తకానికి అలంకారాలు. అట్టనిగురించి మరికొంతశ్రద్ధని కనపఱచాలిసింది!

# థామందారము

(...డవ సంపుటము)

[సంకలనము : శ్రీమతి ఆవుల జయప్రదాదేవి. ప్రచురణ : ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి. పేజీలు : 284. వెల : ఆరురూపాయలు. ప్రాప్తిస్థానం : ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ కళా భవనము, సైఫాబాదు, హైదరాబాదు—500 004.]

కళకి ఆడా మగా తేడాలేదు. అలాగే సాహిత్యానికీ ఆ వివక్ష ఉండరాదు. అయితే తెలుగు సాహిత్యాన్ని తయారు చేస్తున్నవారిలో కేవల ఈ ఆడా, మగా తేడాలు వచ్చాయి. అందుకు సాహిత్య అకాడమీలవంటి సంస్థలు ముందుకువచ్చి అటువంటి తేడాల్నిపెంచటం మనసుల్లో ఒక 'విచారాన్ని' కలిగించగలుగుతున్నది. ఆడ రచయితల ...హా సంఘాలు, ఆడ రచయితల మీటింగులూ పెట్టిన, సాహిత్య అకాడమీ వర్గ రచయితల్ని సృష్టించి ఒకరకంగా సాహిత్యానికి అప మేచేస్తూ వుందన్నమాట వస్తూ వున్నది.

అకాడమీ చేస్తున్న ఈ పనివలన స్త్రీ రచనలు, పురుష రచనలు అన్న వర్గీకరణ వచ్చింది. ఆడతనంలో స్వతహాగావున్న గ్లామర్ వలన 'ఆడరచనల'కు గిరాకీ పెరిగింది. పత్రికలు తమ సర్క్యులేషన్ పెంచుకోవడం కోసమూ, పబ్లిషర్లు డబ్బుచేసుకోవటం కోసమూ ఈ ఆడరచనల వేటలో పడ్డారు. రచయిత్రుల ఇళ్ళచుట్టూ తిరిగి - వారం వారం లేక నెలనెలా ఒక సీరియల్ నవలలో 'ఆ భాగాన్ని' రాసి రచయిత్రి అందించగా కళ్ళకద్దుకుని వేసి, గొప్ప ప్రకటనల్తో తెలుగు సాహిత్యాన్ని వుద్ధరిస్తున్నామని కాలరెగరేసి చెప్పుకునే పత్రికాధిపతులూ, పోటీలుపడి, కాళ్ళకు బలపాలు కట్టుకుని తిరిగి డబ్బిచ్చి రచయిత్రులిచ్చిన ఆ వ్రాతప్రతుల్ని కళ్ళకద్దుకుని తెచ్చుకుని ప్రింటు గొట్టించి, పత్రికల్లో సీరియల్‌గా రాని (రాలేని అనుకోగూడదా?) నవలారాజాన్ని నేరుగా పాఠకుల కందిస్తున్నామని ప్రకటించుకొని వ్యాపారాన్ని పెంచుకొననేర్చిన ప్రచురణ కర్తలూ — చెమ్కీ టోపీలు పెట్టుకుని సాహిత్యాన్ని వుద్ధరిస్తున్నామని కేకలేస్తూ ఏం చేస్తున్నారూ అంటే — గ్లామర్ని నిర్దాక్షిణ్యంగా వాడుకుని వాళ్ళు — తమ వ్యాపారాన్ని పెంచుకుని లక్షల్నార్జించటం సంగతి అటుంచితే,

ఈ రచయిత్రులను మulaగచెట్లెక్కించి, వాళ్ళ కలాల్నుంచి పుంఖాను పుంఖాలుగా వీలయినంత పరమచెత్త వచ్చి అచ్చుపడి, స్థాయీపరంగా దిగజారిపోయేటట్లు చేస్తున్నారు. అందుకు వీలయినంత దోహదం చేయటాన్కి అకాడమీ పెడుతున్న ఈ సంఘాలూ, సభలున్నూ తోడుపడుతున్నాయన్నమాట వున్నది.

పోతే — పులిమీద పుట్రలాగా ఆడపేర్లు పెట్టుకుని రెండు చేతుల్తోను రాసిపారేసే మగరచయితలు వచ్చారు. అంతేగాక భార్యల పేర్లతో ఎడాపెడారాసి పారేస్తున్న భూతరచయితలూ చొరబడ్డారు. వంటింట్లోకి చొరబడిన దొంగల్లాగ వీళ్లంతా నానా కంగాళీచేసి పారేస్తున్నారని అదొక గోలా బయలుదేరింది.

ఈ గోలలో గోలగా — వచ్చిన అవకాశాన్ని ఏ పరిస్థితులలోను వదులుకోకుండా? ఒక హిందీ సినిమా చూసీ, ఒక ఇంగ్లీషు నవలని చదివీ, ఆవస్తువులకి మరికొంత అయోమయాన్ని కలిపి, నవకాయ వంటకాల్ని చప్పిడి దినుసుల్తో మిళాయించి, సినిమావాళ్ళకీ, పత్రికలవాళ్ళకీ, ప్రచురణ కర్తలకీ అమ్మటాన్కి సిద్ధంచేసి, ప్రకటనలు కూడా అచ్చేసి, చలామణి చేయించి, డబ్బుదండుకోవాలని ప్రయత్నిస్తున్నారు కొందరు రచయిత్రీ మణులూ! కేవలం ఆర్జనే ప్రధానంగా, వ్యాపార దృక్పథం రచయిత్రుల్లోనూ మితిమీరిపోయి, ఇదంతా నెఱిగా పుట్టుకువచ్చిన వాపు. అయితే వాపు బలంకాదు.

అవాస్తవికత నిండిన చెత్తనీ, వంటిల్లు దాటని కబుర్లనీ, పరిణతి చెందని ఆలోచనల్నీ, చేతికి అందక వూహాల్లో తేలియాడించే అభూత ప్రణయ ఘట్టాలనీ గుప్పించి విజృంభిస్తూ వున్న ఈనాటి రచయిత్రుల రచనలు బహుముఖ ప్రజ్ఞతో ముందడుగు వేసాయన్న దేవులపల్లి రామానుజరావుగారి 'కితాబు' పరిశీలనా లోపం వలననో, అనాలోచితంగానో ఇచ్చినది అనక తప్పదు. పత్రికలూ, ప్రచురణ కర్తల్లాగే — గ్లామర్‌కోసమో, లేక కావాలనో రచయిత్రుల రచనల వెంటబడిన అకాడమీవారు కథామందారము అన్నపేరుతో కొందరు 'ఆడంగుల' కథల్ని ఏరించి వేయించిన రెండవ కథల సంపుటము ఇది.

ఇందులో — ఇతివృత్త వైవిధ్యము, శైలీవైవిధ్యము మాత్రమేగాక వ్యక్తుల స్వభావాల సూక్ష్మ పరిశీలనా చిత్రణకూడా కన్పించినట్లు తొలి పలుకులకర్త సెలవివ్వటం జరిగింది! స్వయం సమగ్రత, ఏకాంశవ్యగ్రత, సంక్షిప్తత అనేవి కథానిక యొక్క మవులిక లక్షణాలు అన్న సంకలనకర్త అభిప్రాయంతో ఎవరూ భేదించరు. కాని — వారు, స్త్రీ రచయితల మూలంగా సరళమయిన అందమయిన శైలి వచ్చిందంటే—రచయిత్రులు గుప్పిస్తున్న సెక్సు మసాలాల్ని వేలెత్తి చూపక తప్పదు. కవుగిట్లో ఒదిగిపోవటం, సున్నితంగా పెదిమలకి పెదిమలు అంటటం, గాఢంగా చుంబించటం, మూతి ఎంగిలిని సుతారంగా తుడుచుకోవటం మొదలయిన చాలా పుస్తకాల్లోని తప్పనిసరి వర్ణనల ద్వారా, సెక్సుని ప్రేరేపించిన రచయిత్రులు వంటింటినేగాక పడకటింటిని గూడా బజారుకెక్కించి ఆ రకంగా 'అందమయిన శైలి'ని అందిస్తున్నారా అన్నటువంటి ఆశ్చర్యం కలుగకమానదు అంటున్నారు కొందరు పరిశీలకులు.

ఈనాడు వచ్చిపడుతున్న స్త్రీ రచయిత్రుల చాలా రచనలలో— 'వారు తమ పరిధులను విస్తృతం చేసుకుని ప్రతిభ గిలిగిన సాహిత్యాన్ని అందించే ధోరణులు' కోసం కాగిడాపెట్టి వెతకాల్సి వుంటుందని చెప్పక తప్పదు.

అందువలన—రచయిత్రులు తమవర్గ తత్వాన్ని విడనాడాలని, ఆలోచనకి తావిచ్చి కృషి చేయాలనీ, మగవాళ్ళమీద దండయాత్రలూ, తీరని కోరికల ప్రణయ వర్ణనలూ సాహిత్యానికి మేలుచేయవనీ మనవి చేయటం తప్పనిసరి అన్పించుతుంది.

**పోతే —**

ఈ సంపుటంలో ఇరవయి ఆరుమంది రచయిత్రుల రచనలు చోటు చేసుకున్నాయి.

సమగ్రత దృష్ట్యా, శిల్పందృష్ట్యా, వైవిధ్యం దృష్ట్యా, సార్వజనీనత దృష్ట్యా రెండు మూడు రచనలు మాత్రం కథలుగా నిలుస్తాయి. ఒకటో రెండో కథలలో తప్ప సామాజిక ప్రయోజనం అనేది మిగతా వాటిల్లో లేదు. హాస్యమేమన్నా వుందా అంటే అది అసలు లేదు!

కేవలం పేరుగొన్న రచయిత్రులమీద చూపిన మోజువలన ఈ సంపుటి లక్ష్యం దెబ్బ తిన్నదనాలి.

అద్భుతమయిన శిల్పము, మనోహరమయిన శైలీ, గుండెల్ని జలదరింపచేసే వస్తువులు, ఆలోచింపజేసే నిర్మాణమూ గలిగిన కథలని కొన్నిటిని రచయిత్రులు అందించకపోలేదు. అవి ఈ సంపుటంలో చోటు చేసుకోలేకపోయినాయి. అదే విచారించవలసిన విషయం. రచయితని చూసిగాక రచనని చూసి ప్రమాణాల్ని నిర్ణయించటం అన్నది మనం అలవరచుకొనేది ఎప్పుడు? అయినా, ముఠా తగాదాలలో, గ్రూపు ఫైటింగులలో మునిగితేలటానికి అలవాటుపడిన 'మనవాళ్ళకి' అంత తీరిక ఎక్కడిది అనుకోవాలా? కాగా — ఈ పుస్తకంలోని కథలలో — మాలతీచందూర్ గారి 'మతం', యశోదారెడ్డిగారి 'సీతక్క పెండ్లి', లక్ష్మీరమణగారి 'బల్లకట్టు బాపులు', మంజులతగారి 'చిన్నారి ప్రేమలేఖ'—పేర్కొనదగిన కథలు.

సరళమయిన నడకా, మనోహరమయిన శైలీ, సస్పె[illegible] సెంటిమెంటూ — 'మతం' అన్న కథలో వున్నాయి. 'సీతక్క పె[illegible] చక్కని తెలంగాణా మాండలికంలో సాగిన కథ. గుండెల్ని పట్టి[illegible] వర్ణనలు తెలంగాణా గ్రామీణ వాతావరణాన్ని, పల్లెపట్టు [illegible] మనసుల్ని కళ్ళ ఎదుట నిలుపుతాయి. ఇందులో సామాజిక [illegible] యొక్క వాస్తవ చిత్రణవుంది. ఆ సమస్యని సాహసంతో ప[illegible] రించిన యువతరం కథ ఇది. 'బల్లకట్టు బాపులు' కథలో [illegible] సున్నితమయిన మనస్తత్వ చిత్రీకరణవుంది. పాఠకుడ్ని ఆలోచి[illegible] చేసే గుణం కలిగిన చక్కని కథ ఇది. 'చిన్నారి ప్రేమ[illegible] అమాయికత్వం చమత్కారంతో సాగిన కథ. ఇందులో కొసమె[illegible] తళుక్కుమంటుంది.

'మిసెస్ అండ్ మిస్టర్ సక్సేనా' మంచి శైలీ విన్యాసం [illegible] కథ. కాని చివరికి ఏ ప్రయోజనాన్నీ ఆశించలేకపోయింది ఈ [illegible]

'పాము కాటు' అన్న రచనలో ఏదో చెప్పటానికి ప్రయత్ని[illegible] ఏమీ చెప్పలేక పాఠకుడ్ని అయోమయంలో పడవేస్తారు రచయి[illegible]

'కొమ్మ చిగురించింది' అన్న కథలో అవాస్తవికమ[illegible] అసంగతమయిన వస్తువుని పట్టుకుని అందమయిన తన బూడిదలో పోసినంత పనిచేశారు రచయిత్రి.

'బ్రతకవలసిన మనిషి' కథలో రచయిత్రి తన కసిని [illegible] అవాస్తవికమయిన సంఘటనని భయంకరంగా వర్ణించ[illegible] తీర్చుకుని ఏడ్చి తృప్తిపడతారు. కథలోని కృతకత్వం పా[illegible] కదిలించలేకపోతుంది.

'వాన వచ్చింది' అసహజమయిన సంఘటనల్తో కృతకంగా[illegible]

'ఆముక్త' అర్థం పర్థం లేకుండాసాగి అయోమయమనిపిస్తు[illegible]

'తనదాకా వస్తే' ఒక మూస కథ. ఇట్లాంటి కథలు వరకు చాలావరకూ వచ్చివున్నాయి.

మిగతా రచనలు అంతంత మాత్రంగానే వున్నాయి. యొక్క ఏ ఒక మవులిక లక్షణం కోసమయినా చాలా శ్ర[illegible] వెతుక్కోవాలి — వీటిల్లో.

మన రచయిత్రులు కథనంలో, శిల్పంలో, వాస్తవికత[illegible] క్షుప్తతలో, సమగ్రతలో ఇంకా చాలా కృషి చేయవలసి వుంట[illegible] అనాల్సిన అవసరాన్ని ఈ పుస్తకం ఋజువు చేస్తుంది. ఆ కేవలం రచయిత్రులదే అని అనటం అన్యాయం. కారణం — కొన్ని గొప్పకథలు రాయకపోలేదు. కాని ఆ కథలకి ఈ పుస్తకం[illegible] స్థానంలేకుండా పోయింది. అందుకే అలాఅనక తప్పదు. అందు[illegible]

తెలుగు కథకి ఏమయినా సేవ చేయాలని అకాడమీ కుంటే, రచయిత్రులవే అయినా పేరుని బట్టిగాక గుణాన్ని మాత్రమే (రచయిత్రుల గొప్ప కథలూ వచ్చాయి.) కథల్ని చేసి, అందుకు కొంత కష్టపడినాక మాత్రమే ఇటువంటి టాల్ని తీసుకురావటం అన్నది తన కర్తవ్యంగా గుర్తిం[illegible] అవసరం అకాడమీకి వుందని చెప్పాలిసి వుంటుంది.

శ్రీ పాలడుగు వెంకటేశ్వరరా[illegible]

**Printed and Published for Nageswara Rao Estate (Private) Ltd., by S. Radhakrishna at the Andhra Pa[illegible] Press, Gandhinagar, Vijayawada-3. Editor S. Radhakrishna, Vijayawada. Phones: 75667 & 612**

"సాంప్రదాయ సిద్ధమయిన
భారతీయ ఔషధాలకి
ప్రత్యేకమయిన శక్తివుంది.
ఉదాహరణకి,
అమృతాంజన్."




ప్రకృతిలో లభించే అత్యంత
శక్తివంతమయిన పది మూల
ఔషధాలతో అమృతాంజన్ తయారు
చేయబడుతోంది. అంటే అమృతాంజ
చాలా శక్తివంతమయినది.

అందుచేత అమృతాంజన్
తలనొప్పులకు, జలుబులకు,
వంటినొప్పులకు, బెణుకులకు
శీఘ్రంగానూ, నిశ్చయంగానూ
ఉపశమనం కలిగిస్తుంది.
అంతేకాదు అమృతాంజన్
సురక్షితమయిన బాధా నివారిణి.

**అమృతాంజన్ :**
**80** సంవత్సరాలకు పైబడిన
నమ్మకమైన దివ్య
ఔషధము

# అమృతాంజన్

## తలనొప్పులకు .జలుబులకు.
## వంటినొప్పులకు .బెణుకులకు

